# వాసిష్ఠ మహారామాయణము



శ్రీ శుక బ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి

ॐ

# వాసిష్ఠ మహా రామాయణము

రచయిత

**శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు**




శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి

2000

మొదటి ముద్రణ 1990 2000 ప్రతులు
రెండవ ముద్రణ 2000 1000 ప్రతులు

వెల :

ప్రతులకు :-

మేనేజరు
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు)
శ్రీ కాళహస్తి - 517640
(A. P)

అక్షరకూర్పు :
గీతా కంప్యూటర్స్, మద్రాసు

ముద్రణ :
నాగార్జున ప్రింటర్స్
చెన్నై - 21

# ముందుమాట

ప్రాపంచిక విషయభోగాలలో మానవునికి శాన్తి లభించడం లేదు. కాబట్టే నేడు భౌతికంగా లోకం ఎంత ఎదిగినా ఆధ్యాత్మికంగా ఎదుగుదల లేనందుచే మానవునికి శాన్తి, ఆనందం మృగ్యమైంది.

మఱి శాన్తి, ఆనందం ఎందులో లభిస్తుంది? శ్రుతి మాత అంటూంది - అనేకంలో ఏకాన్ని ఎవడు చూస్తాడో, అనిత్యాలలో నిత్యాన్ని ఎవడు దర్శిస్తాడో, అచేతనాలల్లో చేతనను ఎవడు తనలోను చూడగల్గుతాడో అతనికి శాశ్వత శాన్తి - ''తేషాం శాన్తిః నేతరేషాం'' ఇతరులకు గాదు అని ఎలుగెత్తి చాటింది.

పూర్వం అశాన్తితో దుఃఖంతో వున్న 16 ఏండ్ల వయస్సుగల శ్రీరామచంద్రునికి శాన్తి మార్గాన్ని శ్రీవసిష్ఠమహర్షి బోధించాడు. ఆ బోధతో శ్రీరాముడు పరమశాన్తిని పొందాడు. విశ్వామిత్రుని యాగ సంరక్షణకు బయలుదేరాడు. ఆ బోధే యోగ వాసిష్ఠం, లేక వాసిష్ఠ రామాయణం. దీనిని కూడ రామాయణాన్ని రచించిన వాల్మీకి మహర్షే రచించాడు. ఇది 32 వేల శ్లోకాల గ్రంథం.

దీని ప్రాశస్త్యాన్ని గురించి స్వామి రామతీర్థ ఇలా అన్నారు - ''ప్రపంచంలో ఇంతవఱకు వెలువడిన మహాగ్రంథరాజాలన్నింటిలో అత్యద్భుతమైన వానిలో యోగవాసిష్ఠం ఒకటి'' అని. బ్రహ్మదేవుడే ఈ గ్రంథాన్ని గురించి చెప్తూ ''నౌకచే సముద్రాన్ని దాట గలుగునట్లు ఈ వాసిష్ఠ రామాయణ విచారణచే సంసారసాగరాన్ని సులభంగా దాటగలరు'' అని అన్నాడు.

వసిష్ఠ మహర్షే దేన్ని తెలుసుకొంటే మరల దుఃఖంలో పడరో దాన్ని గురించి శ్రీరామునికి చెప్తూ - ''ఆత్మజ్ఞానప్రధానానామిద మేవ మహామతే, శాస్త్రాణాం పరమం శాస్త్రం మహారామాయణం శుభమ్'' - ఓ గొప్ప బుద్ధిగల రామా! ఆత్మజ్ఞానాన్ని బోధించు ప్రధాన శాస్త్రాలలో శుభప్రదమైన ఈ వాసిష్ఠ మహారామాయణమే సర్వోత్తమము అని అన్నాడు.

అంతేగాక ఆ వసిష్ఠమహర్షే ఈ గ్రంథాన్ని గురించి 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్, ఇమం సమస్త విజ్ఞాన శాస్త్రకోశం విదుర్బుధా:'' – ఈ వాసిష్ఠ రామాయణంలో యేది వుందో అదే ఇతర శాస్త్రాలలోను వుంది. ఇందులో యేది లేదో అది ఇతర శాస్త్రాలలోను లేదు. పండితులీ వాసిష్ఠాన్ని సమస్త విజ్ఞానాలకు కోశం అని అంటారు.'' అనీ చెప్పాడు. ఇది మోక్షానికి ఉపాయాన్ని చెప్పే శాస్త్రం. కాబట్టే మూల గ్రంథంలో ప్రతిసర్గ చివర ''మోక్షోపాయే'' అని వుంది.

32 వేల శ్లోకాలుగల ఈ వాసిష్ఠరామాయణం వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి, స్థితి, ఉపశమ, నిర్వాణ ప్రకరణాలనే ఆరు ప్రకరణాలు కలిగివుంది. ఒక్కొక్క ప్రకరణంలోను ఆధ్యాత్మికబోధ, ఆత్మ బోధ కథలు, ఉపకథలు – ఆఖ్యాన, ఉపాఖ్యానాలతో మనోరంజకంగా బోధింపబడివుంది.

ఈ 32 వేల శ్లోకాలకు గురుదేవులు పూజ్య శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు తెలుగు తాత్పర్యం వ్రాశారు. దానిని శ్రీ వ్యాసాశ్రమంవారు ప్రచురించారు. ఆ గ్రంథంలోనే ముఖ్య శ్లోకాలను దాదాపు ఆరువేలను తీసుకొని శ్రీ స్వాములవారే తాత్పర్యం వ్రాసి 'వాసిష్ఠ రత్నాకరం' అనుపేర శ్రీ శుకబ్రహ్మాశ్రమంచే ప్రచురించారు. ఆ మూల గ్రంథాన్నే ఇపుడు శ్రీ స్వాములవారు ముఖ్య విషయాన్ని వదలకుండా వచనరూపంలో సంగ్రహంగా రోచకంగా వ్రాసి కథలరూపంలో 'వాసిష్ఠ మహారామాయణం' అని ప్రకటించారు. ఈ రచన విశేషంగా జనాదరణను పొందుటచే మరల ఇపుడు మరుముద్రణ చేయబడుతూంది.

ఈ గ్రంథాన్ని చదివి పాఠకులు ఆత్మజ్ఞానాన్ని పొంది శ్రీరామునివలె లోకంలో వ్యవహరిస్తూనే తామరాకుపై నీరంటనట్లు సంసారంతో అంటక అసంగులై పరమానందంలో ఓలలాడుదురు గాక !

ఓమ్

స్వామి విద్యాస్వరూపానందగిరి

విషయసూచిక


1. వైరాగ్య ప్రకరణము ... 1
2. ముముక్షు వ్యవహార ప్రకరణము ... 8
   1. లీలోపాఖ్యానము ... 12
3. ఉత్పత్తి ప్రకరణము ... 24
   1. కర్కట్యుపాఖ్యానము ... 25
   2. ఐందవోపాఖ్యానము ... 29
   3. ఇంద్రాహల్యావృత్తాంతము ... 30
   4. చిత్తోపాఖ్యానము ... 33
   5. బాలకాఖ్యాయిక ... 34
   6. ఇంద్రజాలోపాఖ్యానము ... 35
4. స్థితిప్రకరణము ... 39
   1. భృగుకాల సంవాదము ... 39
   2. దాశూరోపాఖ్యానము ... 45
   3. కచోపాఖ్యానము ... 47
5. ఉపశమ ప్రకరణము ... 49
   1. జనకోపాఖ్యానము ... 50
   2. పుణ్యపావనోపాఖ్యానము ... 52
   3. బల్యుపాఖ్యానము ... 53
   4. ప్రహ్లాదోపాఖ్యానము ... 56
   5. గాధ్యుపాఖ్యానము ... 59
   6. ఉద్దాలకోపాఖ్యానము ... 63
   7. సురఘు పరిఘ వృత్తాంతము ... 66
   8. భాస విలాస వృత్తాంతము ... 69
   9. వీతహవ్యోపాఖ్యానము ... 71
6. నిర్వాణప్రకరణము (పూర్వార్థము) ... 76
   1. భుశండోపాఖ్యానము ... 77
   2. శివపూజోపాఖ్యానము ... 82

3. అర్జునోపాఖ్యానము ... 85
4. జీవటోపాఖ్యానము ... 87
5. బేతాళోపాఖ్యానము ... 90
6. భగీరథోపాఖ్యానము ... 91
7. చూడాలోపాఖ్యానము ... 93
8. మణికచోపాఖ్యానము ... 97
9. హస్తిపకోపాఖ్యానము ... 98
10. కచోపాఖ్యానము ... 105
11. ఇక్ష్వాకు మను సంవాదము ... 108
12. ముని వ్యాధీయము ... 110
నిర్వాణ ప్రకరణము (ఉత్తరార్థము) ... 115
1. విద్యాధరోపాఖ్యానము ... 116
2. ఇంద్రోపాఖ్యానము ... 117
3. మంక్యుపాఖ్యానము ... 120
4. పాషాణోపాఖ్యానము ... 128
5. అవిద్యోపాఖ్యానము ... 142
6. శవోపాఖ్యానము ... 147
7. శిలోపాఖ్యానము ... 162
8. బ్రహ్మాండాఖ్యానము ... 165
9. ఐందవోపాఖ్యానము ... 166
10. తాపసోపాఖ్యానము ... 167
11. కాష్ఠవైవధికోపాఖ్యానము ... 175

ఓం

# వాసిష్ఠ మహారామాయణము

## 1. వైరాగ్య ప్రకరణము

పూర్వము సుతీక్ష్ణుడను బ్రాహ్మణుడు సందేహయుక్తుడై అగస్తిముని ఆశ్రమమునకు బోయి, ఆతని నిట్లడిగెను - 'మహాత్మా! మోక్షమునకు సాధనము కర్మయా, లేక జ్ఞానమా, లేక రెండూనా వచింపుడు?' అంత నమ్మునీశ్వరుడిట్లు నుడివెను - 'పక్షులు తమ రెండు రెక్కలతోటి ఆకసమున నెగురునట్లు జ్ఞాన కర్మల రెండిటితోను మోక్షము పొందబడుచున్నది. కాబట్టి రెండును మోక్ష సాధనములని చెప్పబడినది. ఇవ్విషయమున నొక పురాతన వృత్తాంతమును జెప్పెద వినుము- పూర్వకాలమున కారుణ్యుడను వేదపారియైన బ్రాహ్మణు డొకడు గలడు. ఆతడు అగ్నివేశ్యుని పుత్రుడు. గురువువద్ద వేదవేదాంగము లన్నింటిని పఠించి విద్యావంతుడై స్వగృహమున కేతెంచి ఆతడు కర్మరహితుడై వసింప దొడంగెను. అదిగాంచి తండ్రి కారణమరయ, కారుణ్యుడిట్లు వచించెను - 'శాస్త్రములు కొన్ని అగ్నిహోత్రాది ప్రవృత్తిరూపధర్మములను బోధించుచున్నవి. మఱికొన్ని త్యాగము చేతనే మోక్షము లభించునని వాక్రుచ్చు చున్నవి. ఈ రెండిటి మధ్య సందేహగ్రస్తుడనై నైష్కర్మ్యత నవలంబించితిని.' ఆవాక్యములను విని అగ్ని వేశ్యుడిట్లు పలికెను - 'పుత్రకా! ఒక కథ వినుము. దానిని హృదయంగమ మొనర్చుకొని ఆ పిమ్మట నీయిచ్ఛవచ్చి నట్లొనర్చుము.'

అప్సరసలలో కెల్ల నుత్తమురాలగు సురుచి యను నామె హిమవత్పర్వత శిఖరముపై వసించుచుండెను. ఒకనాడామె ఆకాశమున నేగుచున్న యింద్రదూతను గాంచి ''నీవెవరు? ఎచటినుండి వచ్చుచున్నావు? ఎచటికి బోవుచున్నావు?'' అని ప్రశ్నింప, ఆతడిట్లు నుడివెను - ''అరిష్టనేమి యను రాజు తన రాజ్యమును బుత్రున కొసంగి, రాగరహితుడై తపం బాచరించుటకొఱ కరణ్యమునకుజని

గంధమాదన పర్వతముపై నిపుడు తపశ్చర్య గావించుచున్నాడు. అతని వద్ద కొక కార్యార్థమేగి, యిపుడు తిరిగి ఆ వృత్తాంతము నింద్రునకు వచించుటకై పోవుచున్నాను.'' అంత నాయప్సరస ''అచట జరిగిన వృత్తాంతమేదియో చెప్పు'' మని వేడ, దేవదూత యిట్లు చెప్పనారంభించెను – ''అరిష్టనేమి రాజచట తీవ్రతపంబాచరించుచుండ ఇంద్రుడది గాంచి, ఈ విమానమును గైకొని పలువురు అప్సరసలతోను, వివిధ వాద్యాదుల తోను, గంధర్వ సిద్ధాదులతోను నచ్చోటికేగి, అతని నీ విమానముపై గూర్చుండబెట్టి స్వర్గనగరమగు అమరావతికి దీసికొని రమ్ము'' అని నాకాజ్ఞ యిచ్చెను.

నేనట్లే వెడలి రాజున కావిషయమును దెలుప, అతడు స్వర్గమునగల గుణము లేవి? దోషము లేవి?' అని ప్రశ్నింప నేనిట్లు చెప్పితిని – 'ఓ రాజర్షి! పుణ్యము వలన మనుజుడు సర్వమున సుఖమ నుభవించును. ఇతరుల యైశ్వర్యమును గాంచి సహింపకుండుట, సమానుల యెడల ఈర్ష్య, తక్కువ వారిని జూచి సంతోషించుట మున్నగు గుణములచట వారికి గలవు. పుణ్యము క్షయింప నచటవారు మర్త్యలోకమున జనింతురు.' ఆ నా వాక్యములను విని యాతడు 'అట్టి ఫలములతో గూడిన స్వర్గము నాకక్కరలేదు. నేను ఘోర తపంబాచరించి ఈ శరీరమును విడిచెదను. మీరు ఇంద్రుని కడకు వెడలి పొండు' అనెను.

పిమ్మట నే నింద్రునితో నా విషయమును దెలుప, అతడు ''నీవు మరల వెళ్ళి వైరాగ్యశీలుడగు నా రాజును తత్త్వజ్ఞుడైన శ్రీ వాల్మీకి మహర్షి వద్దకు గొనిపోయి మోక్ష ప్రాప్తికి వలసిన తత్త్వజ్ఞానము నాతని కుపదేశింపవలసినదిగా నేను ప్రార్థించినట్లు, అమ్మహర్షికి వచింపుమ'' ని నాకాజ్ఞ యిచ్చెను. తదనుసారము నే నా రాజును వాల్మీకి వద్దకు గొంపోవ అచట నమ్మునీంద్రుని 'సంసారబంధ దుఃఖ నివారణోపాయము'ను గూర్చి యారాజడుగ నాతడు 'ఎద్దానిని విని అనుష్ఠించినచో జీవన్ముక్తి లభించునో, అట్టి వాసిష్ఠ రామాయణమును పూర్ణముగ నీకుపదేశిం చెదను, అని చెప్ప, ఆ రాజు శ్రీరాము డెవరని ప్రశ్నింప, విష్ణుభగవానుడే శాప కారణమున మనుజాకారము ధరించి యవతరించెనని యా ఋషి వచించెను. శాపకారణమేమని రాజు మరల యడుగ సనత్కుమార,

దేవశర్మ, భృగు, వృందలు వేర్వేరుగా విష్ణువునకు శాపమప లొసగిరని వాల్మీకి చెప్పెను. వాల్మీకి ''ఓ రాజా! పూర్వము (24,000శ్లోకాలతో గూడిన) పూర్వ రామాయణమును నేను భరద్వాజునకు జెప్ప, ఆతడద్దాని నొకపుడు బ్రహ్మదేవునకు వినిపించెను. బ్రహ్మదేవుడంత సంతసించి వరము కోరుకొనుమని చెప్ప, అంత భరద్వాజుడు 'దేనిచే జనులందరు దుఃఖమునుండి విముక్తులగుదురో, దానిని చెప్పమనెను.'' అపుడు బ్రహ్మదేవుడు 'ఈ విషయమును గూర్చి వాల్మీకి మహర్షిని బ్రార్థింపుము. ఆతడు ప్రారంభించినట్టి రామాయణమును వినినచో మనుజుడు సంసార సముద్రమును దాటును' అని చెప్పి యిరువురును మా ఆశ్రమమునకు వచ్చిరి. అప్పుడు బ్రహ్మదేవుడు 'ఓ మునీ! నీవు ప్రారంభించిన శ్రీరామాయణగ్రంథము సమాప్తి నొందువరకు విడువకుము. దానిచే జనులు శీఘ్రముగ సంసార సంకటమును దాటివేయుదురు' అని నాతో జెప్పి యంతర్ధానమయ్యెను.

పిమ్మట నేను భరద్వాజునితో బ్రహ్మదేవుడు చెప్పిన దేమని యడుగ, ఆ పూర్వ రామాయణమువలెనే సంసార సాగరమును దాటించునట్టి మఱియొక రామాయణమును రచింపుమని యా దేవదేవుడు వచించెననియు ఆ మోక్షోపాయమును దనకుకూడ వచింపుమనియు, శ్రీరామాదులు జీవన్ముక్తులై యెట్లు వ్యవహరించెదరో తెలిపిన, తానున్ను అట్లు గావించెదననియు ప్రార్థింప, అపుడు నేనీ ప్రకారమాతనికి వాసిష్ఠ రామాయణము నుపదేశించితిని.

ఓ భరద్వాజా! బ్రహ్మజ్ఞానము ద్వారా దృశ్యమును రహిత మొనర్చి, ఆత్మయందు స్థితిగలిగి యుండుటయే జీవన్ముక్తి. వాసనల యొక్క సంపూర్ణ పరిత్యాగమే ఉత్తమమైన మోక్షము. అట్టి వాసనా రాహిత్యస్థితియే జీవన్ముక్తి. శ్రీరామచంద్రుడట్టి జీవన్ముక్తిపద మెట్లు పొందెనో చెప్పెద వినుము - శ్రీరామచంద్రుడు బాల్యకాలమున గురుసమీపమున సమస్త విద్యల నభ్యసించి స్వగృహమునకు తిరిగి వచ్చి సుఖముగ కాలము గడుపుచుండెను. అత్తఱి ఒకప్పుడ తనికి తీర్థయాత్ర సలుపవలెనను కోర్కె జనింప, తన యా యుద్దేశ్యమును తండ్రి కెఱిగించెను. తండ్రి యాజ్ఞగొని వసిష్ఠాది బ్రాహ్మణ సమేతుడై యనేక తీర్థ,

ఆశ్రమ, పుణ్యస్థలాదులను సేవించుకొని తిరిగి యింటికి వచ్చెను. అత్తఱి అతని వయస్సు 16సం..కు కొంత తక్కువగ నుండెను. అప్పటి నుండియు నాతడు దిన దినము కృశించుచు దుఃఖితుడై యుండ నదిగాంచి దశరథు డాతనిని కారణమరయ ''తన కేమియు దుఃఖము లేదని వచించెను.'' అటు పిమ్మట దశరథ మహారాజు వసిష్ఠమునీంద్రుని శ్రీరాముని కృశత్వ దుఃఖాదులకు కారణమేమని యడుగ, అద్దానికి కారణము గలదనియు, తాను చింతింపనక్కరలేదనియు వచించెను.

ఇట్లుండ ఒకనాడు దశరథుని గృహమునకు విశ్వామిత్ర మహర్షి యజ్ఞవిఘ్న నివారణకై శ్రీరామచంద్రుని బిలుచుకొని పోవుటకుగాను వచ్చెను. ద్వారపాలుడాతని రాకను రాజున కెఱిగింప; దశరథుడు, వసిష్ఠ వామదేవాది ఋషులు ద్వారము కడకేగి, ఆ మునీంద్రుని సత్కరించి లోనికిదెచ్చి మరల పూజాదుల గావించి కుశలమడిగిరి. తదుపరి దశరథుడు విశ్వామిత్రునితో నిట్లనెను- 'ఓ మహర్షీ ! తమ రాకచే నేనపరిమితానందము నొందితిని. తామే కార్యార్థ మిట కేతెంచితిరో వచింపుడు. అద్దానిని నేను తప్పక నొనర్తును. అంతట విశ్వామిత్రు డిట్లు వచించెను - ''ఓ రాజా ! నేను సిద్ధికొఱకు యజ్ఞ మారంభింప, మారీచాది గొప్ప పరాక్రమశీలురగు రాక్షసులందు విఘ్నముల గలుగ జేయుచున్నారు. ఆ (యజ్ఞ) కార్యమున నేను కృద్ధుడనై వారిని శపించుట సముచితముకాదు. మీ తనయుడగు శ్రీరామచంద్రుడు వారలను వధింప సమర్థత గలవాడు, కాబట్టి ఇక పది దినములలో పూర్తి కానున్న తద్యజ్ఞము యొక్క రక్షణార్థము రాముని బంపుడు. వసిష్ఠాదులును, ఇక్కార్యమునకు శ్రీరాముని పంపుటకు అనుజ్ఞనిచ్చు గాక ! వారి సమ్మతిచే శ్రీరాముని శీఘ్రముగ నాతో బంపుడు !'' ఆ వాక్యమును విని దశరథుడు మిగుల ఖిన్నుండై ముహూర్త కాలము మౌనముగ నుండి పిమ్మట విశ్వామిత్రునితో నిట్లనెను - ''మునీంద్రా ! శ్రీరాముడు పదునాఱేండ్లు సరిగా నిండని పసిబాలుడు. సుకుమారుడు, అట్టి అతడు రాక్షసులతో యుద్ధ మెట్లు చేయగలుగును. గొప్ప సేనతో నేనేవచ్చి ఆ రాక్షసులతో యుద్ధమొనర్చెదను. మఱియు రావణాది రాక్షసులైనచో,

వారి నెదుర్చుటకు మేమున్ను సమర్థులము గాము. ఇక రాముడెట్లగును. రాముని తీసికొని పోయినచో నేనొక క్షణముకూడ బ్రతుకజాలను.''

అది విని విశ్వామిత్రుడు కృద్ధుడై దశరథుడు తాను జేసిన ప్రతిజ్ఞను భంగము చేయుట ధర్మవిరుద్ధమని పలుకుచు నచటినుండి వెడలి పోనుండగా నంతట వసిష్ఠ మునీంద్రుడు దశరథునితో నిట్లనెను - ''ఓ రాజా! మీరు కావించిన వాగ్దానమును భంగము చేయకుడు. విశ్వామిత్రుడు మహాపరాక్రమశాలి, సమస్త అస్త్రశస్త్రముల నెఱింగినవాడు. ఈతనిచే సంరక్షితుండైన శ్రీరామచంద్రున కేమియు ముప్పు వాటిల్లదు. కాబట్టి నిస్సంకోచముగా రాముని బంపివేయుడు.'' వసిష్ఠ మునీంద్రుని యా వాక్యములను విని దశరథుడు ప్రసన్నుడై ద్వారపాలునితో రామలక్ష్మణులను శీఘ్రముగ గొని రమ్మని చెప్పెను. అతడు వెడలి తిరిగివచ్చి యిట్లు చెప్పెను - ''దేవా ! శ్రీరామచంద్రుడు మిగుల చింతాక్రాంతుడై, భోగరాజ్య వైభవాదుల నేమియు నపేక్షింపక ధనసంపదాదులయెడ విరక్తి గల్గి ఆహారవిహారాదుల యందు బ్రీతిలేక, వ్యవహారములం దిచ్ఛలేక ప్రబల వైరాగ్య యుతుడై యున్నాడు. అతనికి మహానుభావులెవరైన తగిన యుపదేశముచేసి దుఃఖమును దూరీకరింప వలెను.'' అపుడు విశ్వామిత్రు డిట్లనెను - 'శ్రీరాము డిటకుగొని రాబడు గాక ! అతని దుఃఖమును మేము దూరీ కరించెదము. అది అతని దుఃఖముకాదు, వైరాగ్యమే. బోధప్రాప్తానంతర మాతడు ఉత్తమమగు ఆత్మపదము నొందును.' ఆ వాక్యములను విని దశరథుడు ప్రసన్నుడై శ్రీరాముని దోడ్కొని వచ్చుటకై కొందఱు దూతల నంపెను. ఇంతలో శ్రీరాముడు లక్ష్మణ శత్రుఘ్నాదులతో గూడి దశరథుని వద్దకు వచ్చు చుండెను. అట్లాతడు వచ్చి తండ్రికి, వసిష్ఠ విశ్వామిత్రాదులకు నమస్కరింప నంత దశరథుడు 'నీవు దుఃఖింపవలదు, విషయ వైరాగ్యముచే నీవు శూరుండవే అయి యున్నావు' అని పలికెను.

అత్తఱి రామచంద్రునితో విశ్వామిత్రు డిట్లనెను - ''ఓ రామా ! నీ మానసిక వ్యథకు కారణమేమియో తెలియజేయుము. నీవు కోరునది నీకు

లభింపగలదు. దానిచే నిక నెన్నండును దుఃఖము నిన్ను వేధింపజాలదు.''
అది విని శ్రీరామచంద్రుడు ఖేదమును వీడి ధైర్యయుతుడై గంభీరముగ
నిట్లు పలికెను.

''తీర్థయాత్రకు వెళ్లినప్పటి నుండియు నా మనంబున ఈ యనిత్య
సంసారదశను గూర్చిన చింతన యుద్భవించెను. 'భోగములశాశ్వత
ములు, జీవిత మతిచంచలమైనది' అని యెఱుగుటచే పదార్థముల
యెడల నాకరుచి జనించెను, నాకు రాజ్యమేల? భోగములేల? అంతయు
మిథ్యయే. ధనము వలన, సంపద వలన ఏమియు ప్రయోజనము లేదు.
అవి దుఃఖహేతువులే, ఆయువు అతి చంచలమైనది. అహంకారము
సర్వానర్థములకును మూలము. చిత్తము బాహ్య విషయజాలముపై
దూకుచు, అతిచపలమై యున్నది. దానిని నిగ్రహించుట కష్టతరముగా
తోచుచున్నది. దోషములలో ప్రధానమైనది తృష్ణ. మహాత్ములద్దానిని
వివేకమను ఖడ్గముచే ఛేదించి వేయుదురు. అనేక క్లేశములచే వ్యాప్తమై
వార్థక్యాదులతో కూడిన నిందితమగు శరీరమునందు విశ్వాసముంచ
దగదు. బాల్యావస్థ మహాదుఃఖ సంయుతమైనది. అట్లే యవ్వనము
రాగద్వేష కామ క్రోధాదులకు నెలవై యొప్పుచున్నది. అనేక
రోగములతోను, శోకమోహ చింతాదు లతోను, అశక్తతతోను గూడిన
వార్థక్యము దుఃఖహేతువే అయియున్నది. ప్రపంచ మందలి సమస్త
పదార్థములను, బ్రహ్మాండములను కూడ కాలము గ్రసించి వైచుచున్నది.
అనేక ఆపదలతో గూడి అస్థిరమై మోహప్రదమైనట్టి ఈ సంసార
దశయందుబడి అజ్ఞానులగు జనులు పరమార్థము నెఱుగక
దుఃఖపరవశులగు చున్నారు.

జగత్తు కేవలము పంచభూతముల యొక్క వికారమే. ఇందు
సారము లేదు. నశ్వరమైన ఈ ప్రాపంచికదశలందు మూఢులు మాత్రమే
ప్రీతిని గొనుదురు. ఈ జగత్తునందు స్థిరమైన వస్తువేదియు లేదు.
సమస్తము విపర్యయము (మార్పు) నొందుచున్నది. ఇట్టి దానియందు
విజ్ఞులకు విశ్వాసమెట్లు కలుగును. ఈ ప్రకారముగ సాంసారిక పదార్థము
లందలి దోష దృష్టిచే నామనంబున భోగముల గూర్చిన యాశ క్షీణించినది.
ఇక నాకు రాజ్యమేల? ధనములేల? వైభవములేల? నాకు మనశ్శాంతి

లభించి శాశ్వతమై, నిరతిశయానంద స్వరూపమై, దుఃఖరహితమైనట్టి స్థితి కలుగగలందులకై యుపాయము చెప్పవేడెద, అట్టి విశ్రాంతి పదమును నేను బొందకున్నచో, ఇక భోజనాదులను విసర్జించి ఈ శరీరమును త్యజించి వైచెదను.''

శ్రీరామచంద్రుని ముఖతః వెలువడిన యిట్టి వైరాగ్యపూరిత వచనములను విని సభ్యులెల్లరు ఆనందభరితులైరి. సిద్ధగంధర్వాదులు సంతోషాతిరేకముచే పుష్పవృష్టి కురిపించి తామట్టి యుత్తమ వచనముల నిదివరకెన్నడును వినలేదని చెప్పిరి.

మఱియు అతని కాత్మజ్ఞానోపదేశము చేయు నిమిత్తము వసిష్ఠ మహర్షి వచింపనున్న మహాబోధ నాకర్ణించుటకై యాసభ కేతెంచ వలసినదిగా మునులను, మహర్షులను అందఱిని గోరిరి. ఆ సిద్ధుల వాక్యములను విని యనేక మహర్షులట కేతించిరి. అత్తఱి యా సభలో విశ్వామిత్ర నారద వ్యాసవాల్మీకి భృగు అంగిర పులహ చ్యవన ఉద్దాలక ఉశీర శరలోమ వామదేవ మరీచ దుర్వాసక్రతు వాత్స్యాయన భరద్వాజ శర్యాతి ఋచీకాది మునిపుంగవులును, ఇంకను అనేక బ్రహ్మనిష్ఠులును గలరు. అపుడు వసిష్ఠ విశ్వామిత్ర నారదాదు లిట్లు చెప్పిరి - 'శ్రీరామచంద్రు డుత్తమమైన వాక్యము బలికెను. రామచంద్రునివంటి ధీశాలురు ఈ ప్రపంచమున చాల అరుదుగ గానవచ్చుదురు. ఇపు డితనికిమన మాత్మజ్ఞానమును గలిగింప కున్నచో మనము జ్ఞానులమై యుండుట వ్యర్థమే యగును.

# ౨. ముముక్షు వ్యవహార ప్రకరణము

అంతట విశ్వామిత్ర మునీంద్రుడు శ్రీరామచంద్రునితో నిట్లనెను - 'ఓ రాఘవా! నీవు తెలిసికొనదగిన పదార్థములను దెలిసి కొంటివి. కాని నీ బుద్ధియను అద్దమున నింకనునొకింత శోధనము మాత్రము అవశ్యకమై యున్నది. వ్యాసమహర్షి యొక్క తనయుడగు శుకుడున్ను బూర్వమిట్లే జ్ఞేయము నెరిగియు నంతః కరణమున విశ్రాంతి మాత్రము నపేక్షించి యుండెను.' అది విని శ్రీరాముడు ''శుకుడు జ్ఞేయమెఱింగియు విశ్రాంతి నెట్లు పొందకుండెను? తుదకెట్లు దానిని బొందగల్గెను?'' జెప్పు డనిన, అంతట విశ్వామిత్రుడిట్లు శుకుని వృత్తాంతమును జెప్పదొడంగెను - పూర్వము శ్రీ శుకదేవుడు దృశ్య పదార్థముల యెడల పూర్ణ విరక్తి నొంది తన వివేక విచారములచే పరమార్థవస్తువును బొందినను, 'ఇదియే ఆ పరమాత్మ' (సత్య వస్తువు) అను విశ్వాసము లేనందున అశాంతచిత్తుడై, మేరు పర్వతముపై ఏకాంతముననున్న తన తండ్రియగు వ్యాసభగవానుని ''ఈ దృశ్య ప్రపంచ మెట్లు ఉత్పన్నమాయెను? ఇయ్యది ఎట్లు శమించును?''- అని యడిగెను. అందులకు వ్యాసముని చెప్పవలసిన దంతయు జెప్పెను. దానిని విని శుకుడు తనలో ''దీనిని నేను పూర్వమే యెఱిగి యుంటిని. ఇపుడు విశేషముగ నాత డేమియు చెప్పలేదు' - అని తలంచి, తండ్రి వాక్యములను అధికముగ దలంప డాయెను. పుత్రుని తలంపు నెఱిగి వ్యాసులు సుతునితో తానంత కంటె నధికముగ నెఱుగననియు, వేద్యవస్తువు నెఱిగిన జనకమహారాజు యొద్దకు బోయినచో బొందవలసినదంతయు బొందుదువనియు జెప్ప, శుకుండట్లే యచటికి బోవ ద్వారపాలకు లాతని రాకను రాజున కెఱింగించిరి.

రాజాతనిని పరీక్షింపనెంచి ద్వారపాలునితో 'అట్లేయట నుండనిమ్ము' అనిచెప్పి యేడుదినము లట్లుండి పిమ్మట శుకుని భవన ప్రాంగణములోనికి రానిచ్చి మరల యచట యేడుదినములుండనిచ్చి, యాపై నాతని నంతః పురములోనికి రప్పించి, వారము దినములైన వెనుక రాజు మీతో కలియుదురని చెప్పించెను. అనేక సుందర స్త్రీలను వివిధభోగ్యపదార్థములను, అతని యొద్దకు పంపెను, కాని శుకుడుభోగ,

అనాదరముల రెంటి యందును సమచిత్తము గల్గి పరిపూర్ణ మానసుడై వికారరహితుడై యుండెను. అట్టి యాతనినిగాంచి జనకుడు తాను వచ్చినపని యేమని యాదరంబున బలుక శుకుడు ''తాముచెప్పినదాని నేనును నెఱుంగుదును. మా తండ్రియు నదియే వచించెను. శాస్త్రములును నట్లే చెప్పుచున్నయవి. అదియే సత్యమగుచో నాచిత్తమున నే ప్రకారము సంశయ రహితమగు నిశ్చలస్థితి గలుగునో సెలవీయుడ''ని ప్రార్థింప జనకు డిట్లు వచించెను - ''నీ వెఱిగిన దానికంటె నధికముగ జెప్పవలసిన దేదియు లేదు. అఖండమైన చిదాత్మ తప్ప వేఱేమియు నిటలేదు. జీవుడు తన సంకల్పముచేత బద్ధుడై నిస్సంకల్ప స్థితిచే ముక్తుడగుచున్నాడు. దృశ్య పదార్థముల యెడల బూర్ణ విరక్తి నీకు కలిగినది కావున నీవు జ్ఞేయము నెఱిగినవాడవే యగుదువు. నీ వెఱిగిన దానికంటె జ్ఞేయవస్తువు అన్యము కాదు. కాబట్టి భ్రమను వీడుము' - జనకుని యా వాక్యముల విని శకుడు సంశయ రహితుడై మేరుపర్వత శిఖరముపైకి జని, అట పదివేలవత్సరములు నిర్వికల్ప సమాధి యందుండి యా పిమ్మట విదేహముక్తుడాయెను.

''ఓ రామచంద్రా! శుకదేవునకువలెనే నీకును కేవలము నిమిత్త మాత్రమైనట్టి యుపదేశము యొక్క ఆవశ్యకత గలదు. ఓ మునీశ్వరు లారా ! శ్రీరామచంద్రునకు విషయ విరక్తి, వాసనాక్షయము కలిగినది గావున, నతడు తప్పక జ్ఞాత జ్ఞేయుడే యగును. ఏలయనిన జ్ఞేయము నెఱిగినవాని యొక్క లక్షణము విషయవైరస్యమే, వాసనాక్షయమే. శ్రీ రామచంద్రుడు కేవలము అద్వైతాత్మయందలి విశ్రాంతి మాత్రమునే ఇపుడపేక్షించుచున్నాడు. అతనికి చిత్త విశ్రాంతి గలుగుటకై బోధించుటలో శ్రీ వసిష్ఠమునీంద్రుడు మిగుల సమర్థుడు. ''ఓ వసిష్ఠమునీంద్రా ! పూర్వము మన యిరువురి వైర శమనము కొఱకై నిషధ పర్వతముపై బ్రహ్మదేవుడు మనలకు విశేషముగ జ్ఞానోపదేశము చేసెనుగదా ! ఎట్టి జ్ఞానముచే సంసార వాసన నశించి, జ్ఞేయవస్తువు (ఆత్మ) నందు నిలుకడ కలుగునో అట్టి జ్ఞానమును శ్రీరామున కుపదేశింపుడు, అతని చిత్తము శుద్ధమైనది. కాబట్టి నిర్మల దర్పణమునందు ప్రతిబింబమువలె జ్ఞానోపదేశ మతనియందు శీఘ్రముగ బ్రవేశించును. మఱియు వీతరాగులును,

నశించిన కామక్రోధాదులు కలవారునగు మీవంటి మహాత్ములెచటి ఆత్మ తత్త్వమును గూర్చి యుపదేశింతురో, అచట బుద్ధి తప్పక విశ్రాంతి నొందును –''

విశ్వామిత్రు డిట్లుపలుక, వ్యాసనారదాదిమునులా వాక్యములను సమర్థించి బలపఱచగా, వసిష్ఠ మునీంద్రుడిట్లు చెప్పదొడగెను – 'మీయొక్క అజ్ఞను నేను పాలించెదను. నిషధపర్వతముపై పూర్వము బ్రహ్మదేవు డుపదేశించినది నాకు జ్ఞప్తియందున్నది. దానినే నేనిపుడు చెప్పెదను. శ్రీరామచంద్రుని సందేహాదులను నేనిపుడు జ్ఞానోపదేశముచే శీఘ్రముగ నశింపజేసెదను.' అని పలికి వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రున కిట్లుపదేశించెను –

శాస్త్రానుకూలమగు ఉత్తమ పురుషప్రయత్నముచే ఈ ప్రపంచ మున సమస్త పదార్థములు లభించుచున్నవి. ఈ జన్మయందలి అధిక పురుష ప్రయత్నముచే పూర్వజన్మకృత పురుషార్థమును జయింప వచ్చును. ప్రారబ్ధ మెట్లుండునో యని యత్నమును విరమింపరాదు. ఏలయనిన అది పూర్వజన్మకృత కర్మఫలమే కావున ఇహ జన్మకృత ఉత్తమకర్మచే దానినిజయించవచ్చును. కాబట్టి ఈ జన్మయందే ఆత్మజ్ఞాన సంపాదనరూపమగు శుభ పురుష ప్రయత్నమును తప్పక ఆచరించ వలెను. పురుషప్రయత్నముచే ఇంద్రియసమూహమును బూర్ణముగ జయించి వాసనారహితుడవై ఈ నేను చెప్పబోవు మోక్షోపాయమను సంహితను వినుము. దీనిని పూర్వము కల్పాదియందు బ్రహ్మదేవుడు నాకు జెప్పెను.

సృష్ట్యాదియందు బ్రహ్మదేవుడు జీవులు దుఃఖసంతప్తులై యుండు టను జూచి కరుణాపూరితుడై తన్నివారణమునకై యాలోచించి తపో ధర్మదాన సత్యతీర్థములను రచించెను. కాని వానిచే బూర్ణముగ దుఃఖము శమింపదు, ఆత్మజ్ఞానముచేతనే అయ్యది శమించుననని నిశ్చయించి సంకల్పమాత్రముచే నన్ను (వసిష్ఠుని) సృజించెను. అత్తఱి సంసార తరణోపాయమునుగూర్చి బ్రహ్మదేవుని యడుగ నాతడుత్తమ జ్ఞానము నుపదేశింప దానిచే నేను పూర్ణబోధ (ఆత్మ) స్వరూపుడనైతి. అపుడు బ్రహ్మదేవు డిట్లనెను – ''నీవు విజ్ఞానమును బొందితివి. ఇక జనుల

యుద్ధరణ నిమిత్తము భూలోకమునకుబోయి కర్మకాండప్రియులకు కర్మకాండను, వైరాగ్యశీలురకు ఆత్మజ్ఞానము నుపదేశింపుము!'' అనినాకాజ్ఞ యొసంగెను. ఈ అధ్యాత్మవిద్య మొట్టమొదట రాజుల కుపదేశింపబడెను. ఆ రాజులలో నొకడగు దశరథునకు జన్మించిన నీ కిపుడు ఆ కారణముగనే వైరాగ్య ముదయించినది. వైరాగ్యయుతుడవై నిర్మల చిత్తుడవై యుంటివి గావున, జ్ఞానరూపయుక్తి నీ యందిపుడు శీఘ్రముగ బ్రవేశించును. ముముక్షువు ఆత్మజ్ఞుడైన గురువుచే బాగుగా పరీక్షించి మోక్షోపాయమును గూర్చి ప్రశ్నింపవలెను. గురువున్ను నిర్మలచిత్తము, పూర్వపర విచారణా సమర్థత గలిగిన శిష్యునకే యుపదేశింపవలెను. అపుడే యాబోధ సఫలమగును. శమ, విచారణ సంతోష, సత్సంగముల నీ నాల్గును మోక్షద్వారము యొక్కద్వారపాలురు. సర్వయత్నముచే వీనిని సంపాదించవలెను. మనుజుడు బహుజాగరూకుడై యీ జన్మమందే సర్వదుఃఖ ప్రశమకారమగు ఆత్మజ్ఞానమును గురు శాస్త్రాదుల ద్వారా మఱియు స్వవిచారణచే పొందవలెను. శమమను కవచముచే రక్షింప బడిన దేహము గలవానిని ఏ దుఃఖమున్ను బాధింపజాలదు. అతడు నిరతిశయ సుఖమును బొందును.

ఈ ప్రపంచము మనస్సుయొక్క అజ్ఞానముచే కల్పింపబడినది. అయ్యది, 'నేనెవరు? ఈ జగత్తెచటనుండి వచ్చింది?' ఇత్యాది రూపమగు విచారణచే శమించును. విచారణచే తత్త్వమెరుగబడ దానిచే ఆత్మయందు స్థితికలుగ మనశ్శాంతి, సర్వదుఃఖోపశమము ఉదయించుచున్నది. సంతోషము (సంతుష్టి)చే పరిపూర్ణమైన మనుజుని మానసిక దుఃఖము లన్నియు నశించును. అతడు ఆత్మయందు నిత్యతృప్తుడై దేవతాదులకును వంద్యుడగును. అట్లేసత్సాంగత్యమున్ను అజ్ఞానాంధకారమును జ్ఞాన సూర్యునిచే నశింపజేయును. సాధుసంగతిచే వివేకాదులు జనించి ధైర్యముదయించును. ఈ శమాదులు నాల్గింటిలో ప్రయత్నముచే నేయొక్క దానినైనను సాధించినచో జయము తథ్యము. మఱియు తక్కిన మూడును గూడ లభించును. అట్టిశమాదులు గలవాడే జ్ఞానోపదేశమున కర్హుడు. నీవట్టి యుత్తమ గుణములను గల్గియున్నావు. కాబట్టి ఈ నేను జెప్పబోవుదానిని వినుము - మహత్తర పుణ్యవశముచేతనే ఈ వాసిష్ఠ గ్రంథమును వినుటకు మనుజుడు ప్రయత్నించును. ఈ గ్రంథమనేక

సారభూతములైన యర్థములతో గూడియున్నది గావున ఇద్దానిని విచారించినచో పాపక్షయమై, జ్ఞానోదయమై, అనంతసుఖము గలుగును. ఇయ్యది వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి, స్థితి, ఉపశమ, నిర్వాణములను నాఱు ప్రకరణములతో గూడి 32000 శ్లోకములు గలిగి యున్నది. ఏదోయొక యుక్తిచేతగాని, దృష్టాంతాదుల సహాయముచేగాని, ఆత్మతత్త్వము నెట్లైన సాక్షాత్కరింపజేసి కొనవలెను. బోధచంచువు (కేవల వాచా వేదాంతి కేవేలతర్కమాత్రప్రియుడు) కాకూడదు. శమదమాదులచే జ్ఞానము నార్జించి, మహాపురుష లక్షణములు గల్గి, సత్పురుషుల యాచారములు గలిగియుండవలెను.

# 3. ఉత్పత్తి ప్రకరణము



ఓ రామచంద్రా ! దృశ్యముండుటయే బంధము. దృశ్యము లేక ద్రష్టయైన ఆత్మయందు స్థితి కలిగియుండుటయే మోక్షము. పరమాత్మ యొక్క కేవల మనోమాత్రమే బ్రహ్మదేవుడు, ఈ జగత్తు ఆతని సంకల్పమే యగును. కాబట్టి మనోరాజ్యమువలె నియ్యది అసత్తే అయి యున్నది. ఈ యుత్పత్తి ప్రకరణ భావము నెఱుగుటకై నీకీ చెప్పబోవు ఆకాశజాఖ్యానమును వినుము :-

పూర్వము కృత యుగమున ఆకాశజుడను పరమధార్మికుడు (బ్రహ్మదేవుడు) ధ్యాననిష్ఠుడై ప్రజాహితనిరతుడై యుండెను. అతడు అధిక కాలము జీవింపగా, మృత్యువాతనిని గ్రసించుటకై సత్యలోకమునకుబోవ గొప్ప యగ్ని ఆ మృత్యువును గాల్చదొడెగెను. కాని దానిని భేదించుకొని లోనికిపోయి బ్రహ్మదేవుని తన హస్తముతో బట్ట బ్రయత్నించెను. కాని యీతనిని స్పృశించుటకుగూడ శక్తి లేక యమునివద్దకు బోయి, తానా యాకాశజుని ఏల వధింపజాల కుండెనని ప్రశింప యముడు – 'ఆతని కర్మను వెదకుము; కర్మలేకున్న ఒంటరిగ నీ వాతనిని వధింప జాలవు' అని చెప్ప, అంతట మృత్యువాతని కర్మకొఱకై ప్రపంచమంతటను వెదకెను. కాని లాభము లేకపోయెను. అపుడు తిరిగి యమునివద్దకు బోయి యాయుదంతం బాతని కెఱిగింప, ఆతడిట్లనియె- ఆతడు కర్మవాసనా రహితుడు ; పరబ్రహ్మ స్వరూపుడు, విజ్ఞాన ఘనుడు, సర్వవ్యాపకుడు. కావున నీ వాతనిని వధింప జాలవు. అందుచే నీవాప్రయత్నమును విరమించుకొనుము,' – అన విని మృత్యువాశ్చర్య మును బొంది స్వస్థానమున కరిగెను. ఈ ప్రకారము వసిష్ఠమునీంద్రుడు బోధించుచుండ నింతలో సాయంసమయము కాగా సభ విరమింపబడెను. అందఱును వారి వారి స్థానముల కరిగి తిరిగి ప్రాతఃకాలమున మరల యథాప్రకారము సభాస్థలకి విచ్చేసిరి.

అపుడు వసిష్ఠుడిట్లు బోధించెను :- మనస్సు మొదలుగాగల ఈ దృశ్య జగత్తంతయు పరమాత్మయందు కల్పింపబడినది. ఇది ఎండమావులవలె మిథ్య. పరమాత్మయే సత్యము. సాధుసంగము సచ్ఛాస్త్రాదుల ద్వారా పురుషప్రయత్నముచే ఆత్మజ్ఞానము సంపాదింపబడ, అద్దానిచే దృశ్య (సంసార) దుఃఖము పూర్ణముగ నశించి జీవన్ముక్తిలభించును. జ్ఞానమే మోక్షసాధనము. పరమాత్మ దేవుడు ఈ శరీరమందే చిన్మాత్ర రూపమున ప్రసిద్ధుడై యున్నాడు. ఈ జగత్తు

(దృశ్యము) అసలు ఉత్పన్నమే కాలేదు. అట్టి ఈ లేనిదాని మార్జనమందేమి క్లేశము గలదు! శాస్త్రములన్నింటిలో ఈ (వాసిష్ఠ) మహారామాయణము చాల యుత్తమమైనది. ఇద్దాని మనన విచారణలచే జీవన్ముక్తి తప్పక లభించును. జీవన్ముక్తుడు ఆత్మయందు సదా జాగ్రతుడై దృశ్యప్రపంచ మందు సుషుప్తితుల్యుడై ఎల్లపుడు నిర్భయుడై నిర్వికారుడై ఆనంద మయుడై కార్యయుతుడై యున్నను వాస్తవముగ కార్యరహితుడై సర్వాత్మస్వరూపుడై యుండును. పరమాత్మ యొక్క ప్రకాశము చేతనే ఈ జగత్తంతయు ప్రకాశించుచున్నది. ప్రళయకాలమున ఆ పరమాత్మ మాత్రమే శేషించియుండును. ఈ జగత్తు అధిష్ఠానరూపముచే సత్యము; తన (దృశ్య) రూపముచే అసత్యమునై యున్నది. వసిష్ఠమునీంద్రుడిట్లు బోధించుచుండ నింతలో సాయంసమయముకాగా సభ విసర్జింపబడెను. మరల ప్రాతఃకాలమందఱునువచ్చి వారి వారి స్థానము లలంకరింప అపుడు వసిష్ఠ మునీంద్రు డిట్లు చెప్పదొడగెను.

## లీలోపాఖ్యానము

ఓ రామచంద్రా ! ఈజగత్తు స్వప్నసంకల్పపురతుల్యమను విషయమున నొక యాఖ్యానమును జెప్పెద వినుము. పూర్వము పద్ముడను రాజుడెను. అతడు గొప్ప ధార్మికుడు, సద్గుణ సంపన్నుడు. అతనికి సద్గుణవతియైన లీల యను భార్య గలదు. ఇరువురు అన్యోన్యముగ విశేషమైత్రి, ప్రీతి గలిగి యుండిరి. ఇట్లు సుఖసంపన్నులైన యుండ నొకనాడు లీల తనలో నిట్లు విచారించెను - ''ప్రాణప్రియుడగు నాభర్త సదా యౌవనవంతుడై శ్రీమంతుడై మరణరహితుడై యుండుట కుపాయమెద్ది? ఈతనితో నే ననేక యుగములు సుఖముగా నెట్లు భోగముల ననుభవింపగలను? కాబట్టి జప తపాది వ్రతానుష్ఠానములచే నీతడు మరణరహితుడగుటకై యత్నించెదను.'' ఇట్లు చింతించి బ్రాహ్మణుల బిలిపించి మనుజుడు అమరు డెట్లగునని వారిని ప్రశ్నింప వారు జపతపాదులచే సిద్ధులు లభించునుగాని మరణరాహిత్యము లభింపదని వారు చెప్ప, అంతనామె తనలో నిట్లనుకొనెను. ''దైవేచ్ఛచే నా మరణము పతియుండగనైనచో నేను సర్వ దుఃఖరహితనై ఆత్మయందు సుఖముగ నుందును. అట్లుగాక నేనుండగనే పతి మరణించినచో, అతని జీవుడు గృహమును వీడిపోకుండునట్లు ప్రయత్నించెదను. అత్తఱి నాయంతఃపుర మండపమందే నాభర్తతోడ సుఖముగ నుందును.'' అని

యిట్లు తలంచి సరస్వతీదేవిని ప్రసన్నముగావించుకొనుటకై భర్తతో వచింపకన్నే శాస్త్రానుసారము స్నాన దాన తప ఉపవాసాదులను తీవ్రముగ జేయదొడగెను. ఈ ప్రకారముగ 100 త్రిరాత్ర వ్రతములను గావింప అపుడు వాగ్దేవి యగు సరస్వతి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా, ''దేవీ! నాపతి మరణానంతర మాతని జీవుడు నా యంతఃపుర మండపమునకు వెలుపల బోకుండునట్లును, వరము కొఱకుగాని దర్శనము కొఱకుగాని నే నెపుడెపుడు నిన్ను బ్రార్థింతునో, అపుడు నీవు నాకు దర్శనమొసంగు నట్లును నన్ననుగ్రహింపు'' మన, దేవి వల్లెయని యంతర్ధాన మయ్యెను. అపుడు ఇష్టవరప్రాప్తిచే రాణి చాల సంతోషించెను. తదుపరి చాల కాలమున కామె భర్త మరణించెను. అపుడామె అత్యంత వ్యాకుల చిత్తకాగా అదిగాంచి సరస్వతీదేవి కరుణగల్గి యటకేతెంచి యామెతో నిట్లనెను. ''మరణించిన నీ పతి శరీరమును బుష్పసమూహమున గప్పియుంచుము. ఆతనిని నీవు తిరిగి పొందెదవు. ఈ పుష్పములు వాడిపోవు. ఈతని శరీరము నశింపదు. ఈతని జీవ మీ యంతః పురమునకు వెలుపలపోదు,'' అ వాక్యములను విని యామె బంధువులామె నోదార్చి యట్లే యా మృత శరీరమును బుష్పములందు గప్పియుంచిరి. లీలయు పతి శరీరము వైపు ముఖముంచి దీనయై యుండెను. ఆనాడర్ధ రాత్రిసమయమున నందఱును నిదురించుచుండ లీల దేవిని స్మరించగా నామె ప్రత్యక్షమై కారణంబడుగ, 'నాపతి యిపుడెచట నున్నాడు? ఏ రూపముతో నున్నాడు? ఏమి చేయుచున్నాడు? నన్నటకుగొనిపొమ్ము. ఒంటరిగ నేను జీవింప జాలను' అనెను. అపుడు దేవి యిట్లు పలికెను. నీ భర్త చిదాకాశమున నున్నాడు. సర్వసంకల్పములు నశించినచో తత్త్వజ్ఞానముచే అవిద్య నశింప, జగత్తుయొక్క అత్యంతాభావము సిద్ధింప అ చిదాకాశమున స్థితి సంభవించును. నా వరప్రదాన ముచే నీవట్టి స్థితిని బొందెదవు. ఇట్లని యంతర్ధాన మొందెను.

అపుడు లీల నిర్వికల్పసమాధియందుండి స్థూలదేహమును వీడి చిదాకాశమున స్థితి గలదై, యచ్చోటి మాయా శబలిత యాకాశమున

పూర్వపు సామంత, భృత్యాదులతోనే కూడియున్న తన పతిని గాంచి యట కేగెను. కాని సూక్ష్మరూపిణి యగుటచే నామె నెవరును నట వీక్షింపజాల కుండిరి. లీల ఆశ్చర్యము నొందును. 'ఆ నగరములోని వారందరును మరణించిరా?' అని తలపోసెను. ఇంతలో దేవి యొక్క ప్రబోధముచే సమాధి భంగముకాగా తిరిగి తన యంతఃపురమున జేరి అందరు నట్లే యుండుటను గాంచి సఖీజనముతో తన్ను భర్త సింహాసనమువద్ద గూర్చుండనీయుడనియు నట్లుండి సభాసదులందరిని వీక్షించుచుండిన నేజీవించెదననియు లేకున్న జీవింపజాలననియు తెలుప, అపు డందఱును లేచి రాజసభ నేర్పరుప పతి సింహాసనముచెంత గూర్చుండి పూర్వపు సభాసదులను బాంధవాదులను గాంచి లీల ప్రసన్నయయ్యెను.

పిమ్మట లీల యటనుండి యంతఃపురమున బుష్ప మధ్యమున నుంచబడిన తన భర్త దేహమువద్ద యాసీనయై ''ఆహా ! ఈ మాయ యెంత ఆశ్చర్యమైనది ! ఈ బాహ్యముననున్న సామంతాది జనము ఈ పర్వతాదులు ఇదే రీతిగా సమాధియందు చిదాకాశమను దర్పణమున గాంచితినే ! ఈ రెండు సృష్టులలో నేది సత్యమో దేవిని యడిగెదనని తలించి దేవిని స్మరించి పూజింప ఆమె కుమారీ రూపమున ప్రత్యక్షము కాగా తనకు గలిగిన సంశయము నడిగెను.

దేవి :- ఈ రెండు సృష్టులును మిథ్యయే. ఆత్మయే ఆయా విధముగ నచటను, ఇచటను మాయచే ఆ యా సృష్టి రూపమున భాసించుచున్నది.

లీల :- ఈ సృష్టినుండి భ్రమాత్మకమైన నా పతి సృష్టియెట్లు ఉత్పన్నమాయెనో వచింపుడు ?

దేవి :- చిదాకాశమున అజ్ఞానావృతభాగమున ఒకానొకచోట గిరి గ్రామమను పర్వతావృతమగు ఒక చిన్న గ్రామము కలదు. అందు పత్నీ పుత్ర సహితుడగు ఒక బ్రాహ్మణుడు గలడు, అతని పేరు వసిష్ఠుడు. భార్య పేరు అరుంధతి. ఒకనాడా బ్రాహ్మణుడు పర్వత శిఖరముపై గూర్చొని యుండ క్రింద భాగమున భూమిపై సమగ్ర పరివార రథాది సమేతుడై

వేట కేతెంచిన యొక రాజును జూచి తనలో 'నేనుగూడ నట్టి రాజత్వము నెపుడు పొందుదును' అని చింతింపసాగెను. పిదప కొంతకాలమున కా బ్రాహ్మణుడు మరణోన్ముఖుడు కాగా భార్య నన్ను (దేవిని) ప్రార్థించి మరణరహిత పదవి దుష్ప్రాప్యమని యెఱింగి నీవలనే తన భర్త మరణానంతరమాతని జీవము తన యంతఃపురమునకు వెలుపల బోకుండులాగున వరము గైకొనెను. పిదప కాలవశమున నా బ్రాహ్మణుడు మరణింప పూర్వజన్మ సంకల్పబలముచే రాజై పుట్టి యా గృహాకాశముననే రాజ్యపాలన చేయుచు నుండెను. ఆబ్రాహ్మణి పతితో గూడ మరణించి సూక్ష్మ శరీరముతో నాతని చెంతకు బోయెను. అతడు మరణించి నేటికి 8 రోజులు. ఆతడే నీభర్త యగు పద్ముడు. ఆ యరుంధతియే నీవు !

దేవియొక్క యావాక్యములను విని లీల యాశ్చర్యపతియై చిన్ని గృహమండపమున నీ విశాల పర్వతాదియుక్త పృథిని ఎట్లుండ గలదు? అని ప్రశ్నింప ఆమె యిట్లు వచించెను - స్వప్న సంకల్పాదులందలి ముల్లోకములవలె ఆ బ్రాహ్మణుని గృహమండపమున నీ ప్రపంచము గలదు. చిదాకాశమం దీ సృష్టిసమూహము అసత్యమైనను సత్యతుల్యముగ గానుపించుచున్నది. ఈ ప్రకారముగ చిదాకాశమున పరమాణు పరమాణువునందును అనేక బ్రహ్మాండములు గలవు. అపుడిది యొక ఆశ్చర్యమా ! అట్లే కాలవిషయము నందును గ్రహించవలెను. స్వప్నమందువలె స్వల్పకాలము దీర్ఘకాలముగ భాసించును. వాస్తవముగ ఈ దృశ్య పదార్థ మేమియును లేదు. అజ్ఞానము చేతనే జీవుడీ విధముగ పుత్ర మిత్రాది సంసారమును, జగత్తును వీక్షించుచున్నాడు.

లీల :- ఆ గిరిగ్రామము వద్దకు నన్ను గొంపోవుడు. వారలను వారి సృష్టిని జూచెదను.

దేవి :- దానిని గాంచుట కీ స్థూలదేహము అడ్డు కాబట్టి దీనిని వీడి సమాధియందున్నచో ఆసృష్టిని నిరాటంకముగా చూడవచ్చును. అనగా శుద్ధ చిద్రూపమగు బ్రహ్మమును బొందినచో, అతఱి శుద్ధ చిత్తరూప దేహముచే దానిని జూడగలవు. నా దేహము శుద్ధ సత్వగుణయుక్తము గావున నే నీ దేహముతోనే తక్కిన మనోమయ ప్రపంచములను

జూడగలను. చిరకాల భావనచే జనులకు స్థూలత్వదేహబుద్ధి కలుగుచున్నది. కాబట్టి వాసనాసూక్ష్మము తద్వారా మరల సూక్ష్మత్వమును బొందవలసియున్నది.

లీల:- అయితే ఇంతకాలము వఱకు ఈ వివిధ ద్వైతాది కల్పనలచే మమ్ము భ్రమపెట్టిన దేది?

దేవి:- అజ్ఞానము, అయ్యది విచారణచే నశించును. అపుడు ద్వైత్వాదులు నశించి కేవలము బ్రహ్మసత్తయే శేషించును. వాసనలు క్షయింప రాగద్వేషాదులు నిర్మూలముకాగా నిర్వికల్పసమాధి లభించును. అత్తఱి సంసారభావన నశించును. అదియే జీవన్ముక్త స్థితి.

లీల:- దానిని అభ్యసించు టెట్లు?

దేవి:- దృశ్యము యొక్క అత్యంతాభావముద్వారా రాగ ద్వేషాదులను సన్నగింపజేసి కొని వాసనలను నశింప జేసికొనుచు బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య అను భావనలను రూఢి పఱచుకొనుట అభ్యాస మనబడును. దానిచే అజ్ఞానమను మహానిద్ర తొలిగిపోయి జీవుడు మోక్షభాజు డగును.

వసిష్ఠమునీంద్రు డిట్లు బోధించుచుండ నింతలో సాయంసమయ మైనందున సభ విరమింపబడెను. మరల ప్రాతఃకాలమున యథారీతి అందఱును వచ్చి చేరగా అమ్మునీంద్రుడిట్లు బోధింపసాగెను.

అంతట రాత్రిసమయమున నందఱును ఆ యంతఃపురమున నిద్రించు చుండ లీల సరస్వతీదేవి యిరువురును నాశీనులై దృశ్యము నంతయు విసర్జించి నిర్వికల్ప సమాధియందు నిశ్చలముగ నుండిరి. పిదప పూర్వ సంకల్పానుసారము సూక్ష్మ దేహధారులై ఒకరి చేయి నొకరు పట్టుకొని అతిదూర మాకసమున నెగసి, అనేక పర్వత, నగర, మృగ దేవతాదిమయమైన జగత్తును, అందు సప్త సముద్రావృత మగు భూతలమును అట గిరిగ్రామమును వీక్షించిరి. ఆ గిరిగ్రామ మందలి బ్రాహ్మణుని గృహమునందు జనులు దుఃఖ పూరితులై యుండిరి. అచ్చోటు కేగి వారిరువురును నచటివారికి అదృశ్యరూపమున నుండిరి.

అపుడు లీల తన సత్యసంకల్పముచే తానున్ను, సరస్వతీ దేవియు సామన్య స్త్రీ రూపమున వారల కగుపించుగాకయని సంకల్పించెను. వెను వెంటనే అచటి వారందఱును దేదీప్యమానముగ బ్రకాశించుచున్న యా యిరువురు దేవి సమాన నారీమణులను గాంచి విస్మితులైరి. అపుడు మృతబ్రాహ్మణుని పుత్రుడగు జ్యేష్ఠ శర్మ వారిరువురను బూజింప నంతవారు అచటివారి యొక్క దుఃఖకారణ మరయ బ్రాహ్మణ పుత్రుడు తన తల్లిదండ్రుల మరణము సంభవించుటయు దానిచే నా గ్రామవాసులు మొదలగు వారందరు దుఃఖమయు లగుటయు వివరించి తద్దుఃఖోపశమనమునకై వేడుకొనెను. అంతట లీల వంగి తన పుత్రుని మస్తకమును చేతితో స్పృశింప అతని యొక్కయు అచటి వారందఱి యొక్కయు దుఃఖము దూరీకృత మయ్యెను. అనంతరము వారిద్దరును అంతర్ధానమైరి. తదుపరి లీల దేవి నిట్లు ప్రశ్నించెను.

లీల :- నా పతిజీవుడు రాజ్యమేలు చోటనున్న జీవులు నన్నేల చూడలేదు? నా పుత్రు డెట్లు చూడగల్గెను?

దేవి :- అపుడు ప్రపంచ మిథ్యాత్వభావన నీకింకను రూఢి పడ లేదు. నేను లీలను అను భావమున్ను పోలేదు. అవిద్యయు పూర్తిగ తొలగలేదు. కాబట్టి సత్యసంకల్పము కలుగలేదు. ఇపుడు జ్ఞానావిర్భావ ముచే సత్య సంకల్పము కలదానవుకాగా నీవు తలంచినందున పుత్రు డవ్విధమున జూడగల్గెను.

ఈ మండపాకాశమందు మువ్వురు పతులే కాదు. అతీత, అనాగత, అనేక భూతలాదులు అనేకజన్మలందలి అనేకపతులు గలరు. ఈ మువ్వురిలో మూడవ పతి ఇప్పుడు ఒకానొక బ్రహ్మాండమున రాజ్య మేలుచున్నాడు. ఆ బ్రహ్మాండము సమీపమునే యున్నను వ్యవహార దృష్టిచే కోట్లకొలది మైళ్ళ దూరమున గలదు. ఈ మువ్వురిలో నీవు ఏ పతి సమీపమునకిపుడు పోనుంకించుచున్నావో వచింపుము. అచటికి నిన్ను చేర్చెదను.

లీల :- నీవు చెప్పినది వాస్తవమే. సృష్టి ప్రారంభమునుండి

యిప్పటికి నాకు 800 జన్మలు గడచినవి. వాని నన్నిటిని నే నిపుడు స్మరించుచున్నాను. విద్యాధరినై పుట్టితిని. శబరియై జన్మించితిని. మత్స్యమై పుట్టితిని. గోవుగజన్మించితిని - వెయ్యేల ఎన్నియో జన్మలందు సుఖదుఃఖ ముల ననుభవించుచు ఈ సంసార సముద్రమున దిరుగాడితిని.

ఈ ప్రకారముగ వారు పరస్పరము మాట్లాడుకొనుచు ఆ గిరిగ్రామ సౌందర్యము నంతయు లీల స్మరించినదై, ఆ విషమంతయు దేవికి విన్నవించి, ఆ పిమ్మట తన భర్త నగరమునకు బోయెదమన్న కోర్కెను వెలిబుచ్చెను. అట్లే వారిరువురును స్వర్గాద్యనేక లోకములను దాటి బ్రహ్మాండ కటాహమును భేదించు కొనిపోయి అటనున్న జలాద్యావరణములను దాటిరి. అత్తఱి చిదాకాశమున నట కోట్లకొలది భిన్న భిన్న సృష్టులను, జగత్తులను లీల వీక్షించెను.

ఆ పిదప లీల తన జగత్తు నందలి యంతఃపురమున పుష్ప మధ్య మందుంచబడిన భర్త మృత శరీరమును, చెంత సమాధి యందున్న తన శరీరమును గాంచి, తదుపరి పతియొక్క సంకల్పమయ ప్రపంచమున బ్రవేశించెను. అపుడు పతి యగు విదూరథునకును సింధు రాజునకు యుద్ధము ప్రారంభము కాగా దానిని గాంచుటకు వచ్చిన వారిచే నాకసము పూర్ణమైయుండెను. అంత లీలా సరస్వతు లిరువురును సంకల్పకల్పిత విమానములపై గూరుచుండి అభయంకర సంగ్రామము నవలోకించిరి. అనేక శస్త్రాస్త్రములచే వీరులు పరస్పరము శిరాద్యం గములను ఛేదించుకొనుచుండిరి. పలువురు సైనికులు మరణించు చుండిరి. బాణ ఖడ్గాదుల వృష్టికురియుచుండెను. క్రమముగ యుద్ధము శమింప ఆ రణప్రదేశము మృత శరీరములతోను, రక్తాదుల తోను బూర్ణమై యుండెను. పిమ్మట రాత్రి సమయమున పిశాచాదులట విహరింపసాగెను. ఈ ప్రకారముగనున్న యా రణరంగమును వీడి ఆయిరువురు విదూరథుని రాజగృహమున సూక్ష్మఛిద్రము గుండా ప్రవేశించిరి. అత్తఱి వారి ప్రభావముచే నా రాజు తప్ప తక్కిన యచటి వా రందఱును నిద్రించుచుండిరి. రాజు పుష్పాంజలి నర్పించి వారలకు నమస్కరించెను. అపుడు తన సంకల్పముచే మంత్రిని మేలు కొలిపెను.

అతడును లేచి వారికి నమస్కరించెను. పిమ్మట దేవి రాజును తా నెవరి పుత్రుడు, ఎపుడు జనించెను అని ప్రశ్నింప, మంత్రి అతని జన్మవృత్తాంతమును వివరించి చెప్పెను. అంతట దేవి తన హస్తములతో నాతని మస్తకమును స్పృశింప రాజునకు తన పూర్వజన్మల వృత్తాంత మంతయు స్పష్టముగా దోచెను. అపుడు దేవి రాజుతో నిట్లనెను - ఈ జగద్రూప భ్రాంతి స్వప్నమువలె అసత్యమైనది. వాస్తవముగ నీవు జనించలేదు, మరణించలేదు. ఆత్మవే అయి నీయందు నీవు స్థితి గల్గి యున్నావు. జగత్తు యొక్క అసత్యత్వము తెలియబడినప్పుడిక ఆ జగత్సత్యత్వ భ్రాంతి యుండ నేరదు. వసిష్ఠ మునీంద్రుడిట్లు వచింపనంత సాయంసమయము కాగా సభ విరమింపబడెను. మరల ప్రాతఃకాలమున సభ్యులెల్లరు యథాప్రకార మా సభాస్థలికి విచ్చేయ నమ్మునివర్యు డిట్లుపదేశింప దొడగెను -

(వసిష్ఠమహర్షి యిట్లు పలికెను) - ఓరామచంద్రా ! దేవి యిట్లు వచించి తాము వెడలుచుంటిమని చెప్ప, అంత విదూరథుడు "నేను, నామంత్రి, అవివాహిత యగు నా పుత్రి ఆ నా నిజలోకమున కఱుగుటకై ఆజ్ఞను దయచేయు" మని వేడ, దేవి 'అట్లే యగుగాక ! ఈ శ్రేష్ఠయుద్ధమందు నీవు మరణించి వారిరువురతో గూడ సూక్ష్మరూప ములతో నీ పూర్వస్థానమున కేగెదవు' అని చెప్పెను. వారిట్లు సంభాషిం చుచుండ నింతలో భయభ్రాంతుడగు నొక మనుజుడటకు వచ్చి బాణ చక్రాద్యాయుధ సహితమగు గొప్ప సేన యే తెంచినది. నగరమంతట అగ్ని రగుల్కొనబడినది ! అని చెప్పెను. అపుడా దేవులిరువురు రాజు మంత్రి కిటికీ గుండా బయటకు చూడ, ఆ నగరమంతయు సేనచేతను, చటచటా శబ్దముల చేతను అగ్నిజ్వాలలచేతను పరిపూర్ణమైయుండెను. ఇంతలో నచటికి సఖీజన సమేతముగ రాజపట్టమహిషి 2వ, లీల భయభీతయై యేతెంచెను.

ఒకసఖి అంతఃపుర స్త్రీజనమును శత్రువులు హరించుటను నగరము నాక్రమించుటను రాజునకు దెల్పెను. అది విని రాజు ఆ దేవీద్వయమువద్ద సెలవు గైకొని తనభార్యను సంరక్షించుచుండుడని ప్రార్థించి యుద్ధమునకు వెడలెను.

2వ, లీల :-దేవీ ! నిత్యము మరిని నేను పూజించుచుంటిని. నాకు వరమొసంగుడు. నాపతి యుద్ధమున దేహమును త్యజించి యెటకేగునో నే నచట ఈ శరీరముతోనే అతని భార్యగా నుండునట్లను గ్రహింపుడు.

దేవి :- అట్లే యగుగాక ! ఏలయన నీవు చాలకాలము పుష్పధూపాదులతో నన్నర్చించి ప్రసన్న మొనర్చితివి.

1వ, లీల :-నన్నుపూర్వము స్థూలశరీరముతో గిరి గ్రామము నేల బొందింపకుంటివి ?

దేవి :-ఎవరు దేనిని వాంఛించుదురో దానిని అయా ప్రకారము పొందెదరు. నీవు పూర్వము ముక్తిని అభిలషించితివి. కావున దానినే పొందితివి, ఇతరమును గాదు.

2వ, లీల :- నిన్నెంతయోకాల మారాధించిన నాపతి విదూరథుడు అకస్మాత్తుగ ఈ రణమందేల జయించుట లేదు?

దేవి :- శత్రువగు సింధురాజు జయముకొరకై నన్నారాధించి యుండెను. నీపతి ముక్తికొర కారాధించెను. కాబట్టి అతడు దానిని బొందును. ఎవరెట్టి కోరిక గలిగి యారాధింతురో, వారట్టి ఫలము నవశ్యము పొందుదురు. నేనందఱి హృదయ మందును జ్ఞప్తి (చైతన్య) రూపమున నున్నాను.

ఈ ప్రకారముగ వారు ముువ్వురును సంభాషించుచుండ ఇరు సేనలును భీకరముగ పోరు సలుపుచుండెను. ఆ రాజు లిరువురును రథారూఢులై ఒకరిపై నొకరు వివిధ శస్త్రాస్త్రములను బ్రయోగించు కొనుచు, తీవ్రముగ యుద్ధముచేయ దొడగిరి. తుదకు సింధురాజు తన ఖడ్గముచే విదూరథుని తొడను, మోకాళ్ళను విరుగగొట్టగా, అతడు రథముపై నుండి క్రిందిపడి మూర్ఛిల్లెను. సారథి ఆతనిని రథముపై నుంచి రాజభవనము వైపునకు బోవుచుండ మరల సింధురాజు విదూరథుని కంఠముపై ఖడ్గము విసరెను. సగము తెగిన కంఠముతోనున్న రాజును సారథి గొనిపోవుచుండ సింధురాజు వెన్నెంటెను. కానీ సరస్వతీదేవి యొక్క

ప్రభావముచే నాతడు రాజభవనములోనికి పోజాలక వెడలిపోయెను. సారథి రాజు శరీరమును గృహములోనికి దెచ్చి మరణశయ్యపై సరస్వతీదేవి యెదుట నుంచెను. రాజు మరణించెనను వార్త రాజ్యమున వ్యాపింప ఎల్లెడల అశాంతి ప్రబలెను. కాని సింధురాజు వచ్చి తన కొమరుని రాజగద్దెపై గూర్చుండబెట్టి ప్రజా పాలనమును ప్రారంభింపగనే తిరిగి యథా ప్రకారము శాంతి నెలకొనబడెను.

2వ, లీల :- దేవీ ! అయ్యో, నా పతి యిట దేహమును త్యజింప బోవుచున్నాడు. (నాకు శోకము కలుగుచున్నది !)

దేవి :- గొప్ప ఆరంభములతో గూడి యున్నవైనను ఈ యుద్ధము, రాజ్యము మరియు ఈ దృశ్యము అంతయు మిథ్యయే. భ్రమ మాత్రమే. నీ పతియగు విదూరథుని బ్రహ్మాండము పద్మని మృతశరీరమున్న అంతఃపురముయొక్క మండపాకాశమున గలదు. అట్లే పద్మని బ్రహ్మాండము గిరి గ్రామ బ్రాహ్మణుని గృహాకాశమున గలదు ఈ ప్రకారముగ, ఈ దృశ్యమంతయు స్వప్నమువలె భ్రమ మాత్రమే అయియున్నది. ఆత్మయే త్రికాలములందును సత్యమైనది. దానియందీ దృశ్యమంతయు అజ్ఞానముచే గల్పితమైనది. వాస్తవముగ ఈ దృశ్యములేదు !

అటు పిమ్మట దేవియొక్క వరప్రసాదముచే ఆ 2వ. లీల తచ్ఛరీరముతోనే తన కన్యతో గూడి అనేక లోకములను దాటి తుదకు పద్మని యంతఃపురమును జేరెను. కాని అట ఆ కన్య యెచటను గానరాకుండెను. తరువాత ప్రబుద్ధ లీల దేవిని మరణాంతర జీవస్థితిని వర్ణింపమని కోరగా దేవి యిట్లు తెలిపెను - శుద్ధాశుద్ధ కర్మాదుల ననుసరించి మనుజుని ఆయువునందు ఆధిక్యత, న్యూనత యేర్పడు చుండును. విషయసేవియగు మూర్ఖుడు మరణానంతరము అనేక భ్రమలను గాంచుచు, గొప్పబాధ ననుభవించుచు దుఃఖితుడగును. పుణ్యకర్మల జేయువారు స్వర్గాదుల ననుభవించి మరల మానవాదులుగ జనింతురు.

ఇట్లుండ నచట విదూరథుడు దేహత్యాగము చేసెను. అతని జీవచైతన్యము దేహమును వీడి ఆకాశమార్గము గుండా చనుచుండ ఆ దేవులిరువురును వానిని వెన్నంటిరి. ఆజీవచైతన్యము వారిని చూడజాల కున్నను వారాతనిని జూచుచుండిరి. అతని జీవుడు యమపురికి బోవనచట యముడాతని కర్మముల విచారించి పాపకర్మమేదియు లేదని చెప్పి వానిని వదలి వైచెను. అపుడా జీవచైతన్య మటనుండి బయలుదేఱి అనేక లోకములను దాటి ఆ బ్రహ్మాండమును వీడి మఱియొక బ్రహ్మాండమున పద్మని యంతఃపురమున బ్రవేశించెను. అచట పద్మని మృతశరీరమును 2 వ. లీలను జూచిరి. 2 వ లీల ఆకారదులందు మొదటి లీలవలెనే యుండెను. అపుడు దేవి విదూరథుని జీవచైతన్యమును నిరోధించెను.

లీల:- పూర్వము సమాధి యందున్న నా దేహమేమైనది ?

దేవి:- 15 దినముల కది జఠరాగ్నిచే తపింపబడి తదుపరి నిర్జీవమై పోయెను. అపుడు మంత్రు లద్దానిని మృతి నొందినట్లెఱింగి చందనాదులచే దహించిరి. పరివారము ఔర్ధ్వదైహిక క్రియలను సల్పెను. పూర్వ మిచటికి వచ్చి నేటికి 31 వ రోజు.

అపుడు దేవి 'మమ్ములను ఈ (రెండవ) 2 వలీల చూచుగాక' అని సంకల్పింపగా అట్లే, 2 వ, లీల వారిని గాంచి ఆనంద పరవశయై వారి పాదములపై బడి దేవికోరిన ప్రకారము తానెట్లు వచ్చినది అంతయు చెప్పెను. అత్తఱి దేవి విదూరథుని జీవుని వదలగా అతడు పద్మని మృతశరీరమున బ్రవేశించెను. రాజు లేచి అయిరువురు లీలలను జూచి మీరెవరని అడుగ పూర్వలీల తానాతని పూర్వ జన్మమందలి భార్యయనియు, 2 వ లీల అతని కొరకై లీలారూపముగ తానుపార్జించిన తన ప్రతిబింబ రూపిణి యనియు, మూడవ ఆమె సరస్వతీదేవి యనియుచెప్ప, రాజు దేవికి నమస్కరించి జ్ఞానము, దీర్ఘాయువు, ధనము తన కొసంగునట్లు ప్రార్థింపదేవి తన హస్తములతో నాతనిని స్పృశించి ''అట్లే యొసంగితి'' నని చెప్పి ఆత్మ జ్ఞానియై తాను సుఖముగ

రాజ్యమేలుమని ఆశీర్వదించి అంతర్ధానమయ్యెను. పిమ్మట రాజునకు రాజ్యాభిషేకముకాగా ప్రజలలందరు సంతోషముతో ఆనందోత్సవము జరిపిరి. వారు ముప్పురును సుఖముగ నున్న వారై జీవన్ముక్తులై వెలసిరి. ఇట్లారాజు 80 వేల సంవత్సరములు రాజ్యమేల ఆ పిదప ముప్పురును విదేహ ముక్తి నొందిరి.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ఈ లీలోపాఖ్యానము ద్వారా దృశ్యము యొక్క మిథ్యాత్వమును ఆత్మయొక్క సత్యత్వమును నెఱుగుము. ఏ పదార్థము నందు అధికమగు అభిలాష గలదో దానిని త్యజించినచో ముక్తి లభించినట్లే. చిత్తము వాసనారహితమై దృశ్యము వైపునుండి మరలి ఆత్మవైపున కెపుడేతెంచునో అపుడే సంసారదుఃఖము నశించి ఆత్మసాక్షాత్కార ముదయించును. ఇక నిపుడు కర్కటి రాక్షసియొక్క ప్రశ్నజాలమును వినుము.

పూర్వము హిమాలయ పర్వత ఉత్తర భాగమున కర్కటియను రాక్షసి నివసించు చుండెను. ఆపె అతిదీర్ఘకాయము గలది. కృష్ణవర్ణిని. విశాలదేహము గలదగుటచే క్షుధాశాంతికై ఆహారము సంతృప్తిగ లభింపమి అజ్ఞానులగు సమస్తప్రాణులను భక్షింపనెంచి హిమవచ్ఛిఖరముపై ఏకపాదముపై నిలబడి వేయి సంవత్సరములు తీవ్ర తపంబొనర్చ ఆ పిదప బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా అంత నా కర్కటి 'జనులందు ప్రవేశించుటకై నేను లోహరహితమైన (రోగరూప) సూచికయు, లోహరూప సూచికయునగుదునుగాక!' అనికోరగా పద్మజు డట్లేయని చెప్పి, నీవు దుష్టజనుల శరీరములందు సూచీ (సూది) రూపమున బ్రవేశించి వ్యాధిరూపిణివై బాధింతువు. ఆ (విషూచీ) రోగముయొక్క చికిత్సకై నేను మంత్రము చెప్పెదను వినుము.

"ఓం హ్రీం హ్రాం రీం రాం విష్ణుశక్తయే నమః,
ఓ నమో భగవతి విష్ణుశక్తిమేనాం
ఓం హర హర నయ నయ పచ పచ మథ మథ
ఉత్సాదయ దూరీ కురు స్వాహా, హిమవన్తంగచ్ఛ
జీవ సః సః సః చంద్రమండల గతోఽసి స్వాహా !"

"మాంత్రికుడీ మహామంత్రమును తన కుడిచేతితో తన ఎడమ చేతియందు వ్రాసి ఆ ఎడమచేతితో రోగ పీడితుని దేహమంతయు తుడువ వలెను. నీవీ మంత్ర ప్రభావముచే హిమవత్పర్వతమునుగూర్చి పరుగిడి పోయినట్లు మాంత్రికుడు మనంబున ధ్యానించవలెను. మఱియు ఆ రోగి చంద్రమండల మధ్యమునందు అమృతరసాయనములో మునిగి యున్నట్లును జరామరణ బాధారహితునిగను; మనోవ్యథా శరీరజన్య రోగములవలన గలుగు దుఃఖము ఆ రోగిని విడిచి పోయినట్లును మాంత్రికుడు చింతన చేయవలెను. ఈవిధముగ నెవడైన మాంత్రికుడు పరిశుద్ధుడై బాగుగ నాచమనముచేసి శాంత చిత్తముతో సర్వకార్యములను జేయునేని అపుడు నీవా రోగిని బాధింపక విడిచిపొమ్ము" అని బ్రహ్మదేవుడాజ్ఞాపించి అంతర్ధానమయ్యెను.

తదుపరి ఆ రాక్షసి క్రమముగ సూక్ష్మమై ద్వివిధ (లోహమయ, రోగరూప) సూచికా రూపమును బొంది జనుల హృదయములందు బ్రవేశించి బాధ గొలుపుచు నలుదెసల తిరుగసాగెను.

ఈ ప్రకారముగ ఆ కర్కటి బహుకాలము మనుజుల మాంసమును (సూచీ రూపమున) భుజించినను తృప్తిబొందకుండె. మఱియు నయ్యది తన స్వల్పదేహమును జూచి మిగుల ఖేదమొంది తన పూర్వశరీరమును తిరిగి పొందు నిమిత్తము హిమవచ్ఛిఖరముపై 7వేల సం॥లు ఉగ్రతపంబాచరించెను. దానిచే పాపము శమించి పవిత్రవతియు, బోధరూపిణియు నాయెను. దాని తపస్సుచే జగంబంతయు ఉడికి పోవ అపు డింద్రుడు నారదుని యట్లగుటకు కారణమేమని యడుగ నారదు డంత ఆ కర్కటియొక్క వృత్తాంతమును సూచీ రూపమున నయ్యది యనుభవించిన భోగములను అన్నిటిని వివరించి చెప్పెను. ఇంద్రుడపుడు

ఆ సూచికను వెదకుటకై వాయుదేవుని బంప, అతడు క్రమముగ జంబూద్వీపమున కేగి అట హిమవచ్ఛిఖరముపై నిశ్చలముగ తపంబొనర్చు చున్న సూచికనుగాంచి ఆ వృత్తాంత మంతయు నింద్రున కెఱింగించెను. తదుపరి వేయి సంవత్సరముల యనంతరము బ్రహ్మదేవుడు ఆ సూచికవద్దకు వెళ్ళి వరము కోరుకొమ్మనగా ''నేను జ్ఞేయమగు ఆత్మను బొందితిని. సంశయములు శమించినవి. తృప్తి నొందితిని, సత్యవస్తువును నేను; నాకు వరముతో నేమి పని, అసత్యవస్తువు నేల కాక్షింపవలె?'' అని మనంబున చింతించుచుండ బ్రహ్మదేవుడు ''నీ తపస్సు యొక్క ఫలమును నీవు బొందితివి. నీవు ఆ పూర్వశరీరమును బడసి అన్యాయ పరులగు జీవులను మాత్రమే భక్షించుచు జీవన్ముక్తుడవై లోకమున చరించెద''వని చెప్పి వెడలిపోవ, అయ్యది క్రమముగ తన విశాల రాక్షస దేహము నొందెను. అపుడట నాసీనయై 6 నెలలు ధ్యానమందుండి పిదప లేచి ఆహారము కొఱకై విచారించుచు న్యాయార్జితమైన దానినే భక్షింప వలెననియు అట్లుగాకున్న మరణమే శ్రేష్ఠమనియు తలంచుచుండ నింతలో వాయువు ''నీవు మూఢుల వద్దకు వెళ్ళి వారికి జ్ఞానమును బోధింపుము'' అవాక్యములను విని అయ్యది యా పర్వతమును దిగి క్రింది నున్న కిరాతరాజ్యమునకు రాత్రి సమయమున నేతెంచెను.

అపుడట ఆ కిరాతదేశరాజగు విక్రముడును, అతనిమంత్రియు రాత్రి చోరాది దుష్టజీవులను దండించు నిమత్తము నగరమునకు వెలుపల నున్న అరణ్యమునకు రాగా కర్కటి వారిని జూచి తన కాహారము లభించెనని సంతసించుచు, అయినను వీరు ఆత్మజ్ఞానులైనచో వధింపరాదని యెంచి వారి జ్ఞానమును పరీక్షించుటకై కొన్ని ప్రశ్నలడు గదలచి చాటుగా నుండి భీకరముగ గర్జించి ''ఓహో! మీరిరువురు ఇపుడు నాకాహారము కానున్నారు. మీరెవరు?'' అని అరవగా రాజు నిర్భయముగా ''నీ వెవరవు ? మా యెదుటకు రమ్ము'' అని యడుగ నంత నాభయంకర రాక్షసి వారివద్దకు వచ్చెను. దానిని జూచి వారిరువురు నిర్భయచిత్తులై యుండిరి. అపుడు మంత్రి ''నీయభీష్టమేమ''ని యడుగ రాక్షసి ''మీరాత్మ జ్ఞానము నెఱింగినచో ఉత్తములే, లేకున్న మీరు అనర్థ జీవులగుదురు. కావున మిమ్ముల భక్షించివైచెదను. నేనడుగు ఈ ప్రశ్నలకు

సమాధాన మీయుడు'' అనిచెప్ప అట్లే యని రాజనగా రాక్షసి, ''యథార్థముగా నొకటే అయి ఉపాధి భేదముచే అనేకముగా నుండి లక్షలకొలది బ్రహ్మాండములను బుద్బుదములు లయించునట్టి సముద్రతుల్యమగు అణువెయ్యది.'' ఇట్టి ఆత్మజ్ఞానమును గూర్చిన యనేక ప్రశ్నలనడిగి ఈ నా సంశయములను మీరు తొలగింపజాలనిచో మిమ్ములను, మీ రాజ్యమందలి జనులందరిని భక్షించి వైచెదనని చెప్పి యూర కుండ, నంత మొదట మంత్రియు, పిమ్మట రాజున్ను ఆ యా ప్రశ్నలకు సమాధానమిచ్చుచు, తాను ప్రశ్నించినది అనంతమై నిర్వికారమై, నాశరహితమై, ఏకమైనట్టి పరమాత్మ వస్తువును గూర్చియే యనిచెప్పిరి. అదివిని యా రాక్షసి సంతోషించి వారి మనోరథము తెలిపినచో తీర్చెదనని చెప్ప, రాజు 'నీ వికనుండి ఏ ప్రాణిని హింసింపకుము' అని వచింప రాక్షసి 'అట్లే' యనెను. అపుడు రాక్షసి తనకు బ్రహ్మదేవుడుపదేశించిన విషూచికా వ్యాధి నివారణ మంత్రమును వారిరువురకును (నదివద్దకుబోయి) ఉపదేశించెను. అపుడు రాజు నీవు మానవ స్త్రీరూపము దాల్చి కొంతకాలము మా గృహముననుండి తదుపరి హిమాలయ పర్వతముపైకి బోవచ్చును అని రాక్షసితో చెప్ప ఆమె యందుల కంగీకరించెను.

అంతట వారు ముప్పురును తిరిగి రాజభవనమున కేగిరి. అచట రాక్షసి కొంతకాలముండి తదుపరి హిమవత్పర్వత శిఖరమునకుబోయి సమాధినిష్ఠయం దుండి ఆ పిదప మరల రాజువద్దకు వచ్చి ఆహారమును గొనిపోవుచు, నివ్విధముగ నేటికిని అయ్యది అచటనే యున్నది. ఆ రాజుయొక్క తదనంతరము వారి వంశములోని వారు ఆ రాక్షసికి యథారీతి ఆహారము నిచ్చుచుండిరి. ఈ ప్రకారమయ్యది కిరాత రాజులతో మైత్రి గలిగియుండి, ఆ రాజ్యమందలి రోగ తదితర భయాదులను నిర్మూలించుచుండెను. నేటికిని అచట అట్లు జరుగు చున్నది. ఎపుడైన అయ్యది అధికకాలము ధ్యాననిష్ఠ యందుండి కిరాతరాజ్య మునకు రానిచో అచటివారు అచటి దోషముల శాంతికై 'కందరాదేవి' అను రాక్షసియొక్క మూర్తిని నిర్మించి ఎత్తయిన స్థానమున స్థాపించి పూజించెదరు. అచటి ప్రతి రాజున్ను అట్లాకందరాదేవిని స్థాపించును.

ఏ రాజైన స్థాపించనిచో, భయరోగాదు లాతని ప్రజలను నశింపజేయును. ఆ కందరాదేవి ప్రతిమ నేటికిని అచట గలదు. ఆ దేవి యశుభములను బోగొట్టి శుభమును గలుగ జేయుచు నేటికిని ఆ కిరాతరాజ్యమున వర్థిల్లుచున్నది.

## ఐందవోపాఖ్యానము

శ్రీ వసిష్ఠుడు - ఓ రామచంద్రా ! ఈ జగత్తు మనో మాత్రమే యనుటకు పూర్వము బ్రహ్మదేవుడు నాకు చెప్పిన ఆఖ్యానమును చెప్పెద వినుము -

ఒకానొకపుడు నేను 'సృష్టి సమూహము లెటనుండి యేతెంచినవి' అని బ్రహ్మదేవుని యడుగ అతడిట్లు చెప్పెను - ఒకపుడు నేను సృష్టిచేయ నుంకించుచు, దివ్యదృష్టిచే నాకసమున పరికించి చూడ ప్రకాశమానము లగు వేర్వేఱు బ్రహ్మాండములను గాంచి విస్మయమొంది అందలి ఒకానొక సృష్టియందలి సూర్యుని బిలిచి అవి యెట్లేర్పడినవో తెలుపుమని యడుగ సూర్యుడిట్లు చెప్పెను -

'దేవా ! పూర్వకల్పమున కైలాస పర్వతము క్రింద జంబూ ద్వీపము యొక్క ఒకానొక భాగమున 'సువర్ణజట' యను ప్రదేశమున మరీచ్యాదులచే నిర్మింపబడిన యొక మండలమున ధర్మాత్ముడగు ఇందువను బ్రాహ్మణుడు అతని పత్ని గలరు. సంతానము లేమి ఖిన్నులై, ఆ బ్రాహ్మణ దంపతులు కైలాస పర్వతముపై చాల కాలము ఘోర తపంబు సల్ప, పార్వతీ సమేతుడై మహాదేవుడేతెంచి మనోరథమును దెల్పుమన అంత నా బ్రాహ్మణుడు మహాబుద్ధిశాలురగు పది మంది పుత్రులు తనకు కలుగవలెనని ప్రార్థించెను. అట్లే అని చెప్పి మహాదేవుడు వెడలిపోగా వారిరువురు స్వగృహమున కేగిరి. కాలక్రమమున వారికి పది మంది పుత్రులు జనించిరి. వారు క్రమముగ సర్వశాస్త్రపారంగతులైరి. ఇట్లుండ కొంతకాలమునకు వారి జననీ జనకులు దేహయాత్ర చాలించి విదేహకైవల్యము నొందిరి. అపుడు ఆ ఐందవులు చింతాక్రాంతులై కైలాస పర్వతము పైకి జని వారిలో వారు 'లోకమున పరమ శ్రేయప్రదమైన

వస్తువేది' యని పరస్పరము విచారించుకొనుచుండ జ్యేష్ఠభ్రాత 'బ్రహ్మదేవుని పదము ఉత్తమమైనది. నేను బ్రహ్మదేవుడను. నాచే ఈ జగంబంతయు సృష్టింపబడి లయమొందింప బడుచున్నది. ఈ ప్రకారముగ దీర్ఘకాలము చింతించి ధ్యానించినచో ఆ బ్రహ్మపదము లభించు'నని చెప్ప 'తక్కిన సోదరులు సంతోషించి ఆ కైలాస పర్వతముపై పద్మాసనాసీనులై నేత్రములు మూసికొని బాహ్యవృత్తులను వదలి ఈ బ్రహ్మాండమునకు నేనే కర్త. లోకము లన్నియు నా యందేవర్తించుచున్నవి.'

ఈ రీతిగా మనంబున భావన చేయుచు నుండిరి. కాలక్రమమున వారి దేహములు కృశించి పడిపోవ మాంసాహారులగు వన్యమృగములు వానిని భక్షించివైచెను. కాని వారు అట్లే మనంబున ధ్యానించుచు చతుర్యుగాంతమున కల్పక్షయమగు వఱకు నుండిరి. మఱియు ఇపుడు కల్పారంభమున కూడా వారట్లే యుండిరి. ఈ ప్రకారముగ వారు బ్రహ్మదేవులైరి. ఈ పది బ్రహ్మాండములును వారి మనంబుల యందు వర్తించుచున్నవి. అందు ఒకానొక బ్రహ్మాండమందు నేను సూర్యుడను! - ఈ ప్రకారముగ ఆ సూర్యుడు పలికియూరకుండ నంత నేను (బ్రహ్మదేవుడు) 'ఈ పది బ్రహ్మాండములుండ ఇక మరల నా సృష్టిచే నేమి ప్రయోజనము అని యడుగ సూర్యుడిట్లు పలికెను - మీరు నిష్కాములు. ఈ సృష్టి మీ లీలా మాత్రము, సత్పురుషులు ప్రాప్తించిన కర్మను ఆసక్తిరహితులై ఆచరింతురు. ఆత్మజ్ఞులకు కర్మచేగాని కర్మత్యాగముచేగాని ప్రయోజనము లేదు. అయినను నిష్కామ బుద్ధిచే ప్రాప్తించిన కర్మము జేయుడు. వారివారి మనంబులందు సృజించుకొనిన దానిని నశింపజేయుటయందు, వారు వారు తప్ప తదితరులెవరును శక్యులుకారు. మనస్సే సుఖ దుఃఖములకు కారణము. ఇవ్విషయమున ఇంద్రాహల్య వృత్తాంతమును వినుడు.

## ఇంద్రాహల్యా వృత్తాంతము

పూర్వము మగధ దేశమును ఇంద్రద్యుమ్నుడను రాజు పాలించుచుండెను. అతనికి అహల్యయను సుందర స్త్రీ భార్యగా

నుండెను. ఆ నగరమున ఇంద్రుడను వ్యభిచార శిరోమణియైన బ్రాహ్మణ కుమారుడొకడుండెను. అహల్య అతనియం దాసక్తిగలిగి నిరంతర మాతని గూర్చియే చింతించుచు ఖిన్నయై యుండెను. అదిగాంచి ఆమె సఖి అతని నెట్లైన గొనివచ్చెదనని చెప్పి ఒక రేయి అట్లే తీసికొని వచ్చెను. అప్పటినుండియు వారివురును ఒకరినొకరు విడిచి యుండజాలకుండిరి. రాజు ఆ విషయమునెఱింగి వారిరువురకును అనేక దండనలు విధించెను. ఏనుగులచే త్రొక్కించెను; చన్నీళ్ళయందుంచెను. కొరడా దెబ్బలు కొట్టించెను. కాని వారు ఏ మాత్రము దుఃఖము నొందక ఒకరియొక్క స్మృతిచే మఱియొకరు హర్షపూరితులై యుండిరి. అప్పుడు రాజు వారేల క్లేశము నొందుటలేదని యడుగ ఇంద్రుడిట్లు చెప్పెను -

మాకీ జగత్తంతయు ఒకరి రూపముగ మఱియొకరికి కనుపించుచున్నది. (అనగా నాకు అహల్యామయముగను, ఆమెకు ఇంద్రమయముగను దోచుచున్నది.) కాబట్టి మా దేహములు బాధింప బడినను మనస్సులు పరస్పరము ప్రేమమయములై సుఖముగ నున్నవి. ఏ దండనలైనను, వరశాపాదులైనను శరీరమును ప్రభావితము చేయగలవే కాని మనంబునుగాదు. మనస్సే ముఖ్యాంకురము. శరీరము నశించినను మనస్సు ఇంకను ననేక శరీరములనుత్పన్నము చేయగలదు. ఈ దండనలు మీ దృష్టియందు దుఃఖకరములుగ దోచుచున్నవిగాని పరస్పరాను రాగయుక్తులమైన మాకట్టిమియును లేదు. ఇంద్రుని యా వాక్యములను విని రాజు సమీపమున నున్న భరతమునితో ''ఈ నీచులకు తగిన శాపమిండు'' అని చెప్ప అతడు విచారించి 'దుర్బుద్ధులగు మీరిరువురును నశించి పోవుదురు గాక !' యని శపించెను. అపుడు ఇంద్రుడు డామునితో నిట్లనెను - 'ఈ శాపప్రయోగము ద్వారా మీరు మీ తపస్సును నశింపజేసికొనిరి. ఈ శాపముచే మా కేమియు నష్టములేదు. దేహము నశించినను మనోరూపులమగు మా కేమియు హానిలేదు.' తదుపరి వారిరువురును శాపకారణంబున మృతినొంది భూమిపైబడిరి. అనంతరము వారు తమ అన్యోన్య దృఢప్రేమచే అనేక జన్మలందు స్త్రీపురుషులై జనించిరి. నేటికిని వారెచటెచట జన్మించు చున్నారో అచటచట స్త్రీపురుషులుగనే యుదయించుచున్నారు.

ఈ ప్రకారముగ శాపములచే గూడ మనస్సును నిగ్రహించుటకు శక్యముకాదు. కాబట్టి ఐందవుల సృష్టులను నశింపజేయుట మీ వంటి మహాత్ములకు యుక్తముకాదు. మీరు ప్రత్యేకముగ మీచిత్తాకాశమున ఒకటిగాని, రెండుగాని లేక అనేకములుగాని యగు సృష్టుల జేయుడు. ఐందవులు మిమ్మేమి చేసిరి? మీరు మీ యాత్మయందు స్వేచ్ఛగ స్థితిగల్గియుండుడు - సూర్యుడిట్లు వచింప నేనందుల కంగీకరించి సృష్టి నొనర్చి అందా సూర్యుని ప్రథమ మనువుగానుండి సృష్టి క్రమమును తన యిచ్ఛ ప్రకారము జరుపుమని కోర ఆతడు సమ్మతించి తన శరీరమును రెండుగా విభజించి, ఒకభాగమును ఐందవ సృష్టియందలి సూర్యునిగా నియమించి మఱియొక భాగముతో మను పదమును బొందెను.

వసిష్ఠుడు:- దేవా ! వరశాపములు మనస్సునేల నిగ్రహింపజాలవు ?

బ్రహ్మదేవుడు:- మనస్సు స్వతంత్రము, అస్వతంత్రము గూడను. పురుషప్రయత్నముచే దృఢమొనర్చుకొనబడిన చిత్తమును శాపాదు లేమియు చేయజాలవు. పురుష ప్రయత్నరహితములైన అదృఢ చిత్తములను శాపాదులు ప్రభావితములుగ చేయగలవు. మనస్సు ఎట్లు తీవ్రముగ భావించునో తన నిశ్చయము ప్రకారము అట్లే ఫలమును బొందును. కాబట్టి నీవు పరిచ్ఛిన్న (దృశ్య) దృష్టిని వదలి ఇచ్ఛారహితుడవై ఆత్మయందు నిలకడగలిగి యుండుము.

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ బ్రహ్మదేవుడు పూర్వము నా కెఱింగించినది నీకు చెప్పితిని. మాయాశబలిత పరబ్రహ్మము నుండి సమష్టి మనస్సును, దానినుండి వ్యష్టిమనస్సుల జీవులు ఉదయించుచున్నవి. ఆ యా జీవులు వారి గుణవైచిత్ర్యము ననుసరించి కొందఱు దీర్ఘ కాలమునకు కొందఱు అల్ప కాలమునకు మోక్షమును బొందుచున్నారు. మనోరూపమగు ఈ సంసారలత సమ్యగ్జ్ఞానమను గొడ్డలిచే ఛేదింప బడినచో మరల మొలకెత్తదు. (సంసార విముక్తినొందురు.) చిదాకాశ, చిత్తాకాశ, భూతకాశములను మూడాకాశములు గలవు. అందు చిదాకాశము సత్యమైనది. మాయాశబలిత చిదాకాశముననుండి తక్కిన రెండును ఉద్భవించుచున్నవి. అయినను ఈ భేదము అజ్ఞానుల

నిమిత్తము చేయబడినదేగాని, జ్ఞానులకొక చిదాకాశమే గలదు. ఆత్మ యందు జనన మరణములు లేవు. మనస్సే (దేహాదులద్వారా) జనించుచున్నది. మనస్సే మరణించుచున్నది. అట్టి మనస్సును ఆత్మయందు లయమొనర్చిన ఆత్మ రూపత్వము నొందును. అదియే మోక్షము. బంధమోక్షములు చిత్తాధీనములు. ఇవ్విషయమున పూర్వము బ్రహ్మదేవుడు నాకు వచించిన నొక కథ చెప్పెద వినుము -

## చిత్తోపాఖ్యానము

అతి విశాలమై శూన్యమై భయంకరమైనట్టి ఒక మహారణ్యము కలదు. అందు హస్తలోచనయుతుడగు శాలాకారముగల నొక మనుజుడు గలడు. ఆతడు తన యనేక చేతులతో ననేక గుదియ (దండము) లను గైకొనీ తనపై తాను మోదుకొనుచు పరువిడుచుండెను. ఒకపుడు చీకటి నూతిలో పడెను. అందుండి చాలా సేపటికి లేచి మరల అట్లే తనపై తాను బాదుకొనుచు పరువెత్తి ఒక శీతల కదళీ (అరటి) వనమున ప్రవేశించెను. అటునుండి వచ్చి ఒకానొక కంటక వనమున ప్రవేశించెను. అటనుండి మరల నూతిలో పడెను. మరల కదళీవనమున జొచ్చెను. ఇట్టి యాచారము గలవానిని జూచి కారణమేమియని నేనడుగ 'నీవు నా శత్రువు. నీచే నేను ఛేదింపబడితిని' అని యేడ్చుచు తన యంగములను దాను జూచుకొని నవ్వి క్రమముగ వానినన్నింటిని త్యజించెను. ఈ ప్రకారముగ నా యడవిలో నింకను అనేకులను ఆ ప్రకారమే చేయుచుండుటను జూచెను. కొందరు నా బోధచే తమ యంగములనుద్యజించుచుండిరి. కొందరు నన్ను తిరస్కరించి వెడలిపోవు చుండిరి. ఈ ప్రకారముగ దీర్ఘకాలమువఱకు వారా మహాటవి యందు పరిభ్రమించుచు సుఖదుఃఖముల నొందుచుండిరి.

ఓ రామచంద్రా ! దీని యంతరార్థమును వినుము. ఈ సంసారమే ఆ మహారణ్యము. జీవుల చిత్తములే ఆ ప్రహారము సల్పుకొను మనుజులు. కొన్ని చిత్తములు నా బోధచే శాంతి నొంది తమ రూపమును త్యజించి ముక్తినొందు చున్నవి. కొన్ని వివేకమును బోధను ఉపేక్షించి తిరస్కరించి బంధముననె చిరకాలము తగుల్కొని యున్నవి. ఆ

యంధకూపమే నరకము. కదళీవనమే స్వర్గము. కంటకవనమే మనుష్యలోకము.

ఈ ప్రకారముగ మనస్సు స్వయముగనే దుఃఖమును విస్తరించి జేసికొనుచు పట్టు పురుగువలె తన్ను తానే బంధించు కొనుచున్నది. చిరకాలము సమాధిని శీలించుటచేతను ఆత్మభావన నభ్యసించుటచేతను మనస్సు సూక్ష్మత్వము నొంది దుఃఖరాహిత్యము నొందుచున్నది. మనస్సుయొక్క ప్రమాదము (అజ్ఞానము) చేతనే దుఃఖము వృద్ధినొందుచున్నది. మరల మనస్సుయొక్క వివేకముచేతనే దుఃఖము నశించు చున్నది. కాబట్టి వాసనారాహిత్యము ద్వారా మనస్సును జయించి బ్రహ్మ (ఆత్మ) పదమునుబొంది నట చిరకాలము స్థితి నొందినచో గొప్ప ఆపదలందును శోకమును బొందడు. వాస్తవముగ జ్ఞానికి బంధ మోక్షదృష్టులు రెండును లేవు. మొదట మాయాశబలిత పరమాత్మనుండి మనస్సు, ఆ మనస్సునుండిజగత్తు, దాదిచే బాలకునకు చెప్పబడిన, ఈ క్రింది కథవలె (మిథ్యారూపమున) స్థితి బొందినవి.

## బాలకాఖ్యాయిక

సత్యాసత్య వివేకరహితుడగు బాలుడొకడు తన దాదిన ఒక మంచి కథ చెప్పుమని యడుగ, ఆమె యిట్లు చెప్పదొడగెను. అసత్తను నగరము గలదు. అందు ముగ్గురు రాజకుమారులు గలరు. వారిలో ఇద్దరింకను పుట్టనే లేదు. ఒకడు తల్లిగర్భమున నింకను బ్రవేశింపలేదు. ఒకప్పుడా నగరమున కరువు రాగా వారు ముగ్వురు మరియొక పట్టణమునకు బోవుచుండ త్రోవలో ఎండవేడిమిచే తపించుచుండ నటమూడు వృక్షములను జూచిరి. అందు రెండుత్పన్నము కాలేదు. ఒకదానికి బీజమేలేదు. అందొక చెట్టుక్రింద సేద దీర్చుకొని వాని ఫలముల భుజించి బయలుదేరిరి. మరల త్రోవలో మూడునదులు కనుపించెను. అందొకటి బాగుగ శుష్కించి పోయినది. తక్కిన రెంటియందును నీరులేదు. ఆ శుష్కించిన దానియందు వారు స్నానము చేసి సాయంకాలమునకు భవిష్యన్నగరమునకు జేరిరి. అచట మూడు భవనములు గలవు. వానిలో రెండింకను కట్టబడలేదు. ఒక దానికి గోడలే లేవు. గోడలే లేని భవనమున

వారు ప్రవేశించిరి. అట మూడు బంగారు పాత్రలు గాంచిరి. అందు రెండు విరిగిపోయినవి. ఒకటి పొడి పొడి అయిపోయినది. ఆ చూర్ణమైన పాత్రయందు నూఱు ద్రోణముల అన్నమును వండి ముగ్గురు బ్రాహ్మణులను బిలిచిరి. వారిలో ఇద్దరికి శరీరములే లేవు. ఒకనికి ముఖము లేదు. ఆ ముఖములేని బ్రాహ్మణుడు ఆ వంద ద్రోణముల అన్నమును తినివేయగా మిగిలిదానిని ఆ రాజకుమారులు ముగ్గురు తినిరి. అనంతరము ఆ ముగ్గురు వేటకువెళ్ళి ఇప్పటికిని సుఖముగ నున్నారు! - ఈ కథవిని ఆ బాలుడు సంతోషించెను.

ఓ రామచంద్రా ! బాలకాఖ్యాయికవలెనే ఈ జగత్తు కల్పిత సంకల్పములచే దృఢత్వము నొంది యున్నది. భవిష్యన్నగరమున ఆ రాజపుత్రుల యొక్క స్థితి యెట్లు సంకల్పరచనయై యున్నదో ఈ సంసార స్థితియు నంతియే. శరీరము నశించిన ఆత్మ నశింపదు. శరీరమున కెన్ని సుఖదుఃఖములు కలిగినను దానికి విలక్షణముగను వేఱుగను నున్న ఆత్మకు ఏ హానియు లేదు. జగత్కల్పనయంతయు మనస్సువలనే కల్గినది. కావున ఆత్మను గూర్చిన వివేకము ద్వారా ఆ మనస్సును నశింపజేసిన మోక్షము లభించును. కాబట్టి నీవు మనోనాశార్థము యత్నము సల్పుము. మనస్సు సత్యమును అసత్యముగను, అసత్యమును సత్యముగను; హ్రస్వకాలమును దీర్ఘ కాలముగను, దీర్ఘకాలమును హ్రస్వకాలముగను దర్శింప జేయుచున్నది. ఇట్లే జగత్సంబంధమగు ఇంద్ర జాలము చిత్తముయొక్క ఆధీనమై యున్నదనుట కొక అఖ్యానమును జెప్పెద వినుము.

## ఇంద్రజాలోపాఖ్యానము

ఉత్తరాపాండవమను రాజ్యముగలదు. హరిశ్చంద్రుని కులమందు జనించిన లవణుడను ధర్మాత్ముడైన రాజు దానిని పాలించు చుండెను. ఒకనాడాతడు మంత్రులతోను, సామంతులతోను, ఇతర సభాసదులతోను గూడి కొలువుతీర్చి యుండ నప్పటి కొక ఇంద్రజాలికుడు వచ్చి రాజుతో మీరొక అశ్చర్యప్రదమగు కౌతుకమును ఈ సింహాసనముపై నుండియే వీక్షింపుడని పలికి తన చేతియందలి నెమలియీకను రాజు ముందు

త్రిప్పెను. ఆ క్షణముననే యొక డొక గుఱ్ఱము నటకు గొనివచ్చి రాజుతో 'మా ప్రభువిద్దానిని తమకొఱకు పంపె'నని చెప్పెను. అపుడు ఇంద్రజాలికుడు రాజుతో ఆ గుఱ్ఱము నెక్కి విహరింపుడని చెప్ప రాజా గుఱ్ఱమును జూచి కనుమూసికొని నాలుగు ఘడియ లట్లే యా సింహాసనమున నిశ్చలముగ నుండెను. అదిగాంచి సభాసదులెల్లరు ఆశ్చర్యమగ్నులై, నిశ్చేష్టితులై యుండిరి. నాలుగు ఘడియలైన వెనుక రాజు మేల్కొని సింహాసనముపై నుండి పడుచుండ ఎదుటనున్న వారు పట్టుకొనిరి. అపుడు మంత్ర్యాదులు రాజును భ్రమ కారణమడుగ రాజు సభాసదులందఱితోను నాలుగు ఘడియలలో జరిగిన తన వృత్తాంతమంతయు నిట్లు వర్ణించి చెప్పెను -

ఇంద్రజాలికుడు నాయెదుట నెమలియీకను ద్రిప్పిన పిదప నేను భ్రమయందు నా యెదుటనున్న యీగుఱ్ఱము నెక్కి వేటకు బోవ ఒక విశాలమైన యరణ్యము కానవచ్చెను. నేనట్లే దప్పికతో బోవుచుండ నింకొక యరణ్యము కానుపింప నట నొక లత బట్టుకొనగా, నాక్రిందనున్న గుఱ్ఱము ఎటకో సాగిపోయెను. ఇంతలో సాయం సమయము కాగా నేనా రాత్రి యా మిక్కుటమైన చలిలో నటనే అతి దుఃఖముతో గడిపి ప్రాతఃకాలమున ఆ యరణ్యమున దిరుగాడుచుండ నింతలో నట చాండాలకన్య ఒక పాత్రయందు అన్నమును గొనిపోవుచుండుటను జూచి ఆమెను కొంత అన్నము పెట్టుమని వేడుకొనినను ఆమె యది యాతనికి తగిన ఆహారము కాదని నిరాకరించి పోవుచుండ నే నామె వెనువెంటనే పోవుచు ప్రాధేయపడగా తుదకామె 'నీవు నా పతివైనచో అన్నమిత్తున'ని చెప్ప అతడందుల కంగీకరించెను. అపుడా పాత్రలోని యన్నములో సగము భాగము నాకివ్వ, దానిని నేను భుజించి నేరేడుపండ్ల రసమును ద్రావి అట కొంత సేపు విశ్రమించితిని. పిదప ఆ స్త్రీ పొలమును దున్నుచున్న తన తండ్రికి మిగిలిన ఆ అన్నమునిచ్చి వివాహమును గూర్చిన తన సంకల్పము నాతనికి నెఱింగింప, ఆతడు సమ్మతించెను. అపుడు సాయం సమయమున మేము ముగ్గురము చాండాల వాటికకు వచ్చితిమి. అచట మాంసాదులతోను, ఈగలతోను ఆ ప్రదేశము చాల యశుభ్రముగ నుండెను. తదుపరి ఒకానొక శుభ దినమున ఆ చండాలు రందరు వైభవముగ ఆ స్త్రీ తోటి నాకు వివాహము చేసిరి.

కాలక్రమమున నాకు పలువురు కుమారులు, కుమార్తెలు కలిగిరి, కుటుంబభార మధికమయ్యెను. ఆ కుటుంబపాలనకై నేను పడరాని పాట్లు పడితిని. ఎన్నియో ఇక్కట్లను అను భవించితిని. గ్రామవాసులతోను తదితరులతోను అనేక కలహములు సంభవించెను. ఇట్లు బహు దుఃఖముతో నా జీవితము గడచెను. ఇంతలో నేను వృద్ధుడనైతిని. నేనున్న యా ప్రదేశమున గొప్ప దుర్భిక్షము సంభవించెను. అనేకులుతిండిలేక మరణించిరి. కొందఱా ప్రదేశమును వీడి ఇతర చోట్లకు బోయిరి. నేనున్ను అటనుండి నా కుటుంబమును మితముగ వెంటనిడుకొని బయలుదేఱితిని. త్రోవలో నొక వృక్షము క్రింద విశ్రమించితిని. నా భార్య నిదురింప నా కడగొట్టు కుమారుడు ఆకలి బాధకు తాళజాలక మాంసమిమ్మని నన్ను చాల పోరు పెట్టెను. అతని యా బాధ చూడజాలక నేను మరణింప నిశ్చయించి, అట కట్టెలను పేర్చి అగ్ని రగుల్కొలిపి అందు దూకుచుండ, ఇచట ఈ సింహాసనము నుండి పడబోవ అపుడు తూర్య జయ జయ నాదములచే నేను మేల్కొల్పబడితిని. ఈ ప్రకారముగ ఇంద్రజాలికుడు నాకు భ్రమను గొలిపెను - అని రాజు వచింప అపుడా ఇంద్రజాలికు డంతర్ధానమయ్యెను. అది గాంచి సభాసదులు రాజుతో 'ఈత డింద్రజాలికుడు కాదు, అయియుండినచో ధనమును వాంఛించి యుండెడివాడు. ఈతడేదియో దైవీమాయమై యుండనోపు' అని చెప్పిరి.

ఓ రామచంద్రా ! ఆ సమయమున నేనున్ను ఆ సభయందుంటిని. కావున ఈ వృత్తాంతము నపుడు నేను కన్నార చూచితినే గాని ఒకరి వలన వినినది కాదు. ఈ ప్రకారము జగద్వైచిత్ర్యము చిత్తము వలననే కలిగినదని యెఱుగుము.

మనోవృత్తులే సంసారమను విషవృక్షమునకు ఉత్పత్తి స్థానము, భోగవాసనా సంక్షయముద్వారా వానిని నిగ్రహిచుట ద్వారా మనస్సును సంయమ మొనర్చినచో సంసారభ్రమ శమించి ఆత్మప్రాప్తియను మోక్షము లభించును. తన కభిలషితమైన వస్తువును త్యజించుట ద్వారా చిత్తము సులభముగ జయింపబడును. సంకల్పముల యొక్క అభావమను శస్త్రముచే చిత్తమను వృక్షము సమూలముగ ఛేదింపబడ జీవునకు బ్రహ్మస్వరూప ముదయించును.

కాబట్టి పురుష ప్రయత్నము ద్వారా వాసనలను నిర్మూలించి చిత్తమును అచిత్తముగ నొనర్చి నాశరహితమగు ఆత్మసామ్రాజ్యస్థితిని బడయ వలయును. మనస్సును మనస్సు చేతనే జయించవలెను. ఇంతకు మించి ఆత్మప్రాప్తికి మఱేయుపాయమున్ను లేదు. సంకల్పము యొక్క అభావమే అవిద్యానాశోపాయము.

శ్రీ రాముడు:- ఆ ఇంద్రజాలికుడెవడు? ఆత డెటకేగెను? శుభాశుభ కర్మఫలముల ననుభవించున దెవరు?

వసిష్ఠుడు:- ఓ రామచంద్రా! శుభాశుభ కర్మఫలముల ననుభవించునది చిత్తమే గాని ఆత్మకాదు, జడమగు శరీరము కాదు.

మఱునా డారాజు వింధ్యాచలారణ్యమునకుబోయి చూడగా తాను భ్రమయందు గాంచిన చాండాలవాటికాది దృశ్యము నటగాంచెను. అచట తన చాండాల స్థితి యందు తన యత్తయైయున్న స్త్రీ తన కుమార్తె మున్నగు వారి వియోగమునకై విలపించుచుండ వారల కుచిత ధనాదుల నొసంగి కొంతకాల మట ఉండి పిమ్మట స్వదేశమునకు వచ్చెను. తదుపరి యారాజు 'భ్రమ' యందలి పదార్థములు జాగ్రత్తునందు సత్యముగ నేల కానుపించెనని నన్నడుగ నేనిట్లు చెప్పితిని - 'అవిద్యయం దంతయు సంభవించును. దానిచే లేనిది యున్నట్లును, ఉన్నది లేనట్లును అగును. కాకతాళీయ న్యాయముచే చిత్తవాసనాకారణమున జనుల వ్యవహారములు ఎప్పుడైన పరస్పరము కలియుచుండును. లవణుని చిత్తసంస్కారము వింధ్యాచల చాండాలుని హృదయముననను, చాండాలుని సంస్కారము రాజు హృదయముననను రూఢియై యుండెను. కావున అట్లు సంభవించెను. యథార్థముగ ఈ అవిద్య యనునదియే లేదు. బ్రహ్మము ఒక్కటి మాత్రమేగలదు. మిగుల అనాత్మభూతమగు అవిద్యారూపమైన చిత్తమును, ఓ రామచంద్రా ! నీవు దూరీకృతమొనర్చి శేషించిన ఆత్మయందు స్థిరుండవై యుండుము. శుభేచ్ఛాది సప్తభూమికలను క్రమముగ నారోహించి సంకల్ప (మనో) విలయము ద్వారా స్వాత్మపదము నొంది పరమశాంతిని బొందవలయును.

# 4. స్థితి ప్రకరణము

ఇంద్రియనిగ్రహమను వారథిచేతనే ఈ భవసాగరము దాట బడును. గాని మఱిదేనిచేతను గాదు. దృశ్యముయొక్క అత్యంతా భావముచేదప్ప మనస్సను పిశాచము ఇక దేనివలనను శాంతి నొందదు. మనస్సునందే యీ జగంబులన్నియు గలవు. ఇవ్విషయమున భృగుకాల సంవాదరూపమగు వృత్తాంతమును వినుము -

పూర్వము మందరాచలముయొక్క ఒకానొక శిఖరముపై భృగుమహర్షి ఘోరతపంబు సల్పుచు సమాధిస్థుడై యుండ నతని కుమారుడగు శుక్రాచార్యు డేకాంతమున స్వస్థచిత్తుడై యుండెను. అత్తఱి ఒక సుందర అప్సరస ఆకాశమార్గమున బోవుచుండుటను శుక్రాచార్యులు చూచి మోహపరవశుడయ్యెను. ఆమెయు శుక్రుని గాంచి మోహమును బొందెను. అనంతరము శుక్రాచార్యుడు నేత్రములను మూసికొని ఆ యప్సరసనే మనంబున ధ్యానించుచు ఈ ప్రకారముగ తన మనోరాజ్యమున ననుభవించెను - 'ఈ సుందర స్త్రీతో గూడ నేను స్వర్గమునకు వెళ్ళితిని. ఇదిగో ఇదియే స్వర్గము. చంద్ర సూర్యాది లోకపాలురు ఇంద్రుడు మున్నగు వారిదిగో'. అటుపిమ్మట తన మనోరాజ్యముననే ఇంద్రునకు నమస్కరింప అతడా ఋషిపుత్రుని యాదరించి చిరకాల మట నివసింపుమని చెప్పెను. కొంతసేపచట విశ్రమించి స్వర్గవైభవమును గాంచుటకై వెడలి అప్సరసా సమూహమును గాంచి అందు తాను పూర్వము జూచిన విశ్వాచీ యను అప్సరసను వీక్షింప ఇరువురును మోహపరవశులైరి. అపుడు శుక్రాచార్యులచట అంధ కారమును గల్పించి ఇతర జనులందరును వెడలిపోయినపిదప ఏకాంతముగ నామెతో రమించెను. ఈ ప్రకారము శుక్రాచార్యుడామెతో గూడ దీర్ఘకాలము స్వర్గమందలి వైభవముల ననుభవించుచుండెను. తదుపరి పుణ్యము క్షయింప వారిరువురి దేహములు స్వర్గము గుండా భూతలముపై బడెను.

వారి దేహములు ఛిన్న భిన్నములాయెను. శుక్రాచార్యుని సూక్ష్మదేహము అనేకజన్మలెత్తి తుదకు తాపసియై జనించి సమంగా నదీ

తటమున తపము సల్పుచుండెను. అతని పూర్వపు శుక్రాచార్య దేహము కాలక్రమమున కృశించి భూమిపై పడి శైథిల్యత నొందెను. భృగుమహర్షి తపఃప్రభావముచే నద్దానిని హింసజీవులెవ్వియు భక్షింపక నుండెను. ఇట్లుండ వేయి దేవతావత్సరములు గడిచిన మీదట భృగు మహర్షి సమాధినుండి లేచి, పుత్రుని మృత శరీరము నెదుట గాంచి అకాలమున నాతనిని కాలుడు హరించివైచెనని యెంచి పూర్వపరములను విచారించక కాలుని శపింప నుద్యుక్తుడై యుండ నపుడు కాలుడు భౌతిక దేహరూపియై యెయటకు వచ్చి ఆ ఋషి పూర్వాపరములను విచారించక కృద్ధుడాయెననియు, ఈశ్వరనియతినే తానాచరించెననియు, పరమార్థ దృష్టి యందెవరును కర్తకారనియు, అజ్ఞుని వలె వ్యర్థముగ తన్ను శపింపరాదనియు, స్థూలశరీరము నశించును సూక్ష్మశరీరము నశించనదై మోక్షపర్యంతము వాసనానుసారమనేక జన్మల గైకొనుననియు చెప్పి, శుక్రుని స్వర్గగమనాది వృత్తాంతమంతయు ఆతనికి నివేదించి ఇపుడాతని పుత్రుడు సమంగానదీ తటమున 800సం॥ల నుండి తపము సల్పుచున్నాడని తెలియజేసి తాను జూడదలంచినచో, ఆ వృత్తాంతమంత యును తనయోగదృష్టితో జూడవచ్చుననియు చెప్పెను. మఱియు నిట్లు వచించెను - మీ పుత్రుడు మానసిక దేహముచే దేనిని జేసెనో దానినే పొందెను. జీవుడు తన వాసనానుసారమే యేకర్మ చేయునో దానిఫలమునే పొందును. ఇట అన్యుల కర్తృత్వమేమి గలదు ? - పిమ్మట భృగుమహర్షి జ్ఞానదృష్టిచే ముహూర్తమాత్రకాల మంతయు పరికించి తదుపరి కాలునితో ''నీవు చెప్పిదనంతయు సత్యము. నేను పొరబడి మఱియొక విధముగా తలంచితిని'', అని చెప్పగా నంత కాలుడిట్లనెను -

మనోమోహమును జయించినవారే కృతార్థులు. పాపము క్షయింప అంతఃకరణము శుద్ధముకాగా సజ్జనుల నిర్మల బుద్ధి శాస్త్రవిచారణ యందు ప్రవృత్తిగలదగును. శాస్త్రవిచారణచే మనోమోహము నశించును'' - కాలుడిట్లు పలికిన మీదట నంత వారిరువురును గలిసి స్వర్గమునుండి బయలుదేఱి భూతలమున సమంగా నదీతటమున తపంబు సల్పుచున్న శుక్రునికడకు బోయిరి. అచటికి బోయి కాలుడు భృగువునకు బ్రాహ్మణరూపమున తపమొనరించుచున్న శుక్రుని జూపి 'ఈతడు

సమాధినుండి లేచుగాక' యని సంకల్పింప శుక్రుడు సమాధినుండి లేచి వారలకు నమస్కరించి 'మీరెవరని ప్రశ్నింప, భృగువు 'నీవు నిన్ను స్మరించుకొనుము' అని చెప్ప అంత శుక్రుడు రెండు ఘడియలు ధ్యానమునం దుండి తన పూర్వ విషయమంతయు స్మరించి విస్మితుడై తన కృతకృత్యమును ఆత్మజ్ఞాన ప్రాప్తిని భృగువుని కెఱింగించి ఆ తన ''మందరాచలస్థితపూర్వ దేహమును చూచుటకు బోయెదము, రండు'' అనెను. అట్లే వారు ముప్వురును మందర పర్వతమునకు జనిరి. అచట శుక్రుడు నీరసించి శుష్కించి యున్నట్టి పూర్వ దేహమును వీక్షించి, 'అహా! ఇద్దానితో పూర్వ మనేక భోగముల ననుభవించితిని. దీనిని విశేషముగ ప్రేమించితిని. అట్టి యిది యిపుడు శుష్కించి, శిథిలమై పోయినది!' అనియట్లు విలపించెను. ఓ రామచంద్రా! వ్యవహారదశ యందు జ్ఞానులును, అజ్ఞానులును ఒకే విధముగ నుందురు. కాని అజ్ఞానులు సక్తులై బద్ధులగుదురు. జ్ఞానులు అసక్తులై నిర్లేపులై, ఆత్మస్థితి గలవారై ముక్తులగుదురు. కర్మేంద్రియములతో సక్తులైనను జ్ఞానేంద్రియములతో అసక్తులై యుండువారు ముక్తులే.

పిమ్మట కాలుడు శుక్రునితో ''నీవు యీ పూర్వదేహమున బ్రవేశింపుము. ఈ దేహముతో నీవు తపంబు సల్పి పిదప గ్రహాధికారమున అసుర గురుత్వమును బొందెదవు'' అని వచించెను. అటుపిమ్మట శుక్రుడు తన పూర్వ దేహమున బ్రవేశింప భృగువు ఆ దేహముపై జలమును మంత్ర యుక్తముగ సంప్రోక్షించెను. అపుడు పూర్వమువలనే శుక్రుని దేహము పవిత్రమాయెను. అతడు తండ్రికి నమస్కరించెను. తండ్రి యాతని ప్రేమతో కౌగిలించుకొనెను. అపుడు వారు ఆ శుక్రుని బ్రాహ్మణ శరీరమును కులాచారప్రకారము దహనము చేసివైచి ఆ మందరవనము ననే తపంబు సల్పుచు నుండ కాలక్రమమున శుక్రునకు గ్రహాధికారము దైత్యగురుత్వము లభించెను. భృగువున్ను తన ప్రజాపతి అధికారమున నుండెను.

'ఓ రామచంద్రా ! నీవు సర్వప్రయత్నములచే ఇంద్రియములను జయించి చిత్తమును వశమొనర్చుకొనుము. అపుడే మోక్షము లభించి జీవన్ముక్తుడ వగుదువు. జీవన్ముక్తుండీ శరీరమను నగరమున రాజువలె

సుఖముగ తన శేషించిన ప్రారబ్ధము ననుభవించుచుండును. ఏ దుఃఖమున్ను అతనిని బాధింపజాలదు. జీవితమంతయు అతనికి సుఖమయముగ నుండును. ఇంద్రియములకు వశులగు జనులను జూచియు, అజ్ఞ ప్రపంచమును గాంచియు ఆతడు నవ్వుచుండును. ఓ రామచంద్రా ! నీవు దామవ్యాళకటన్యాయము ననుసరింపకుము. భీమ భాస దృఢన్యాయ మనుసరించి దుఃఖరహితుడవు కమ్ము.

పూర్వము పాతాళమున శంబరుడును దైత్యులరాజుండెను. ఆతడు గొప్పమాయావి. శక్తిమంతుడు. ఆతనికి గొప్ప అసురసైన్యము గలదు. దేవతలతో నాతడు పెక్కు పర్యాయములు యుద్ధముచేసి వారల నోడించెను. ఒకతూరి వారీతని భయముచే స్వర్గమునుండి యంతర్ధానమై భూతలమున జేరిరి. శంబరుడు తన శక్తిచే దామ, వ్యాళ, కటులను ముువ్వురు గొప్ప రాక్షసులను సృజించెను. వారికి పూర్వకర్మలేమిచే వాసనారహితులై ప్రకృతమును మాత్రము కాకతాళీయముగ ననుసరిం చుచునుండిరి. వారిని గొప్ప సేనతో శంబరుడు దేవతల నాశముకొఱకై స్వర్గమునకుబంపెను. అపుడిరువురకును ఘోర యుద్ధము జరిగెను. తుదకు దేవతలు ఓడిపోయి, అంతర్ధానమొంది బ్రహ్మదేవునికడకేగి మొరపెట్టుకొనిరి. బ్రహ్మదేవుడు వారలతో ''ఇక పదివేలవత్సరములైన పిదప శ్రీవిష్ణువుచే శంబరాసురుడు హతుడగును. అప్పటివఱకు వేచి యుండుడు. ఈలోగా దామవ్యాళాదులతో కపట యుద్ధము చేయుచు రణరంగమునుండి పారిపోవుచు నుండుడు. ఇట్లుండ అహంభావము. ఉదయింప వారు వాసనారహితులై ''నేను, నాది'' ఇత్యాది భావసమన్వితులై యుందురు. అత్తఱి వారు సులభముగా జయింపబడగలరు. వాసనారహితులగువారిని, దేహాహంభావము లేనివారిని నెవరును జయింపజాలరు. వాసనాసహితులగువారు బాలునిచేగూడ జయింప బడగలరు'' అని చెప్పి అంతర్ధానమొందెను. పిదప దేవతలు బ్రహ్మ దేవుడు చెప్పిన చొప్పున దామాదులతో చాలా కాలము కపటయుద్ధములు చేయుచుండ కాలక్రమమున వారలందు అహంభావము, వాసనలు మున్నగునవి యుదయింప వారు మరణభీతులై పారిపోయిరి. అపుడు తక్కిన అసురసైన్యమంతయు

ఆకసమునుండి క్రిందిపడి నశించెను. శంబరుని భీతిచే దామాదులు ముప్పురును సప్తమ పాతాళమున దాగుకొన అచటనున్న యమకింకరులు తమ కొమార్తెల నిచ్చి వారికి వివాహము సల్పిరి. ఇట్లచట వారు వాసనాసహితులై 10వేల సంవత్సరముల వరకు నుండిరి. పిమ్మట నొకనాడచటికి మహానరక కార్యవిచారణార్థము యమధర్మరాజు తన కనుసైగ మాత్రముచే వారలను జ్వలించు మహారౌరవాది నరకభూము లందు పడవేయ నచటవారు భస్మీభూతులైరి. పిదప కిరాత, కాక, గృధ, శుక, సూకర, మేష, కీటాద్యనేక యోనులందు వారు జనించి యిపుడు కాశ్మీర దేశమున నొక చిన్న దొరువునందు మత్స్యములైయున్నారు. చూచితివా ! వాసనయొక్క దారుణ మహత్వము ! కావుననే దామ వ్యాళ కట న్యాయము నీకు వలదని నేనుచెప్పితిని.

ఆ దామాదుల దుఃఖ మెపుడు పరిసమాప్తమగునో వినుము. దామాదుల కుటుంబీకులగు యమకింకరుల ప్రార్థన విని యమధర్మరాజు ఆ సమయముననే వారికిట్లు చెప్పెను - వారు ముప్పురును ఎపుడు వేఱుపడి తమ గాథను విందురో అపుడుముక్తు లగుదురు. ఎట్లనగా కాశ్మీర దేశపు దొరువునందు చేపలై అనేక సారులు జన్మించిన పిదప వారచ్చోటనే పద్మసరోవరమున సారసపక్షులై జనించి శుద్ధత్వము నొంది ముక్త్యర్థము వేఱుపడిపోవుదురు. కాశ్మీర మండలమున అధిష్ఠాన మను నగరమున ప్రద్యుమ్నమను శిఖరమున నొక గొప్ప గృహము కలదు. అందొక మూల గూటియందు వ్యాళుడు పిచ్చుక అయి పుట్టును. ఆ నగరమును శ్రీయశస్కర దేవుడను రాజు పాలించును. అతని గృహమున నొక స్తంభముయొక్క ఛిద్రమున దాముండు దోమయై పుట్టును. ఆ నగరముననే నరసింహుడను జ్ఞానియైన (రాజ) మంత్రి వసించు చుండును. అతని గృహమున కటుడు పంజరమున సారిక పక్షిగ నుదయించును. ఒకప్పుడా మంత్రి శ్లోకరచిత మగు దామ వ్యాళ కథను చెప్పును. దాని నా సారికపక్షి విని మోక్షమును పొందును. అట్లే రాజమందిరమున నున్న దోమయు, ప్రద్యుమ్న శిఖరస్థమగు పిచ్చుకయు ఆ కథ విని మోక్షరూప శాంతిని బొందుదురు.

ఓ రామచంద్రా ! అజ్ఞానులగు జనులు అహంభావమును,

వాసనలను ఆశ్రయించి దామ వ్యాళ కటులవలె అథఃపతనము నొందుదురు. కాబట్టి వివేకము చేతను పురుషప్రయత్నము చేతను ఆ యహంభావాదులను త్యజింపవలయును. ఆత్మస్వభావమును నిరంతరము స్మరించుచుండుటవలనను, దృశ్యము మిథ్యయని నిత్యము భావించుట వలనను అహంభావము నశించును. అహంభావము శమంప సంసార దుఃఖమున్ను పూర్ణముగ శమించును.

దామాదులు నశించిన వెనుక శంబరాసురుని సేన దేవతలచే జయింపబడెను. పిమ్మట శంబరాసురుడు దేవతలను వధించుటకై ఆలోచించి ఆత్మజ్ఞాన సంపన్నులును వాసనారహితులునునగు భీమ, భాస, దృఢులను ముప్వురు దానవులను సృజించెను. వారు అహంభావ రహితులై దేవతలతో పోరి వారి నోడించిరి. అంత దేవతలు విష్ణుభగవానునితో మొరపెట్టుకొనగా భగవానుడు శంబరుని భీమాదులను వధించెను. దైవహతుడగుటచే శంబరుడు విష్ణుపురికి బోయెను. భీమాదులు విదేహముక్తినొందిరి.

కాబట్టి ఓ రామచంద్రా ! వాసనాయుక్తమగు మనస్సు బద్ధము. వాసనారహితమగు మనస్సు ముక్తము అని యెఱుగుము. సత్యమగు ఆత్మయొక్క విచారణచే వాసనలు శమించును. అపుడు మనస్సు శమించును. భీమాదులు అహంభావమును బొందలేదు గాన శరీరాదులు, జగత్తు అసత్యమని ఎఱింగిరి. కాన వారు దేవతల నోడించిరి. దామాదులు అహంభావ యుతులై దేవతలచే నిర్జితులైరి. కాన భీమభాస దృఢన్యాయము నవలంబించి దామవ్యాళకటన్యాయమును త్యజించుము. ఈ విషయమును పూర్వము బ్రహ్మదేవుడు నాకు జెప్పెను.

జగత్తు అసత్యము, మిథ్య. అట్టి అసత్పదార్థమునందు మనస్సు నుంచక నశ్వరములగు దేహాదులందు అహంబుద్ధిలేక సత్యమగు ఆత్మయే నీవని దృఢముగ భావించి తదాత్మసాక్షాత్కారముచే దుఃఖరాహిత్యమును బొంది జనన మరణ ప్రవాహమును దాటి పునర్జన్మ రహితుడవు కమ్ము.

(వసిష్ఠ మునీంద్రుని యిట్టి యుత్తమబోధచే శ్రీరామచంద్రుని యంతఃకరణము చంద్రునివలె అతిశీతలత్వము (శాంతము) నొందెను.)

## దాశూరోపాఖ్యానము

ఓ రామచంద్రా! కల్పనారచితాకారము గలదియు, వస్తు శూన్యమున్ను నగు ఈ జగత్తు దాశూరుడు వచించిన చందమున అసత్యమే. కాని వాస్తవముగ సత్యము కాదు. (లేనిదేయగును) జగత్తుయొక్క స్వరూపమును వర్ణించుట కొఱకు దాశూరోపాఖ్యాన మును చెప్పెదను వినుము. పూర్వము మగధదేశమున వృక్ష పరిపూర్ణమగు నొక పర్వతముండెను. దానిపై శరలోమ యను తాపసి వసించుచుండెను. అతని పుత్రుడే దాశూరుడు. తండ్రి స్వర్గస్థుడు కాగా దాశూరుడు దుఃఖాక్రాంతుడై యుండ అట వనదేవత అదృశ్యరూపమున జగత్పదార్థము యొక్క చంచలస్థితిని చెప్పి ధైర్యము వహింపుమని యుద్బోధింప నంత నా దాశూరుడు లేచి తండ్రి శరీరమునకు దహనాది క్రియలు సల్పి తపంబుచేయ నిశ్చయించెను. కాని భూప్రదేశము అశుద్ధముగ నున్నదని భావించి వృక్షము పైని స్థితి నొందుటకుగాను తపము సల్పెను. కాని దానిచే శ్రీఘ్రముగా తన సంకల్పము సిద్ధింపమి తన శరీరమును కోసికోసి అగ్నిహోత్రునియం దాహుతిచేయ నారంభించెను. అపుడు అగ్నిహోత్రుడు శరీరమును ధరించి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మన, వృక్షముపై తాను స్థితిని బొందునట్లు కోరుకొనెను. అగ్నిహోత్రు డట్లేయని యంతర్ధాన మొందెను. దానిచే దాశూరుడు మిగుల సంతోషించెను.

అత్తఱి యచట మిగుల యున్నతమైనదియు శాఖాపుష్పాది సమన్వితమును అనేక పక్షులతోను, ప్రాణిగణము చేతను పరిపూర్ణమై నదియునగు ఒక కదంబ వృక్షము ప్రత్యక్షమయ్యెను. అతడు దాని నధిరోహించి అందలి నొకయెత్తైన కొమ్మపై నొక యాకు మీద యాసీనుడై దిక్కుల నొక్కసారి పరికించి 10 వత్సరములు మానసికముగ అశ్వమేధాది యజ్ఞముల నటగావింపక్రమముగా చిత్తము శుద్ధమై జ్ఞానముత్పన్న మయ్యెను. ఒకానాడచ్చోట నొక సుందర వనదేవతను గాంచి నీ వెవతనని యడుగ తానచటి వనదేవతననియు నందనవనమున చైత్రశర్ధ

త్రయోదశికి జరిగిన వనదేవతల సమాజమందు పుత్రసహితలై యున్న తక్కిన వనదేవతలను గాంచి పుత్ర రహితయగు తనకు దుఃఖము కలిగెననియు. కాబట్టి తనకు పుత్రుని ప్రసాదింపుడనియు, మహాత్ములను ప్రార్థించుటచే జీవుల మనోరథము లీడేరుననియు, అ వనదేవి యాతనికి విన్నవింప దాశూమడు తన చేతియందున్న పుష్పమామెకిచ్చి ఇక నొక మాసమునకు పుత్రుని బడయగలవని చెప్పిపంపెను. అట్లే యామెకు పుత్రుడుదయింప 12సం॥లైన పిదప ఆమె తన యా పుత్రుని దాశూరునికడకు గొని వచ్చి అతనిని ఆత్మజ్ఞానయుతునిగ జేయుడని ప్రార్థింప అతనిని తనయొద్దనే యుంచమని చెప్పి యామెను దాశూరుడు పంపివైచెను. పిదప అమ్మహర్షి తన యా సుతునకు బహురీతుల జ్ఞానోపదేశము చేసెను.

మఱియు నిట్లుచెప్పెను - ''ఒకనాడు నేను అదృశ్యరూపమున కైలాస వాసినియగు మందాకినీ నది యందు స్నానము చేయుటకు వెడలి తిరిగి రాత్రి సమయమున నీ వృక్షముపైకి తిరిగివచ్చితిని. అత్తఱి అ వృక్షగర్భమున నొక శబ్దమును వింటిని. పుత్రా! ఒక ఆశ్చర్యకరమైన అఖ్యాయిక చెప్పెద వినుము. మహా పరాక్రమియగు నొక రాజు కలడు. అతనిపేరు ఖోత్థుడు (అవ్యాకృత అకాశజుడు). అతని అజ్ఞను బ్రహ్మావిష్ణ్వాదులున్నూ పాలించుదురు. మూడు శరీరములతో నాతడు జగత్తు నాక్రమించియుండెను. ఆతడు అపారమగు అవ్యాకృతాకాశమున బ్రహ్మాండమను నగరమును దేవమనుష్యాది అనేక జీవులను సృజించెను. అతడు జాగ్రత్స్వప్నములందు శత్రువులపై దాడికి పోవుచు సుషుప్తి యందు లయించుచునుండును. అవ్యాకృత ఆకాశోత్పన్నమగు సంకల్పమే (మనస్సే) అ ఖోత్థుడని యెఱుగుము. అ మనస్సుయొక్క స్వరూపమే ఈ జగత్తు. అద్దాని అవయవములే బ్రహ్మావిష్ణుభవాదులు. అ మనస్సే స్వకల్పిత విషయముల యొక్క ఆనందము కొఱకు ప్రావులాడుచు సుఖదుఃఖము నొందుచున్నది. అద్దానిని బాహ్య విషయముల నుండి మరల్చి ఆత్మజ్ఞానము ద్వారా నిర్మూలమొనర్చి

బ్రహ్మపదమున విశ్రమింపుము. ఉత్తమ మధ్యమ అథమ సత్త్వ రజస్తమములను మూడు శరీరములు ఆ మనస్సునకు గలవు. ఆ సత్త్వాది మూడు గుణములను త్యజించుటచే తన స్వరూపము నశింప ఈ సంకల్పమయ మనస్సు మోక్షపదమును బొందుచున్నది. సంకల్ప నాశముతప్ప మోక్షమునకు వేఱొక ఉపాయమెద్దియును లేదు. కాబట్టి ఆత్మజ్ఞానముద్వారా వికల్ప భారమును దూరీకృతమొనర్చి మోక్షభాగివై నిరతిశయానందము నొందుటకు ప్రయత్నింపుము. ఈ ప్రకారముగ రాత్రియందు వారిరువురును ప్రసంగించుకొనుట విని నే నాకాశము నుండి యా వృక్షముపైకి దిగి అచటి కేగితిని. దాశూరుడు నన్ను పూజించినపిదప నేనాతని పుత్రునకు అనేక కథాదుల మూలమున బోధగావించి స్వస్థానమున కేగితిని.

ఓ రామచంద్రా ! దాశూరుడు వచించినలాగున నీవు సంకల్ప మును త్యజించి అహం మమాది భావనలను వీడి ఆత్మ నిష్ఠుడవుకమ్ము "దేహాదులు నేనుకాను, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మనే నేను" అని నిర్ణయించి ఆత్మయందు స్థితిగలిగి యుండుము. నే ననేక శాస్త్రములను చిరకాలము విచారించితిని. కాని వాసనలను త్యజించి మౌనముగ (ఆత్మయందు) ఉండుటతప్ప మఱి ఉత్తమమైన పద మెద్దియును లేదని గ్రహించితిని. జ్ఞానికి ఈ విశాల దృశ్యజగత్తంతయు అత్యల్పముగ తోచును. జగత్తునందలి భోగము లెవ్వియు జ్ఞానిని అనురక్త మొనర్పజాలవు. సమస్తము ఆత్మమయమై యున్నది, ఇవ్విషయమున పూర్వము కచుడు వచించిన దానిని వినుము -

## కచోపాఖ్యానము

బృహస్పతి కొమరుడగు కచుడు మేరుపర్వత మందలి యొకానొక వనమున పూర్వము తాను వినిన బ్రహ్మజ్ఞానము యొక్క మనన నిధిధ్యాసనముల పరిపాకతచే ఆత్మయందు విశ్రాంతినొంది పంచభూతమయ దృశ్యప్రపంచమందు ప్రీతి లేక ఆత్మాతిరిక్తమగు దేనిని రమణయోగ్యముగ గాంచజాలక ఇట్లు గానము చేసెను. "నేనేమి

చేయుదును ! ఎచటికి బోవుదును ! దేనిని గ్రహింతును ! మహా ప్రళయమందు జలముచేవలె సమస్త విశ్వమున్ను ఆత్మచే పరిపూరితమై యున్నది. అంతయు ఆత్మమయమై యున్నది, కాబట్టి నేను సర్వదా ఆత్మయందే స్థితికలిగి యున్నాను !'' ఈ ప్రకారము భావించుచు ఆ మేరు పర్వత కుంజమున కచుడు ఘంటాశబ్దంవలె ఓంకారం నుచ్చరించుచు తురీయ రూపమగు అర్ధమాత్ర యందు విలయము చేయుచు, బాహ్యాభ్యంతరములందు స్థితి నొందక కేవలం ఆత్మనే భావించుచు ఆత్మయందే స్థితి గల్గి యుండెను.

# 5. ఉపశమ ప్రకరణము

వసిష్ఠ భగవానుని యుపదేశవాక్యముల నిట్లందరును శ్రద్ధతో నాలకించుచుండనపుడు మధ్యాహ్నకాలిక శంఖారావములు మ్రోగగా అమ్మునీశ్వరుడు తన వచనములను విరమించి మరుసటి దినమున చెప్పెదననెను, అపుడందరును లేచి వారివారి స్థానముల కరిగిరి. దశరథ వసిష్ఠుల ప్రార్థనానుసారం విశ్వామిత్రుడునాటి రేయి వసిష్ఠమునీంద్రుని యాశ్రమముననే గడపెను. సర్వులు ఆహ్నిక క్రియలను జరిపి రాత్రి విశ్రమించిరి. కాని శ్రీ రామచంద్రుడు మాత్రము నిదురపోక వసిష్ఠ మునీంద్రుని వచనములను దీర్ఘముగ విచారించెను. ఈ సంసారమాయను గూర్చియు, తన్నివారణోపాయమును గూర్చియు, మనోజయమును గూర్చియు బాగుగా చింతనచేసెను. అజ్ఞానమును వాసనలనువీడి ఆత్మజ్ఞానమును బడయు లాగున తన మనంబును సంబోధించి ప్రార్థించెను. ఈ ప్రకారముగ నారాత్రి యంతయు వసిష్ఠోక్త ప్రబోధమును బాగుగా మననము చేసి ప్రాతఃకాలమున తనసోదరులతో గూడ వసిష్ఠాశ్రమమునకు బోయి నట ఏకాంతమున సమాధినిష్ఠుడై యున్న వసిష్ఠమునీంద్రునకు దూరము నుండియే ప్రణమిల్లి దిక్కులందలి యంధకారము పూర్తిగ నశించునంత వఱకు ఆ యాశ్రమ ప్రాంగణము ననే యుండెను. పిమ్మట కొంత కాలమునకు వసిష్ఠమునీంద్రుడు సమాధి విరతుడై వచ్చినవారి నాదరించి విశ్వామిత్రునితో గూడ రథమునెక్కి మునుల తోడను, దశరథ సేనా మేతముగను దశరథుని భవనమున కేగి సభాస్థలము నలంకరించెను. పిమ్మట దశరథుడు వసిష్ఠమునీంద్రుని ప్రశంసించుచు నిట్లనెను -

మునీంద్రా ! తమ వచనామృతముచే మేము పరమతృప్తిని బడసితిమి. ఆత్మావలోకనాసమర్థులమైతిమి. మహాత్ముల వాక్యములు అంతఃకరణమునందలి మోహమునడంచి శీతల మొనర్చును. పిదప శ్రీరామునితో ప్రస్తుత విషయమున వసిష్ఠ మునీంద్రుని ప్రశ్నింపుమనెను. వసిష్ఠుడు శ్రీరాముని తాను బోధించిన యంశములు స్మరణ యందున్న వాయని యడుగ నంత శ్రీరామచంద్రుడు గుర్వనుగ్రహమున

అట్లేస్మరణయందున్నవనియు ప్రస్తుత విషయమున నింకను తన కుపదేశింపుడనియు ప్రార్థింప వసిష్ఠమునీంద్రుడిట్లు వచించె -

మనుజుడు తాను స్వయముగ విచారించి ఆత్మవస్తువును ఎఱుగనంతవర కయ్యది అతనికి పొందబడదు. మొదట శాస్త్ర వైరాగ్యసత్సంగాదులచే మనస్సును శుద్ధమొనర్చుకొని పిమ్మట గురువును సమీపించి అతడుపదేశించు విధమున ఆత్మప్రాప్తికై ధ్యానాదుల ననుష్ఠింపవలయును. దేహముతో మిశ్రితమైయున్న ఈ యాత్మను విచారణ ద్వారా విడదీసి ఆత్మయందే స్థితిగల్గి యుండవలెను. ఆత్మయు శరీరమున్ను కేవలము భిన్న భిన్నములైనవి. వాస్తవముగ సుఖదుఃఖములు ఆత్మయందు లేవు. అది నిత్యశుద్ధముక్తము. అజ్ఞానము వలననే సుఖ దుఃఖములు జనించుచున్నవి. అజ్ఞానము నశించిన అవియు నశించును. ఈ ప్రపంచమున కొందరు గురూక్తమార్గమున ననుష్ఠించుచు ఈ జన్మయందుగాని మఱికొన్ని జన్మలందుగాని మోక్షము నొందుదురు. మఱికొందఱు చిత్తశుద్ధి గలిగియున్న కారణముచే ఆత్మవిచారణచే అకాశఫల పతనమువలె శీఘ్రముగ జ్ఞాన ప్రాప్తినొంది ముక్తులగుదురు. రెండవ తరగతివారి శీఘ్రజ్ఞాన ప్రాప్తి విషయమై ఈ క్రింది వృత్తాంతమును వినుము -

## జనకోపాఖ్యానము

విదేహరాజగు జనకుడొకపుడు వసంతఋతువునందు అనుచర సహితముగ నొక వనమున విహరించుచు అనుచరులను దూరముగ నుంచి తాను పర్వతకుంజములందు విహరించుచుండ నచట అదృశ్య రూపమున నున్న సిద్ధులు తమ ప్రసంగములందు వచించుకొనుచున్న యుత్తమ అధ్యాత్మబోధనువిని తానట్టి ఆత్మస్థితిని బొందమి ఖిన్నుడై వెంటనే పరివారసమేతముగ స్వగృహమున కేగి మేడపై నెక్కి ఈ ప్రకారముగ చింతన చేసెను - ''ఆహా! ఈ సంసార మనిత్యము. చంచలము. భోగములు అశాశ్వతములు. ఈ తుచ్ఛమైన రాజభోగము లందు, ధనాదులందు, అల్పజీవితమందు నేనేల విశ్వాసమును బంధించుకొని యుంటిని? ఎందరో మహా మహా రాజులు, చక్రవర్తులు

కాలగర్భమున ధూళివలె నెగిరిపోయిరి. ఇక నావిషయమై వేఱు చెప్పవలెనా? ఓహో కారణమును ఇపుడు తెలిసి కొంటిని. అది మనస్సే. ఇంతవరకు నేను దానిచే చంపబడితిని. ఇపుడు నేను దానిని చంపుచున్నాను. నేనిపుడు పరమానందదాయకమగు ఆత్మ (పరబ్రహ్మము) యొక్క శరణ్యమును బొందుచున్నాను. ఆత్మయందే స్థితిగల్గి నేను సుఖముగ వెలసెదను! ఇట్లు చింతన జేయుచుండ మధ్యాహ్నమగుటచే నొక ప్రతీహారి వచ్చి. ''దేవరా! లేచి స్నానధ్యానాదికృత్యములు నెరవేర్చుడు'' అని వినయముతో బలుక జనకుడు పూర్వము వలెనే జగత్స్థితిని గూర్చి యిట్లుచింతన జేయుచుండెను. - ''ఓ చిత్తమా! నీవిక భోగములపైకి పోకుము. ఆశలను వీడుము. విషయభోగ సేవనముచే తుదకు దుఃఖమే సంప్రాప్తించును. పరమాత్మ విచారము వైపునకు మరలుము!'' ఇట్లు తలంచి మరల ఈ రీతిలో నిశ్చయించుకొనెను, - ''కర్మచేగాని అకర్మచేగాని నాకేము ప్రయోజనము? నేను అప్రాప్తమగు దానిని వాంఛింపను. ప్రాప్తించినదానిని విడువను. స్వస్థరూపమున ఆత్మయందు స్థితిగల్గి యుండెదను. యథాప్రాప్తములగు క్రియలను ఈ శరీరము చేయుగాక! కర్తృత్వ భోక్తృత్వరహితుడనై ఆత్మపదమున దృఢనిశ్చయ మును బొందియున్నాను'' ఇట్లు నిశ్చయించి జనకుడు సూర్యునివలె యథాప్రాప్తకర్మములను తటస్థభావనతో జేయుచు ఆత్మయందు సదా స్థితిగల్గి యుండుచు జీవన్ముక్తుడై వెలయసాగెను.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ జనకుడు యథాప్రాప్తములగు సమస్త రాజ్యకార్యములను నిర్వహించుచును హర్షామర్షములను బొందక సుషుప్తి యందున్న వానివలె నుండెను. స్వవివేకానుసంధానముచే నాతడు సమ్యక్ జ్ఞానమును బొంది దుఃఖరహితుడాయెను. కాబట్టి ఆత్మజ్ఞాన రూపఫలము లభించువఱకు తన చిత్తముతో ఆత్మవిచారము సలుపు చుండవలెను. మనుజుడు బాహ్యద్రవ్యాది పదార్థములను యార్జించుట యందెట్టి యత్నముసల్పునో అట్టి యత్నమునే మొదట తన బుద్ధి ప్రజ్ఞను వృద్ధినొందించుటకు చేయవలెను. ప్రజ్ఞ (ఆత్మజ్ఞానము) చేతనే ఈ భయంకర సంసారసాగరము దాట బడునుగాని దాన తీర్థాదులచేగాదు. కాబట్టి అట్టి ఆత్మవిచార రూపమగు ప్రజ్ఞ (బుద్ధి)నే మనుజుడు

వృద్ధిచేయవలెను. ఈ శరీరము (ఉపాధి) నేను అను అల్పభావనలయింప సర్వవ్యాపకమగు ఆత్మ ఉదయించును. మనస్సు వాస్తవముగ లేనిదే యగును. అట్టి లేని మనస్సును జయించుటయం దేమి ప్రయాసము? సర్వానర్థములకును మూలభూతమైనట్టి తృష్ణను త్యజింపవలెను. వాసనాత్యాగము ధ్యేయమనియు, జ్ఞేయమనియు రెండు విధములు. మొదటిది జీవన్ముక్తు లవలంబింతురు. రెండవది విదేహముక్తియొక్క స్వరూపం అనగా లోకోచితములగు కర్మలను కర్తృత్వరహితముగను అసంగముగను ఏ వాసనాత్యాగ మవలంబించి జీవన్ముక్తులొనర్చుదురో అది ధ్యేయవాసనాత్యాగము. రెండవది (జ్ఞేయము) దేహరహితమగు వాసనా త్యాగం ''ఈతడు నాబంధువు, యీతడు బంధువుకాదు'' అను భావన అల్పబుద్ధిగలవారికే యుండును. ఉదారచిత్తులకిట్టి భేదభావనా రూపమగు పరిచ్ఛేదముండదు. యీ ప్రపంచముననున్న ప్రాణికోట్ల న్నియు మన బంధువులే, ఏలయన జీవుడు పూర్వము అనేక జన్మలందు అనేక శరీరములను ధరించి యుండెనుగదా ! ఇవ్విషయమున నొక పూర్వ వృత్తాంతమును చెప్పెద వినుము -

## పుణ్యపావనోపాఖ్యానము

ఈ జంబూ ద్వీపమున మహేంద్రమను గొప్ప పర్వతము గలదు. దాని శిఖరమున నొక ప్రదేశమున మునులు స్నానార్థము ఆకాశ గంగను స్వర్గమునుండి దింపుకొనిరి. అద్దాని తీరమున బ్రహ్మజ్ఞుండైన దీర్ఘతపుడను ముని వసించుచుండెను. అతనికి పుణ్యపావనులను ఇరువురు పుత్రులుండిరి. అందు పుణ్యుడు ఆత్మజ్ఞానియై యుండెను. కాని పావనుడింకను జ్ఞానమును బొందలేదు. ఇట్లుండ దీర్ఘతపునకు నూరు వత్సరములు గడిచిన పిమ్మట నాతడు దేహమును ద్యజించి బ్రహ్మపదమును బొందెను. ఆతని భార్యయు అత్తఱి పతివలన నేర్వబడిన యోగయుక్తిచే దేహమును వీడెను. అపుడు పుణ్యుడు వారిరువురకును ఔర్ధ్వదైహిక క్రియలను సలుపుచుండ పావనుడు మాతా పితృ వియోగముచే పరమదుఃఖమును బొందుచుండెను. తదుపరి పుణ్యుడు తన తమ్మున కీవిధముగ బోధించెను - 'సోదరా ! నీవు దుఃఖించుట

తగదు. మన తల్లి దండ్రులు శోకరహితమగు శాశ్వతబ్రహ్మపదమును బొందిరి. మఱియు ఇప్పటికి మన యిరువురకును పూర్వ మనేక జన్మలందెందరో తల్లిదండ్రులు గడచిరి. వారి అందఱి కొఱకును దుఃఖపడకుంటివేల? నీవును నేనును పూర్వము మృగ, పక్షి కీట మనుష్యాద్యనేక జన్మలను బడసి యుంటిమి. వాని నన్నింటిని నేనిపుడు సూక్ష్మదృష్టిచే గాంచుచున్నాను. కాబట్టి ఆ పక్షి మృగాదులలో ఎందరో బంధువులు మనకు ఉండి యుండిరి. వారిలో ఎవరి కొఱకు శోకించెదము. ఎవరి కొఱకు శోకింపకుందుము! కాన ఈ సంసారమున సుఖదుఃఖములకు మేర యేమి ? ఇక్కారణమున శోకమును వీడి మనంబున అహం రూపమున నున్న ప్రపంచభావనను త్యజించి, జన్మజరావర్జితమగు నాశరహితమైన ఆత్మను స్మరించి ఆ యాత్మ యందే స్థితి గలవాడవై సుఖముగ నుండుము.

ఇట్లు పుణ్యునిచే బోధితుడై పావనుడు ఆత్మజ్ఞానము నొందెను. ఇట్లిరువురు జ్ఞానులును అవ్వనమున సంచరించుచు కాలక్రమమున దేహములవీడి నిర్వాణపదము నధిష్ఠించిరి. కాన అగణిత బంధువులలో ఎవనిని త్యజించెదము? ఓ రామచంద్రా ! సమస్త శోకములకు మూల కారణమైన విషయ తృష్ణను త్యజించుటయే శాంతికి ఉపాయము. ఓ రాఘవా ! పూర్వము విచారణచే బలిచక్రవర్తి ఆత్మజ్ఞానమును బొందినట్లు నీవున్ను పొందుము.

## బల్యుపాఖ్యానము

పాతాళమున బలియను చక్రవర్తి యుండెను. అతడు అతి పరాక్రమశీలుడై పదికోట్ల సంవత్సరములు రాజ్యమేలి అనేక భోగములననుభవించి తుదకు వైరాగ్యమునొంది మేరు పర్వత శిఖరముపై గూరుచుండి యిట్లు చింతన జేసెను. ''ఆహా! నశ్వరములగు ఈ భోగసమూహము నాకేమి సుఖమును గలుగ జేయుచున్నవి? మరల మరల అవియే భోగములు అనుభవించుచు, అనుభవించుచు నేను హాస్యాస్పదుడనైతినే ! ఎద్దానిని బొందిన మరల కర్తవ్యమగునది ఎద్దియునుండదో, ఏదినిరతిశయమైన సుఖమో దానిని చింతించెదను,''

అని బలిచక్రవర్తి ధ్యాననిష్ఠుడై మరల క్షణములో "ఓహో ! జ్ఞప్తికి వచ్చినది. పూర్వము నేను బ్రహ్మజ్ఞుడగు మా తండ్రియైన విరోచనుని తన ప్రాంగణమున నున్న కల్పవృక్షము క్రింద సమస్త దుఃఖములెచట శాంతి నొందును? ఏషణలు, మనోమోహము ఎచట నశించును ? చిత్తమునకు పరమ విశ్రాంతి ఎచట లభించును? దేనిని పొందినచో మనుజుడు బ్రహ్మలోక పర్యంత విషయములనుండి విరాగుడగును?" అని ప్రశింప అతడిట్లు చెప్పెను -

అతివిశాలమైన దేశము (కైవల్య ధామము) ఒండుగలదు ? అచట పృథివ్యాకాశాదు లెవ్వియునులేవు. అచట సర్వశక్తి మంతుడును, సర్వవ్యాపియు నగు రాజొకడు (ఆత్మ) కలడు. అతని సంకల్పముచే కల్పితుడగు మంత్రి (మనస్సు) ఒకడు. ఆ మంత్రి అఘటితఘటనా ప్రవీణుడు. అతడు మహాబలవంతుడు. అతని నెవరును జయింపలేరు. కాలక్రమమున (సుకృత పరిపాకముచే వివేకముదయింప) ఆ రాజునకే తన యా మంత్రిని జయింప బుద్ధి పొడమును. ఆ మంత్రిని జయించినచో జయింపబడని లోకములున్ను జయింపబడినవే యగును. కాబట్టి నిత్య త్యాగరూప కష్ట చేష్టచేనైనను అతని జయించుట కొఱకై సన్నద్ధుడవు కమ్ము. ఆ మంత్రి అజేయుడైనను అతనిని సులభముగ జయించు ఉపాయమును చెప్పెద వినుము - ఆత్మజ్ఞానమను యుక్తిచే నాతడు శీఘ్రముగ వశుడగును. ఆ రాజు (ఆత్మ) కానిపింప మంత్రి (మనస్సు) వశుడగును. మంత్రిని వశము చేసికొనిననే రాజదర్శన మగును. కాబట్టి పురుష ప్రయత్నముచే అభ్యాసము ద్వారా రాజదర్శనము (ఆత్మజ్ఞానము) నకున్ను మంత్రి పరాజయము (మనోజయము) నకున్ను తోడు తోడుగనే ప్రయత్నింపవలెను. అపుడు నీవా దేశమును (మోక్షము) బొంది శాశ్వత సుఖమును దుఃఖరాహిత్య మును ననుభవింపగలవు. మోక్షమే ఆ దేశము. ఆత్మయే రాజు. మనస్సే అతని మంత్రి. సమస్త విషయములందును ఇచ్ఛను సర్వదా త్యజించుటయే మనస్సును జయించుటకు పరమోపాయము.

విచారణచే ఆత్మదర్శనము తృష్ణాత్యాగము రెండును

ఏకకాలముననే (తోడుగనే) అభ్యసింపవలెను. ఏలన ఆత్మదర్శనముచే తృష్ణాత్యాగము, తృష్ణాత్యాగముచే ఆత్మదర్శనమున్ను గలుగును.

నా తండ్రియగు విరోచనుడు పూర్వమిట్టి బోధచేసియుండుట నాకు జ్ఞాపకమున్నది. కాబట్టి నేనిపుడు గత భోగాదులను విస్మరించి ఆత్మయందే స్థితిగల్గి యుందును. నా అజ్ఞానముయొక్క నాశార్థము మా కులగురువగు శుక్రాచార్యుని ఆత్మదర్శనోపాయమునుగూర్చి అడిగెదను. ఇట్లునిశ్చయించి బలి నేత్రములు మూసికొని శుక్రాచార్యుని స్మరింప అతడు ప్రత్యక్షమై తన్నుస్మరించిన కారణ మాతని నుండి తెలిసికొని 'ఈ సమస్త లోకాదులు చిన్మాత్రమే; చైతన్యము యొక్క విషయాకార కల్పనయే బంధము. తత్కల్పనారాహిత్యము ముక్తి' అని సంక్షేపముగ అజ్ఞాననాశోపాయమును వచించి తొందర పని యుండుటచే సప్తర్షులతోగూడి ఆకాశమున కెగసిపోయెను. పిదప బలి అంతయు చిన్మాత్రముగ నిశ్చయించి దృశ్యకల్పనారహితుడై ఓంకారార్థమాత్ర రూపమగు తురీయ బ్రహ్మమును భావించుచు నిశ్చల సమాధియం దుండ ఆతని యనుచరులగు దేవదానవాదు లట కేతెంచి తమ ప్రభు వట్లు నిశ్చలముగ స్థితినొంది యుండుట గాంచి విస్మితులై శుక్రాచార్యుని స్మరింప ఆతడే తెంచి 'బలి నిర్మలమగు ఆత్మ పదమున ప్రతిష్ఠితుడై యున్నాడనియు, ఆతని నెవరును పలుకరించవద్దనియు అంతవఱకు వారే తమలో తాము రాజ్యకార్యముల నిర్వహించుచుండ వలసినదనియు చెప్పి వెడలిపోవ వారట్లేచేసిరి. పిమ్మట వేయి సంవత్సరములయ నంతరము దేవదుందుభుల శబ్దముచే సమాధినుండి లేచి ఆత్మస్థితి యందు తాననుభవించిన పరమశాంతిని స్మరించి ఆనందించుచు దృశ్యమందు ప్రీతిలేక తిరిగి సమాధియందు ప్రవేశింప నుండ నింతలో దేవదానవాదు లందరు ఆతనిని చుట్టి నమస్కారాదులు నొనర్ప 'నేను కృతకృత్యుడనైతిని ఇక కర్మయందుగాని కర్మత్యాగమందు గాని నాకు పట్టుదల యేల?! కాబట్టి యథాప్రాప్తములగు కార్యములను అసంగుడనై ఆచరించెదను' అని తలంచి ధ్యేయత్యాగయుక్తుడై సమస్త రాజ్యకార్యములను అప్పటి నుండి చేయదొడగెను. తదుపరి ఒకపుడు ఒక గొప్ప యజ్ఞమును జేసెను. విష్ణుభగవానుడు బలి భోగసమూహమును

గోరడని నిశ్చయించి ఇంద్రునకు జగత్ఖండమునొసగ దలంచి బలియజ్ఞమునకు జని మాయాబలమున త్రిలోకము లను తన పాదముచే కొలచి బలిని పాతాళమున నుంచెను. ఇపుడును అతడు జీవన్ముక్తుడై ధ్యానతత్పరుడై స్వస్థచిత్తుడై అట వెలయుచున్నాడు. బహుకాలమైన పిదప అతడు ఇంద్రాధి కారము వహించి కల్పాంతమున విదేహ కైవల్యము నొందును.

ఓ రామచంద్రా ! నీవున్ను బలివలె వివేకముచే 'నేను నిత్య ఆత్మస్వరూపుడను' అని నిశ్చయించి పురుషప్రయత్నముచే అద్వైతాత్మ పదమునొంది సుఖింపుము. నీవు జనన మరణరహితుడనగు ఆత్మనేనను నిశ్చయము గలిగి మనస్సును జయించి పరమశాంతి నొందుము.

## ప్రహ్లాదోపాఖ్యానము

ఓ రామచంద్రా ! ఇక నిపుడు దైత్యేంద్రుడగు ప్రహ్లాదుడు దేనిచే సిద్ధినొందెనో అట్టి జ్ఞాన ప్రాప్త్యుపాయమును వినుము - పూర్వము పాతాళమున హిరణ్యకశిపుడను గొప్ప పరాక్రమవంతుడైన దానవేంద్రుడుండెను. అతని పుత్రులలో శ్రేష్ఠుడగు ప్రహ్లాదుడు యువరాజుగా నుండెను. హిరణ్యకశిపుడు ముల్లోక వాసులను పీడించుచుండ దేవతలు విష్ణువుతో మొరపెట్టుకొనగా విష్ణువు నృసింహరూపమున నేతెంచి హిరణ్యకశిపుని వధించి అతని నగరమును భస్మమొనర్చి వెడలెను. అపుడు దానవులు చెల్లాచెదరైపోయిరి. శేషించిన దైత్యులతో ప్రహ్లాదుడు పాతాళమున రాజ్యపాలనము చేయదొడగెను.

ఒకపుడు ప్రహ్లాదుడిట్లు చింతనచేసెను - దానవులను హతమొనర్చిన మహా పరాక్రమశాలియగు విష్ణువును వశమొనర్చుకొను ఉపాయమెద్ది? అతనిని శరణుబొందుట తప్ప వేఱు ఉపాయము లేదు; అని నిశ్చయించి శంఖగదా పద్మాదియుక్త విష్ణు స్వరూపమును మానసికముగను, బాహ్యమునను పూజించెను. మానసికముగ తనను కేవలము నారాయణ స్వరూపునిగనే భావించి ఆ తన విరాడ్దేహమును పూజించెను. ఈ ప్రకారముగ ప్రహ్లాదుడు నిరంతరము విష్ణుభక్తి గలిగియుండ అతని ప్రజయగు దైత్యులున్ను క్రమముగ విష్ణుభక్తులైరి. అది చూచి దేవతలాశ్చర్యయుతులై విష్ణువువద్ద కేగి అట్టి విపరీతస్థితిని

వర్ణించిచెప్ప విష్ణువు ప్రహ్లాదునకది అంతిమ జన్మయనియు, అందుచే తాము దుఃఖింప నవసరములేదనియు చెప్పివారలను పంపివైచెను. అప్పటినుండియు ప్రహ్లాదునకు భోగాదులు రుచింపకయుండెను. వాటియం దాతడు ఆసక్తి లేకయుండెను. కాని ఆత్మయందు విశ్రాంతిని ఇంకను బొందకున్నందున రెంటి మధ్యనున్న వాడాయెను. ప్రహ్లాదుని పూజాగృహమున హరి ప్రత్యక్షము కాగా, ప్రహ్లాదు డాతనిని పూజించి సంస్తుతించెను. పిమ్మట భగవాను డాతనితో మరల జన్మదుఃఖము పొందకుండులాగున యేదైన వరము కోరుకొమ్మనగా, దేనిని తాము ఉత్తమమని తలంతురో అట్టి వరము నొసంగుడని ప్రహ్లాదుడు ప్రార్థింప, 'సంపూర్ణ భ్రమశాంతి కొఱకు బ్రహ్మమునందు విశ్రాంతి కలుగువఱకు నీకు (ఆత్మ) విచారణ సంభవించుగాక !' అను వరమిచ్చి భగవాను డంతర్ధాన మయ్యెను. పిమ్మట ప్రహ్లాదుడు ఈ ప్రకారముగా చింతన జేసెను -

భగవానుడు 'నీకు విచారణ సంభవించునుగాక' యని చెప్పెను. కాబట్టి నే నాత్మవిచారణ సల్పెదను. ఈ సంఘాతమున నేనెవరో విచారించెదను. ఈ దేహము శబ్ద స్పర్శాదులు దృశ్యములున్ను (నాకంటె బాహ్యములున్ను), జడములున్ను గావున అవి నేనుగాను విషయవర్జితమై, దృశ్యరహితమై, సర్వప్రకాశకమై, నిర్మలమైనట్టి చిన్మాత్ర మగు ఆత్మయే నేను. ఇట్టి నిత్య ఆత్మ సామ్రాజ్య సుఖమును వదలి అరమణీయమైన రాజ్యవిభూతులందు నేను రమింపను. అపూర్వమగు ఆత్మదృష్టి యెచట ! ఈ తుచ్ఛములైన రాజ్యవిభూతులెచట? నా పూర్వజు లిట్టి ఆత్మజ్ఞానము నొందక దృశ్యమందే ప్రీతిగొని దుఃఖభాజులై నశించిరి ! చిదాత్మరూప మగు నా యాత్మకు నమస్కారములు. విష్ణుభగవానుని యనుగ్రహముచే నే నాయాత్మ నిపుడు తెలిసికొని దుఃఖవిముక్తుడనైతి. దృశ్యవాసన లన్నియు క్షయించి నేనిపుడు స్వస్థముగ ఆత్మయందు నెలకొనియున్నాను. ఓ శుద్ధబుద్ధి ముక్త ఆత్మస్వరూపమా ! నీకు జయమగుగాక !

అని ఇట్లు చింతన చేయుచు ప్రహ్లాదుడు పరమానందమయమగు నిర్వికల్పసమాధిని బొంది పర్వతమువలె నిశ్చలముగ నుండెను. ఈ

ప్రకారముగ వేయి సంవత్సరము లాతడు బ్రహ్మాకార స్థితిరూపమగు సమాధియందుండెను. అసురనాయకులు మేలుకొలుప యత్నించినను మేలుకొనలేదు. అత్తఱి దైత్యరాజ్యము రాజులేమి నరాచకమై మత్స్యన్యాయమున కాస్పదమయ్యెను. రాజ్యమంతటను అశాంతి చోరత్వము మున్నగునవి ప్రబలెను. తదుపరి విష్ణుభగవానుడు అప్పటి జగత్స్థితిని గూర్చి మానసికముగ పరిశీలింప పాతాళమున ప్రహ్లాదు సమాధియందుండుటయు అట అరాజకత్వము ప్రబలుటయు గాంచి దైత్యులు నశించినచో దేవతలు విజయేచ్ఛా రహితులై స్వర్గసుఖమందు విరక్తులై అభిమానశూన్యులై మోక్షమొంద భూలోకవాసులు దేవతలేమి? యజ్ఞ దానాదులను విరమింప కర్మశాన్తిచే కర్మభూమి యగు భూలోకము అస్తమింప కర్మాధీనమగు జగత్తు నశించును. అకాలమునే (ప్రళయాత్పూర్వమే) అట్టి జగన్నాశము యుక్తము కాదు. కాబట్టి ప్రహ్లాదుని మేలుకొలిపి రాజ్య కార్యములందు నియోగించెదను. ఆతడీలోకమున కల్పపర్యంత ముండవలెను.

- అని యోచించి లక్ష్మ్యాది పరివారసమేతుడై దైత్యనగరమున కేగితన శంఖమగు పాంచజన్యము పూరించి సమాధినుండి మేలుకొనుమని చెప్పి, ప్రహ్లాదుడు సమాధినుండి లేవగా భగవానుడు జీవన్ముక్తులకు కర్మచేయు టచేగాని కర్మ త్యాగముచేగాని ప్రయోజనము లేదనియు, ఆతడు కల్పపర్యంతము జీవింపవలసి యున్నదనియు, అకాలమున దేహమును వీడుట సముచితము కాదనియు వాసనాది యుక్తుడును, కామాదిపూరితుడునునగు అజ్ఞానికే మరణము శోభించును, గాని తత్త్వవేత్తయగు జ్ఞానికి గాదనియు, జ్ఞానియగువాడు కర్తృత్వాభిమానము లేనందుచే అంతయు చేసినను ఏమియు చేయనివాడే యనియు, కాబట్టి ధ్యేయవాసనాత్యాగ మవలంబించి జీవన్ముక్తుడై కల్పపర్యంతము రాజ్యకార్యముల నొనర్చుచు పిదప విదేహ కైవల్యము నొందుమనియుచెప్ప ప్రహ్లాదుడందుల కంగీకరింప విష్ణు వాతనిని సింహాసనారూఢుని గావించి రాజ్యాభిషేక మొనర్చి నిజవాసమగు క్షీరసముద్రమున గరిగెను. ఓ రామచంద్రా ! ప్రహ్లాదుని జ్ఞానప్రాప్తిని గూర్చిన ఈ కథను ఎవరు చింతన జేయుదురో వారికి యేడు జన్మలందలి పాపము నశించిపోవును.

అతిపాపియైనను దీనిని మనస్సునందు ధరించుచో శీఘ్రముగ నుత్తమ పదమును బొందును. మనుజుడు తన పురుషప్రయత్నముచే నింద్రియ మనంబులను జయించుట వలనను ఆత్మవిచారణ వలనను, తన హృదయమందున్న విష్ణుభగవానుని (ఆత్మను) సాక్షాత్కరించుకొనును. బాహ్యవిష్ణుపూజ గౌణము. ఆత్మపూజ ప్రధానము. ఆత్మయే విష్ణువు. కావున ఆత్మచింతనమే శ్రేష్ఠమగు విష్ణుపూజ యగును.

ఓ రాఘవా ! ఈ జగన్మాయ యొక్క వైచిత్ర్యమును తెలుపుట కొఱకు నీకొక ఆఖ్యానమును జెప్పెద వినుము.

## గాధ్యుపాఖ్యానము

ఈ వసుధాతలమున కోసల దేశమున పరమ శోత్రియుండును, బుద్ధిమంతుడును నగు గాధియను బ్రాహ్మణుడుండెను. బాల్య కాలము నుండియు ఆతడు మిగుల విరక్తుడై యుండెను. ఒకనాడాతడేదియో అభీష్టకార్యమును మనమున నిడుకొని తన బంధువర్గమును వీడి అరణ్యమున తపమొనర్పనేగి ఒక సుందర తటాకమును గాంచి విష్ణుదర్శనపర్యంతము అందు కంఠము వరకు మునిగియుండెను. ఈ ప్రకారముగ 8 నెలలు గడువగా పిమ్మట విష్ణుభగవానుడట కేతెంచి వరము కోరుకొమ్మన ఆ బ్రాహ్మణుడు తమచే రచితమగు ఈ జగన్మాయను గాంచ దలంచినానని విన్నవింప భగవానుడు అట్లేగాంచ గలవు. పిదప దానిని విడిచి వేయగలవని చెప్పియంతర్ధానమొందెను. తదుపరి గాధి జలము నుండి యేతెంచి అవ్వనముననే కొన్ని దినములుండెను. ఒకనాడతడు విష్ణువు యొక్క వాక్యములను జింతించుచు తటాకమున స్నానముచేయుచు అఘమర్షణము గావింప నెంచి మునుగగా ఆ నీటియందు దాతనికి విపరీత జ్ఞానము జనించి ఈ క్రింది యనుభవములు కలిగెను - అతడు తన్ను మృతునిగా గాంచెను. బంధ్వాదులు విలపించుచు శ్మశానమునకు గొంపోయి అతని మృతశరీరమును భస్మమొనర్చిరి. పిదప భూతమండలదేశమున స్త్రీ గర్భమున జనించినట్లును ఆ చండాల వాటికయందే పెరిగి వివాహితుడై పుత్రులగని యిటునటు వనాదులందు సంచరించుచు స్వస్థానమున నొక

కుటీరమును నిర్మించుకొని యుండ క్రమముగ వార్ధక్యము నొందినట్లును, అతని కుటుంబ మంతయు మృత్యువుపాలైనట్లును ననుభవించెను.

తదుపరి యాతడచ్చోటు వీడి యనేక దేశములు సంచరించుచు కీరుల నివాసస్థానమగు దేశమున శ్రీమతిపురిని జేర అటరాజు మరణించుటచే నూతన రాజుకై మంగళగజము తిరుగుడుచు ఆ కటంజుడను చాండాలుని నెత్తి తన శిరసుపై పెట్టుకొనగా అందరును సంతసించి ఆతనికి రాజ్యాభిషేక మొనర్చిరి. అప్పటి నుండి యాతడు గవలుడను పేరుచే ప్రఖ్యాతిగాంచెను. 8 సం॥లు అతడు రాజ్యపాలనము చేసిన వెనుక నొకనాడాతడు తన యాభరణయులను తీసి వైచి తన రాజ ప్రాసాద బాహ్యంగమునకు జనగా అట గాన మొనర్చు చున్న చాండాల సమూహమును జూచెను. ఆ చండాలురలో నొక వృద్ధుడారాజును గుర్తెరింగి 'ఓ కటంజుడా! మిత్రుడవగు నీ దర్శనముచే నాకు ఆనందము కలుగుచున్నది' అనిచెప్పగా అటనున్న రాజస్త్రీలు పురజనము మున్నగువారు "ఈతడు చండాలుడు" అనితలంచి ఆతనిని ఉపేక్షించి ప్రాయశ్చిత్తార్థము అగ్నిలో దూక ప్రారంభించిరి. నగర వాసులలో కల్లోల మేర్పడెను. అదంతయు జూచి ఆ రాజు అవమానమును భరింపలేకయు తన కొఱకిందరు మరణించుచున్నారని దిగులొందియు ఆ యగ్నిలో దూకెను. అతని శరీర మపుడు భస్మీభూతమగుచుండ అవయవ ములు వ్యాకులత్వమొంద నీటియందు అఘమర్షణ మొనర్చుచున్నగాధి మేలుకొని నాలుగు ఘడియలైన వెనుక నెమ్మదిగ తన పూర్వపు బ్రాహ్మణ స్థితిని స్మరించి ఆశ్చర్యమొంది తన యాశ్రమమునే కొన్ని దినములు గడపెను. పిమ్మట ఒకనాడాతనివద్ద కొక యతిథి రాగా భోజనానంతరము రాత్రి పరుండబోవునపు డిరువురును సంభాషించుకొనుచుండ తాను (అతిథి) కృశించి యుండుటకు కారణమేమని గాధి యడుగ ఆ యతిథి కీరదేశమున తానొక నెలదినము లుండెననియు అచట 8 సం..లు. ఒక చండాలుడు రాజ్యమేలెననియు పిదప ఆ విషయము తెలిసికొని అగ్నియందు ప్రవేశింప చాలామంది ద్విజులున్ను అగ్నిని ప్రవేశించి రనియు తాను మాత్రము ప్రయాగకు జని శుద్ధియొనర్చుకొనెననియు

మూడవ చంద్రాయణము యొక్క చివర పారణమొనర్చి అతని యాశ్రమమునకు వచ్చుటచే ఉపవాసాదులచే కృశించి యుండెననియు చెప్ప అది విని గాధి విస్మితుడయ్యెను.

మరుసటి దినమున ఉదయము ఆ యతిథి వెడలి పోయిన పిమ్మట గాధి తమ యాశ్రమమును వీడి దేశములను దాటి భూతమండలమునకు జని పూర్వము తానుగాంచిన దృశ్యములనే చూచి ఆశ్చర్యయుతుడై అచ్చోట నొకనిని పిలిచి ఆ గ్రామ సమీపమున నొక చండాల రాజు యొక్క వృత్తాంతము జ్ఞాపకమున్నదా యని ప్రశ్నింప అతడు కటంజచాండాలుడు రాజైన వృత్తాంతమంతయు జెప్ప ఆయా వాక్యముల వినుచు గాధి అయా గ్రామ గృహములందు ఒక మాసము వరకుండి పిదప అట నుండి కీరదేశమునకుబోయి అచట నొకనిని చాండాల రాజవృత్తాం తమును గూర్చి యడుగ అతడున్ను అట్లే వచించి, అది యంతయు జరిగి అప్పటికి 12 వత్సరము లాయెనని చెప్పెను. ఈ ప్రకారముగ నట గాధి ఎవరెవరిని యడిగినను వారు అదేరీతిగ చెప్పు చుండ అపుడు గాధి పూర్వము వృత్తాంతము స్మరించుచుండ ఆ నగరమున పూర్వము తాను జూచిన సేనా వాహనాదులతో గూడి నృపవేషధారి యగు విష్ణుభగవానుడు రాజ మందిరము నుండి బయటికి వచ్చు చున్నట్లుగాంచెను. మఱయు తానచట పూర్వమనుభవించిన దృశ్యముల నున్ను అదేరీతిగ నచ్చోట తిలకించెను.

అపుడాతడు ఆశ్చర్యమగ్నుడై ఆ భ్రమ యొక్క కారణ మెఱుగ దలంచి ఆ నగరమును వీడి ఒక పర్వతగుహయందు ఒకటిన్నర సంవత్సరము విష్ణుప్రీతికొఱకు తపస్సు చేయ, భగవానుడు ప్రత్యక్షమై ఏమికావలెనని యడుగ తాను (విష్ణువు) జూపిన మాయను స్పష్టీకరింపు మనియు, భ్రమయం దాతడు గాంచినది, బాహ్యమున నెట్లు ప్రత్యక్ష మయ్యెను, తెలుపు మనియు కోరగా భగవానుడిట్లు వచించెను - ఓ గాధి ! వాస్తవముగ బాహ్యము, అభ్యంతరము నను నవి లేవు. ఈ ఆకాశ పర్వతాదులన్నియు చిత్తమునే గలవు. పత్రాదులు అంకురమునే యుండి బాహ్యమున ప్రత్యక్షమగునట్లు ఈ పృథ్వ్యాదులున్ను చిత్తమునకు బాహ్యమున గానంబడుచున్నవి.

వాసనా సహితమగు మనంబున యిటువంటి లక్షలకొలది వృత్తాంతము లుండును. కావున అద్దానియందీచాండాలత్వ మొకటి ప్రత్యక్షమగుటయం దాశ్చర్యమేమియునులేదు. స్వప్నమందు అల్ప క్షణకాలమున అనేక వత్సరములు వివిధానుభవముల నొందినట్లు అనుభూతమగు చున్నదిగదా ! వాస్తవముగ ఆ యతిథిగాని, కీరదేశముగాని, ఆ నగరముగానిలేవు, వానినన్నిటిని నీవు భ్రమచే గాంచితిని. ఇపుడును నీవు భూతమండలమునకు జనలేదు. అతిథి వాక్యముల విని భూతమండలమునకు బోవుచు మార్గమున నొక పర్వత గుహయందు విశ్రమించి శ్రమచే పరవశచిత్తుడవై స్వప్నతుల్యమున నీ భూతమండలాదులను గాంచు చున్నావు. అట్లే జలమున అఘమర్షణ సమయమందును నీవు గాంచిన కీర నగరాదులన్నియు మాయామయ ములై మనస్సు నందు జూచిన విభ్రమమే యగును. కాబట్టి నీవు లేచి బ్రహ్మ చర్మాశ్రమ యోగ్యములగు అగ్నిహోత్ర స్వాధ్యాయాది కర్మల గావింపుము అనిచెప్పి విష్ణువంతర్ధాన మొందెను.

తదుపరి గాధి భగవానుడుచెప్పినట్లు కీరాది దేశములు వాస్తవముగ లేవాయని పరీక్షించుటకై వెడలిచూడ, అవియట్లేయుం డుటను జూచి ఆ గుహకు జని విష్ణుభగవానుని ఆరాధింప అతడు ప్రత్యక్షమై ఏమి కోరుచున్నావని యడుగ ''ఆఱు నెలలవరకు కీరభూతమండలములందు సంచరించితిని. కాని అచటి వృత్తాంతములు నేను భ్రమయందు గాంచినట్లుగనే యున్నందున మాయాదృష్ట పదార్థములు దేశకాలాంతరమున వ్యభిచారమును బొందునేగానీ అట్లే యుండవు గావున ఇదేమి యిట్లు జరిగినది అనుసంశయము గలిగినదని చెప్పగా భగవానుడిట్లు వచించెను - కాకతాళీయ న్యాయముచే భూతమండల కీరదేశవాసు లందరి చిత్తమునకు భ్రాంతి యందువలె కటంజచాండాల రూపస్థితి నీకువలెనే భాసించినది. కావుననే వారందరు నావృత్తాంతమును అదే రీతిగా చెప్పుచున్నారు. ఎప్పుడైన అనేకులు భ్రమను గాంచవచ్చును. కాబట్టినీవు ఇచటనే యుండి మనోమోహరహిత మగు ఆత్మనుగూర్చి విచారింపుము అని చెప్పి భగవానుడంతర్ధానము కాగా గాధి అచటనే యుండి కొన్ని మాసములైన పిదప మరల విష్ణు

భగవానుని ఆరాధింప నాదేవుడు ప్రత్యక్షముకాగా ఈ మాయామోహ నివృత్తికై ఉపాయము వచింపుడని గాధి అతనిని ప్రార్థింప భగవానుడిట్లనెను.

స్వప్న భ్రమాదులందువలె నీకీ చాండాలాది వృత్తాంతము గోచరించినది. కటంజుడను చాండాలుని అతని గ్రామ గృహాదులను నీవెపుడో చూచియుంటివి. ఆ భావములే నీకు జలమందు అఘమర్షణ మంత్రము జపించునపుడు నాయిచ్ఛచే నీ మనంబున భ్రమ రూపమున నుదయించినది. దృశ్యము నందు జ్ఞాని రమింపడు. ఈ మాయా చక్రమునకు నాభియైనట్టి మనస్సును నిరోధించి ఆత్మయందు లయమొనర్చినచో ఇక ఈ మాయ బాధింపదు. కావున ఈ పర్వత కుంజమున పది సంవత్సరములు మనోనిరోధ రూప తపము సల్పుము. అపుడు అనంత జ్ఞానమును బొందెదవు అనిచెప్పి విష్ణుదేవుడంతర్ధానము కాగా గాధి ఋష్యమూక పర్వతముపైకి జని సర్వ సంకల్పములను ద్యజించి మనోనిరోధ రూపమగు తపము పది వత్సరములు గావించి ఆత్మజ్ఞానమొంది ముక్తుడయ్యె. మఱియు జీవన్ముక్త రూపమున మహదానందమున నోలలాడుచుండెను.

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ మాయ అతిభయంకరమైన అసావధాన చిత్తులను సంకటమందు బడ ద్రోయును గావున నీవు నిరంతరము ఆత్మస్థితియందు జాగరూకుడవై ఈమాయాచక్రమును దాని నాభియగు చిత్తమును నిరోధించుటద్వారా నిరుద్ధమొనర్చి ముక్తుడవై అనంతసుఖమును బడయుము. దృశ్యరూపమగు మలమును వీడి మనస్సును ఆత్మయందు లయ మొనర్చి ఆశాపాశమును ఛేదించి స్వస్వరూపమున (ఆత్మయందు) స్థితిని బడయుము. పూర్వము ఉద్దాలక ముని భూతసమూహ విచారణ ద్వారా పరమ జ్ఞానమయ దృష్టి నెట్లుబడసెనో వినుము.

## ఉద్దాలకోపాఖ్యానము

పూర్వము భూతలమున గంధమాదన పర్వతముపై నొక రమ్య శిఖరమున ఉద్దాలకుడను ముని వసించుచుండెను. అతడు మొదట

అల్పప్రజ్ఞ గలవాడయ్యును క్రమముగ తపస్సు చేతను, శాస్త్రార్థ విచారణచేతను వివేకమును బొందెను. ఒకపుడాత డేకాంతమున నివ్విధంబున చింతనజేసెను - దేనియందు విశ్రాంతి నొందిన మరల మనుజుడు దుఃఖింపడో అట్టి పొందదగిన వస్తువేది ? భోగతృష్ణ వాసనా జాలము నా మనంబున పరిపూర్ణముగ నెపుడు శమించును ? మనో వ్యాపార రహితుడనై నిర్వికల్ప సమాధియందు నిశ్చలముగ నేనెపుడు స్థితి గల్గియుందును ? ఇట్లుచింతించుచు నాతడా పర్వత శిఖరస్థ వనమున మరల మరల ధ్యానమభ్యసించెను. కాని చంచలమగు చిత్తము దృశ్యవిషయముల వైపునకు పరుగిడుటచే నాతడు సమాధియందు స్థిరత్వమును బొందకుండెను. అపుడాతడు వ్యాకుల చిత్తుడై ఆ పర్వతముపై తిరుగాడుచు నొకపుడు సమస్త జీవ సంచార రహితమగు నొక గుహను బొంది అందు బ్రవేశించి పత్రాసనముపై మృగచర్మమును బఱచి దానిపై గూర్చొని పద్మాసనము వైచికొని విషయముల వైపునకు పరుగిడుచున్న మనస్సును వాసనల నుండి నివృత్తము జేయుచు నిర్వికల్ప సమాధిని పొందు నిమిత్తము ఈ ప్రకారము చింతన జేసెను -

ఓ మూర్ఖ చిత్తమా ! సాంసారిక వృత్తుల వలననేమి ప్రయోజనము? బుద్ధిమంతులు చివరకు దుఃఖమునే గలుగజేయునట్టి క్రియలను ఎన్నడును జేయరు. ఓ మనస్సా ! నీవు పాతాళమున కేగినను బ్రహ్మలోకమున కేగినను శాంతి రూపమగు ఆత్మామృతమును బొందనిచో నిత్యానందమున స్థితిగలుగదు. అనర్థదాయకములగు శబ్దస్పర్శాది ఇంద్రియార్థములందు సుఖమెచట ? కాబట్టి, ఓ యింద్రియములారా! మీరు మీ వాసనలను వీడుడు. ఈ బాహ్యదృశ్యశరీర మనంబులందు 'అహం' పదమునకు యోగ్యమైన దేదియులేదు. అవి నేను గాదు. ఆత్మ తత్త్వము నెఱుంగమి ఈ అహంకారాది చమత్కృతి యుదయించినది, ఆత్మ దర్శనముచే నయ్యది నశించుచున్నది. నేను మనోదేహేంద్రియాది సంబంధ రహితుడను, పరబ్రహ్మమును, శాంతుడను, నిరవయవుండను.

ఈ ప్రకారముగ నిశ్చయించి ఉద్దాలకుడు, నిమీలిత నేత్రుడై పరబ్రహ్మ వాచకమగు ప్రణవమును ఉచ్చైస్స్వరముతో నుచ్చరించుచు పాపరహితుడై సమాధి కార్యమునకు యోగ్యుడాయెను. పిమ్మట నాతడు

పంచేంద్రియములను విషయముల వైపునకు బోనీయక బంధించి మనస్సును శుద్ధ మొనర్చుటకుగాను పూర్వపు గృహాదుల గూర్చిన చింతను దూరీకృతముచేసి విషయముల వైపునకు బరుగిడు చున్న చిత్తమును నిరోధించి బాహ్యవిషయములను బూర్ణముగ ద్యజించి మనస్సును హృదయమున నెలకొలిపి బ్రహ్మాకార వృత్తులను మధ్య మధ్య విచ్ఛిన్న మొనర్చు విపరీతభావనారూప వికల్ప సమూహముల నెగురగొట్టుచు ఆవరింప జూచిన నిద్రను గూడ పారద్రోలి మనస్సును విషయముల నుండి మాటి మాటికి మరల్చుచు ఇవ్విధమున నద్దానిని వాసనా రహిత మొనర్చి చిరకాల ఆత్మానుసంధానము ద్వారా చిద్రూపత్వమును బొందెను. ఈ ప్రకారముగ ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొనినట్టి యా ఉద్దాలకుని సమీపమున కపుడు సిద్ధులు, దేవతలు, అప్సరసలు ఏతెంచిరి. కాని బ్రహ్మానందమున నోలలాడు యాతని చిత్తము వారిచే నాకర్షింపబడకుండె. ఆ దేవతాదు లాతనిని విమానముపై నెక్కి స్వర్గమున కేతెంచుడని ప్రార్థించినను అతడు భ్రమను నొందక వారలను సముచితరీతి పూజించెను. సమాధి తత్పరుడును భోగ విరక్తుడును నగు అతనిని ఆ సిద్ధాదులు చాలసేపైన పిదప వీడి చనిరి. జీవన్ముక్తుడగు అమ్మునివరుడు అటు పిమ్మట మునుల ఆశ్రమము లందును, మేర్వాది పర్వతము లందును, వనభూములందును లీలా మాత్రమున విహరించె. అటు పిదప చాలకాలమున కాతనికి దేహము త్యజించి విదేహముక్తుడవ కోర్కె జనింప, ఒకానొక పర్వత గుహయందు పల్లవాసనముపై పద్మాసనము వైచి గూర్చుండ నిమీలిత నేత్రుడై ప్రాణవాయువును నిరోధించి ఆత్మయందు స్థితిగల్గి నిశ్చలముగ నుండెను. అతని జీవుడు బ్రహ్మభావమును పొందెను. ఆతని దేహము ఆఱు నెలల వఱకు సూర్యకిరణములచే సంతప్తమై శుష్కించెను. అత్తఱి యటకు రాత్రి సమయమున ఖింఖిణి యను దేవి యేతెంచి అతని మృత శరీరమును తన ముకుటమున ధరించెను.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ నీవున్ను ఆత్మవిచారము ద్వారా బ్రహ్మపదమున విశ్రాంతి నొందుము. వాసనారహితుడును దృశ్యభావ

వర్జితుడును నగు జ్ఞాని వ్యవహారమందున్నను లేక సమాధియందున్నను నొకటే. మనస్సు యొక్క చంచలత్వ ముడుగుటయే ప్రధానము. కార్యములందు కర్తృత్వభావము లేకుండుటయే ముఖ్యము. అట్లైనచో మనుజుడు వ్యవహార తత్పరుడైనను సరే, లేక సమాధి యందున్నను సరే రెండును సమానమే. ఇక నిపుడు. నీవు ఆత్మవిచారము సల్పి బ్రహ్మజ్ఞానము నొందిన సురఘు అను కిరాత రాజు వృత్తాంతమును వినుము -

## సురఘు పరిఘు వృత్తాంతము.

పూర్వము హిమాలయ పర్వత మూల ప్రదేశమున హేమ జటులను కిరాతులుండిరి. వారికి సురఘుడను నుత్తమ గుణాన్వితుడు రాజుగ నుండెను. ప్రజాపాలనమం దుపయోగింపవలసిన నిగ్రహానుగ్రహ క్రియలచే నాతడు వ్యాకులచిత్తుడై జీవితమందలి సుఖ దుఃఖ క్రమములను గూర్చి చింతించుచు సంశయగ్రస్తుడై చిత్త విశ్రాంతి లేక యుండ నొకపుడతని గృహమునకు మాండవ్య ఋషి యేతెంచెను. అపుడు సురఘు డాతనిని పూజించి ప్రజాపాలన మందలి నిగ్రహానుగ్రహములచే తన చిత్తమున కశాంతి కలుగుచున్నదనియు, సమదృష్టి కలుగుటకై యుపాయము వచింపవలె ననియు నాతనిని ప్రార్థింప నంత నా ఋషీశ్వరు డిట్లు పదేశించెను - ఓ రాజా ! వైరాగ్య త్యాగ ఆత్మజ్ఞాన సంపాదనాది పురుష ప్రయత్నములచే మనస్సు సూక్ష్మమై నశించును. ప్రథమమున నీవెవరివో ఈ దృశ్యమేమియో విచారింపుము. ఎపుడట్టి విచారణచే నీవు నీసత్యభావము నెఱుంగుదువో అపుడు హర్షశోకాదులు నిన్ను బాధింపవు. మఱియు అపుడు నీచిత్తము తన పూర్వ స్వరూపమును వీడి సంతాపరహితమగు బ్రహ్మస్వరూపమై శాంతి నొందును. సమస్త దృశ్యమును త్యజించుచు వచ్చినచో శేషించునదే (ఏది ఇక త్యజింప శక్యముకాదో అదియే) ఆత్మ. సర్వత్యాగము లేకున్న ఆ యాత్మ లభింపదు . కావున ప్రయత్నముచే దృశ్యమును త్యజించి ఆత్మను బొంది శాంతి నొందుము- ఈ ప్రకారముగ నా ఋషి యుపదేశించి తన యాశ్రమమునకు తిరిగి వెళ్ళెను. అపుడారాజు ఏకాంతస్థలమున కేగి స్వబుద్ధిచే తానెవరో ఈ క్రింది రీతిగ విచారణసల్పెను - ఈ పృథివ్యాది

దృశ్యపదార్థములు నేనుగాను; మాంసాది జడపదార్థయుక్తమగు ఈ శరీరము నేనుగాను; అట్లే ఇంద్రియ మనంబులును నేనుగాను; ఈ సమస్తదృశ్యమునకు సాక్షియై చిద్రూపమై వెలుగు ఆత్మయే నేను. అహా! చిరకాలమున కట్టి మహదా నందదాయకమగు ఆత్మను కనుగొంటిని! ఈ యాత్మను ఎఱుంగుటచే నిక దుఃఖమేలేదు. ఈ ప్రకారముగ ఆ కిరాత రాజు పురుషప్రయత్నముచే వివేకముద్వారా బ్రహ్మపదము నొంది సమదర్శియై రాజకార్యముల జూచుచు ఆత్మానందప్రాప్తిచే పరితృప్తుడై సుఖముగ నుండెను. అతడు వందల కొలది వత్సరములు రాజ్యమేలి తుదకు భౌతికదేహమును త్యజించి విదేహకైవల్య మొందెను.

ఓ రామచంద్రా ! సురఘునివలెనే నీవున్ను వివేకముచే ఆత్మదృష్టి నవలంబించి శాంతినొందుము:

శ్రీరాముడు:- మహాత్మా! మనస్సు చంచలమైనదిగదా! అది ఏకమగు బ్రహ్మమున నెట్లు నిలకడ నొందగలదు?

శ్రీవసిష్ఠుడు:- ఇవ్విషయమున నీవు సురఘు పరిఘ సంవాదమును వినుము. వారిరువురును చిత్త ఇంద్రియములను జయించి ఏకమగు బ్రహ్మమున స్థితిగలవారు.

పూర్వము పారశీకదేశమున పరిఘుడను రాజు గలడు ఒకపుడాతని రాజ్యమున క్షామము సంభవించి పెక్కురుజనులు మరణించుచుండ అతడు దుఃఖపరవశుడై రాజ్యమును వీడి వైరాగ్యయుక్తుడై వల్కలముల ధరించి నగరవాసుల కెవరికి తెలియకుండ తప మొనర్చుటకై దూరస్థ వనమునకు బోయెను. అచట చిరకాలము శుష్కపత్రములనే భుజించుచు నుండుటచే మునులమధ్య నాతడు పర్ణాదుడని ప్రసిద్ధికెక్కెను. పిదప నాతడు వేయి సంవత్సరముల కఠిన తపస్సు చేతను సమాధ్యభ్యాసముచేతను చిత్తశుద్ధి గలవాడై పరమాత్మ అనుగ్రహముచే ఆత్మజ్ఞానమునొందెను. పిదప నాతడు త్రైలోక్యమున సంచరించుచు ఒకపుడు తన మిత్రుడైన సురఘుయొక్క గృహమున జేర ఆ పూర్వమిత్రులిరువురును తమ ఆకస్మిక సంయోగమునకు హర్షించి కుశలప్రశ్నల వైచుకొనిరి. పిమ్మట పరిఘుడు సురఘు నిట్లడిగెను -

మిత్రమా! పరమ విశ్రాంతిమయమగు సమాధిని నీవు శీలించుచున్నావా? అపుడు సురఘు డిట్లనెను - జ్ఞానిశీలించుట యేమి? ఆతడేమి చేయుచున్నను సమాధియందే యుండును. వాసనా రాహిత్యమునొంది ఆత్మజ్ఞానము గలిగి యుండుటయే సమాధి. అట్టి స్థితిగలవాడు వ్యవహారము చేయుచున్నను సమాధిస్థుడేయగును. జ్ఞాని తన యాత్మ స్వరూపమును ఏ కాలమందును మఱువకనే యుండును. నేను సదా జ్ఞానవంతుడనై శాంతుడనై సమాధిస్థుడ నయ్యేయున్నాను. సదా ఆత్మయందున్న నాకిక అసమాధి యెచట?- అది విని పరిఘు డిట్లనియె - మిత్రమా! నీవు నిక్కముగ పరబ్రహ్మపదము పొంది పరితృప్తుడవైతివి. సర్వోత్తమమగు ఆత్మయొుక్క ప్రాప్తిచే నీవు వీతరాగుడవై చంద్రునివలె ప్రశాంతముగ శోభించుచున్నావు.

సురఘుడు:- ఈ దృశ్యమంతయు మిథ్య కావున మనకిక గ్రాహ్యమగు వస్తువెద్దియు లేదు. మనస్సుయందే పూర్ణతృప్తి నొందుదము. కాబట్టి ఈ ఆత్మదృష్టియే సేవింప దగినది.

ఈ ప్రకారముగ వారిరువురు సంభాషించుకొని పరస్పరము పూజించుకొని వారి వారి కార్యములను జూచుటకై వెడలిరి.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ నీవును వివేకజ్ఞానము ద్వారా పరమాత్మ పదమును ప్రత్యక్షముగ బొందుము. సమ్యగ్జ్ఞానము గలవాడును దృశ్యము మిథ్యయని ఎఱింగినవాడును ఆత్మస్థితి గలవాడును, ఇక దేనివలనను దుఃఖితుడు కాడు, అట్టివానిని ఏ పాపమున్ను అంటదు. మఱియు నాతనికి అవిద్య పూర్ణముగ నశించి మరల ఎన్నటికి నుదయింపదు. ఈ శరీరము, ధనాదులు నావి యను అభిమానమును వీడి మనస్సును మనస్సుచే ఛేదించి ఆత్మను దర్శింపకున్నచో జగద్దుఃఖము నశింపదు; సంసారము మరల మరల కలుగును. ఇవ్విషయమున భాస విలాసులను నిరువురు మిత్రుల సంవాదమును వినుము.

## భాస విలాస వృత్తాంతము

పూర్వము సహ్యపర్వతము శిఖరముపై రమ్యమైన అత్రి మహర్షి ఆశ్రమము గలదు. ఆ యాశ్రమమున భాసవిలాసులను నిరువురు మునికుమారులు వసించుచుండిరి. వారు పరస్పరము గాఢ మిత్రత్వము గలిగి యుండిరి, వారు క్రమముగ యౌవనమును బొంద వారి తండ్రు లిరువురును స్వర్గస్థులు కాగా వారికి ఔర్ధ్వ దైహిక క్రియలను సలిపి వియోగ జనిత దుఃఖముచే చింతాక్రాంతులై యుండిరి. వారిద్దరును వైరాగ్యమునుబొంది వేఱుపడినవారై వనమున కాలమును గడుపుచుండిరి. కాలక్రమమున వారు వార్ధక్యము నొందిరి. విమల జ్ఞానమును బొందని వారిరువురు వృద్ధతాపసులు చిరకాలమునకు ఒకచోట కలిసికొనగా, విలాసుడు భాసుని కుశలము నడిగెను. అపుడు భాసుడిట్లనియె -

మిత్రమా! జ్ఞేయమగు బ్రహ్మము నెఱుంగ నంత వఱకును కామసంకల్పాదులు నశింపనంతవఱకును మనకు కుశలమెచట ? మనుజులయొక్క చిత్తము అజ్ఞానకారణమున అనేక కార్యములందు ప్రవర్తించుచు చింతాయుక్తమై క్షణమైనను విశ్రాంతినొందకున్నది. ఆత్మలాభము కలుగనిచో జ్ఞానమను మహౌషధి లేకున్నచో ఈ సంసారమను మహామారి ఉదయించుచునేయుండును! ఈ ప్రకారముగ వారివురును పరస్పరము సంభాషించుకొని కాలక్రమమున విమల జ్ఞాన మొంది ముక్తిని బడసిరి.

కాబట్టి ఓ రామచంద్రా! సంసారమను సముద్రమును దాటుటకు ఆత్మజ్ఞానముతప్ప మఱి ఏ యుపాయమున్నులేదు. దేహమున ఇంద్రియాదుల కంటే ఆత్మ వేఱుగ నున్నదిగావున ఆ దేహదులకు సుఖదుఃఖములు కలిగినను ఆత్మకు ఏహానియు లేదు. అంతఃకరణమున ఆసక్తి (సంగము) లేనివాడు నిర్విక్షేపమగు సుఖమును బొందును. అట్టివాడు కార్యములజేసినను అకర్తయే యగును. కావున సకల దుఃఖనివృత్తి కొఱకును ఆత్మసుఖప్రాప్తికిని అంతః కరణముయొక్క సంగమును నిర్మూలింపవలయును. ఈ అంతఃకరణ సంసక్తి వలననే

క్రిమికీటాది యోనులును తదితర దుఃఖపరంపరలును గలుగు చున్నవి. సంసక్తి రెండువిధములు - ఒకటి వంద్య సంసక్తి, రెండవది వంధ్యాసంసక్తి, దేహాదులందలి ఆసక్తి వంధ్య సంసక్తి యనియు, ఆత్మజ్ఞానముచే జనించి నదియు జీవన్ముక్తుల కుండునట్టిదియు, సంసార రహితమైనదియు వంద్యాసంసక్తి యనబడును. ముముక్షువగువాడు సాక్షిస్వరూపమగు ఆత్మయందే తన చిత్తమును స్థిరమొనర్పవలెనుగాని దృశ్యసాక్ష్యస్వరూప మగు దృశ్య పదార్థములందు ఆసక్త మొనర్పగూడదు. జ్ఞాని జాగ్రత్తునందును సుషుప్తి నివలె నున్నవాడై దృశ్యవిషయములందు ఆసక్తి లేక యుండును. ద్వైత (దృశ్య) త్యాగముచేతను, (ఆత్మ) విచారణదృష్టి చేతను జ్ఞానులు ఆత్మస్వరూపమున స్థితిగలవారై ముక్తినొందుచున్నారు. ఓ రామచంద్రా ! అహంకారములు మూడు విధములుగ చెప్పబడినవి

1) ఆకాశము కంటెను సూక్ష్మమై అన్నిటికంటె పరమైనట్టి చిద్రూపాత్మను నేను అని తలంచుట మొదటి అహంకారము.

2) అంతయు నేనే అను అహంకారము రెండవది.

3) దేహమును నేను అనునది మూడవది.

ఇందు మొదటి రెండును తత్త్వజ్ఞానము వలన గలుగునవియునై యున్నవి. మూడవది దుఃఖము కొఱకే యగును. శాంతి కొఱకు గాదు. తదుపరి ఈ మూడు అహంకారములను గూడ వదలి శేషించిన నిరహంభాన రూపమగు పూర్ణ చిన్మాత్రము నవలంబించి దానియందే తత్పరుడవై యుండుము.

ఆశారాహిత్యముచే మనుజునకు పరమశాంతి లభించును. త్రైలోక్యము తృణమువలె నపుడు భాసించును,. అట్టి నిరాశచే మనుజునకు సర్వోత్తమ సుఖము లభించును, ఒక పర్యాయము విమల జ్ఞానోదయమై అజ్ఞాన గ్రంథి విచ్ఛిన్నమైనచో నిక మరల యెన్నటికిని అజ్ఞానబంధనము కలుగదు. అవిద్యారహితుడగు జ్ఞాని సదాచార లోక వ్యవహారములందు పూర్ణముగ తత్పరుడై యున్నను అంతఃకరణమున ఆత్మభావన గల్గి యున్నవాడై పరమానంద యుతుడై యుండును. జనక, దిలీప, శర్యాతి, మాంధాత, సగరాది రాజులున్ను, బృహస్పతి, శుక్ర, చంద్ర

సూర్యాదులును, సప్తర్షులును ఇంకనెందరో ఇతరులు జీవన్ముక్తులై ఆయా రాజ్యాది కార్యములను అసక్తముగ నాచరించుచు ఆత్మానంద మగ్నులై ప్రశాంతముగ వెలయుచున్నారు. ఇంక నెందరో వెలయగలరు.

అత్యంత దుర్గమమును, అపారమును, భయంకరమునునగు ఈ సంసార సాగరము యుక్తి ప్రయత్నములులేక దాట బడదు. వివేక వైరాగ్యములచే జ్ఞాను లద్దానిని దాటి జీవన్ముక్తులై భ్రమ రహితులై దుఃఖవర్జితులై ఆత్మానంద మగ్నులై యుందురు. చిత్తనాశము కొఱకు శాస్త్రములందు రెండు క్రమములు గలవు :- 1) యోగక్రమము 2) జ్ఞానక్రమము. ప్రాణ నిరోధము యోగక్రమము. సమ్యగ్జ్ఞానార్జనము జ్ఞానక్రమము, ప్రాణాయామాదులచేతను వైరాగ్యదులచేతను, ఏకతత్త్వ దృఢాభ్యాసము చేతను ప్రాణస్పందము నిరోధింపబడును. అట్లే జగత్తు మిథ్య యనియు, ఆత్మయే సత్యమనియు, పూర్ణముగ నెఱింగి ఆత్మ విచారణచే దృశ్యభావనలేక ఆత్మయందే స్థితి గలిగి యుండుట జ్ఞానక్రమము. తత్త్వవిచారణ దృఢపడినచో ఎదుట నున్నప్పటికిని భోగములు రుచింపక యుండును.

ఓ రామచంద్రా! నీవు వైరాగ్యాదులను లెస్సగా నవలంబించి నిరంతరము (ఏక్రియ చేయుచున్నను) ఆత్మవిచారణ సలుపుచు చిత్తము వాస్తవముగ లేదనియు, ఆత్మసత్యమనియు ఇత్యాది విధములుగ చింతన చేయుము. దేహమను గృహమునుండి చిత్తమను బేతాళమును బారద్రోలి శాంతిని బొందుము. అట్టివిచారణనే పూర్వముబృహస్పతి యొక్క సోదరుడగు సంవర్తుడు కావించెను. ఆతడేనాకద్దానిని వింధ్యపర్వతముపై జెప్పెను. కాబట్టి నీవున్ను అద్దాని నవలంబింపుము. ఇక నిపుడు ఇంద్రియ మనోబోధదాయకమును బ్రహ్మపద ప్రదమునగు ఏ దృష్టి నవలంబించి పూర్వము వీతహవ్యముని ఆత్మపదమున నిఃశంకముగ నారూఢుడయ్యెనో ఆ దృష్టిని గూర్చి వినుము.

## వీతహవ్యోపాఖ్యానము

పూర్వము వీతహవ్యుడను ముని విరక్తుడై సమాధి శీలించు నిమిత్తము వింధ్యపర్వతగుహలను వెతకుచు ఆ వింధ్యారణ్యమున నొక

చోట పర్ణశాలను నిర్మించుకొని అందు పద్మాసనము వైచికొని కూర్చొని ఇంద్రియ మనంబులను బాహ్యాభ్యంతర విషయములనుండి మరలించి తన శుద్ధమనస్సుచే నిట్లు విచారించెను -

''ఓ ఇంద్రియములారా! మీరు కేవలము కల్పితజడస్వరూపులు. చిదాత్మ స్వరూపుడనగు సాక్షిరూపుడనైన నాకును, మిథ్యారూపులగు మీకును ఏ సంబంధము లేదు. ఓ చిత్తమా ! నీవున్ను జడరూపమవు. కాబట్టిలేనిదానివే యగుదువు. ఓ చిత్తమా! నీవు ఆత్మను గూర్చిన భావన చేయుము. అపుడు అనంతసుఖము కలుగును.'' ఈ ప్రకారముగ చింతన చేయుచు వాసనారహితుడగు వీతహవ్యుడు వింధ్యాచల కందరమున సమాధియందు నిశ్చలముగ, మూడు వందల సంవత్సరము లుండెను. ఆ సమయ మాతనికి అర్ధముహూర్తమువలె గడచి పోయెను. ఆ కాలములో నాతడు గొప్పగొప్ప మేఘ శబ్దముల చేతను దృష్ట్యాదులచేతనుగూడ మేలుకొనలేదు. కాలక్రమమున యాతని దేహము వర్షాకాలపు బురదచే భూమిలోకి ఙొచ్చుకొని పోయెను. మున్నూరు వత్సరముల కాతడు సమాధి నుండి మేల్కొంచి మనోరూపమున తన హృదయముననే ఈ క్రింది విషయముల ననుభవించెను - కైలాసపర్వతవనమున మునియై నూఱు వత్సరము లుండెను. కొంతకాలము ఇంద్రపదము ననుభవించెను. తదుపరి శివుని గణముగ నొక కల్పమువఱకుండెను.

అట్లు గణముగ నున్న సమయమున నొకపుడు తన పూర్వకాలిక దేహము లన్నిటిని జూడ తలంపాతనికి గలిగెను. అట్లాతడు తన నశించి నట్టి దేహములను జూడగా నశింపని వానిలో వింధ్యారణ్యమందు బురదలో కూరుకొనియున్న దేహమును జూచి తాను జీవన్ముక్తుడు, కావున తనకు దేహత్యాగము నందుగాని గ్రహణమందు గాని పట్టుదల లేకున్నను ఆ దేహము క్షయించు వఱకు దాని నాశ్రయించి లోకమున విహరింపదలచి దాని నుద్ధరించుటకుగాను సూర్యగణమైన పింగళుని సహాయ మపేక్షించి సూక్ష్మరూపమున సూర్యమండలమున బ్రవేశింప సూర్యుడాతని యభీష్టము నెరిగి పింగళుని బంప అతడు బోయి భూమి క్రింద నుండి యా శరీరమును లేవనెత్తగా నంత నాముని యొక్క సూక్ష్మదేహ మందు

బ్రవేశించెను. పిమ్మట పింగళుడు స్వస్థానమున కరిగెను. తరువాత అమ్మునిస్నానాదుల గావించి నదీ తటమున నాపగలంతయు నుండి దినాంతమున మరల సమాధి శీలింప నిచ్ఛగల్గి, ఒకానొక, వింధ్యపర్వత గుహయందు ప్రవేశించి పూర్వమువలెనే ఇంద్రియాదులను సంబోధించి విచారణ సల్పెను. ఈ ప్రకారముగ నాతడట్టి విచారణ సల్పుచు ఈ ప్రపంచమున జీవన్ముక్త రూపమున చాలకాలముండెను. ఈ ప్రపంచమున 3000సం॥ అతడు సుఖపూర్వకముగ విహరించి పిదప ఒకపుడు విదేహ కైవల్యమునొంద దలచి సహ్యపర్వతగుహయందు బ్రవేశించి పద్మాసనము వైచికొని కూర్చొని తన దేహేంద్రియ చిత్తాదులకును తదితర గుహాది పదార్థములకును సెలవు చెప్పి ప్రణవము (ఓంకారము) నుచ్ఛరించుచు తల్లక్ష్యభూతమగు పరమాత్మను భావించుచు క్రమముగ తురీయపదము నొంది సద్రూపమై (ఆత్మయై) విలసిల్లెను. అతడు పరబ్రహ్మమున లీనమయ్యెను. తదుపరి కాలక్రమమున నాతని దేహము శిథిలమై పంచభూతములందు విలీనమాయెను.

ఓ రామచంద్రా! నీవున్ను వీతహవ్యునివలె స్వబుద్ధిచే తత్త్వ విచారణ సలిపి సారవస్తువగు ఆత్మ నెఱిగి అట్టి ఆత్మజ్ఞానముద్వారా దుఃఖరాహిత్యము నొంది జీవన్ముక్తుడవై లోకమున విహరింపుము.

శ్రీరాముడు:- జీవన్ముక్తుల శరీరములకు ఆకాశగమనాది శక్తులున్నటుల యేల కానిపింపవు ?

శ్రీ వసిష్ఠుడు - ఆ శక్తులు అగ్నియొక్క యూర్ధ్వచలనమువలె పదార్థములయొక్క స్వాభావిక శక్తులై యున్నవి. ఆత్మజ్ఞానరహితుడైనను మనుజుడు మణి మంత్రౌషధ యోగాభ్యాసాదుల ద్వారా ఆ శక్తులను బొందగలడు. కాని ఆత్మజ్ఞుడు వాని నభిలషింపడు. అతనికీ ప్రపంచమున నేకోర్కెయు నుండదు.

శ్రీరాముడు:- వీతహవ్యుని శరీరమును (భూమియందు కూరుకొనియున్న దానిని) హింసకజీవు లేల భక్షించలేదు ? లేక పంకాదులయం దేల శిథిలమై పోలేదు?

శ్రీవసిష్ఠుడు:- చిత్తము ఏయే పదార్థములందు పడునో అట ఆయా రూపమగుచుండును. ఎట్లన శత్రువును జూచునపుడు వికారి యగును. పుత్రుని గాంచునపుడు ఆనందిత మగును. రాగద్వేషాది రహితుడునునగు యోగిశరీరముపై హింసక జీవియొక్క చిత్తమెపుడు పడునో అపుడా చిత్తము ఆ యోగియొక్క సమరూప చైతన్యముయొక్క ప్రతిబింబముచే సమత్వము నొందును. కావున నది అతనిని హింసింపదు. అందుచేతనే ఆత్మస్థితి గలిగియుండిన వీతహవ్యుని దేహమును సింహవ్యాఘ్రాదులు బాధింపలేదు. మరియు సమరూపమున నున్న పంచభూతముల సంవిత్తువలన నిర్వికారదశగా బొందియున్న అతని దేహము వికారత్వమును బొందకుండెను. ప్రాణముల గతియే స్పందము. బాహ్యవాయు జనిత హస్త పాదాదుల స్పందము, అభ్యంతర చిత్తజనిత ప్రాణస్పందము శమించినచో శరీరమున ధాతువులు క్షయింపవు. కాబట్టి యోగి దేహము తద్యోగాభ్యాసము వలన ప్రాణాది స్పంద రహిత మగుటచే నశింపక యుండును. ఆత్మజ్ఞానులును, వీతరాగులును, భిన్న గ్రంథులును, మహాత్ములునగువారు తమ శరీరమున స్వతంత్రులు. కాకతాళీయ యోగముచే వీతహవ్యుని సంవిత్తు కొంత కాలము జీవింప వలెనని భావించెను, గావున అతడు జీవించెను. ఎపుడాతని సంవిత్తు విదేహ ముక్తివైపునకు అభిముఖమాయనో, అపుడాతడు విదేహముక్తి నొందెను.

సరూప నాశనము, అరూప నాశనము అని చిత్తనాశము రెండు విధులు. మొదటిది, జీవన్ముక్తుల కుండును, రెండవది విదేహముక్తులకు వర్తిల్లును. జీవన్ముక్తుల చిత్తము వాసనా రహితమై మైత్ర్యాదిగుణ సమన్వితమై యుండును. అరూపనాశమున చిత్తముయొక్క లేశమేని యుండదు. సరూపనాశమున చిత్తము వాసనారహితమై దగ్ధపటల న్యాయమున వర్తించును.

ఈ సంసారమను లతకు బీజము శరీరము. దాని బీజము మనస్సు. దాని బీజము ప్రాణస్పందము. వాసన ప్రాణస్పంద వాసనలలో నేయొకటి

నశించినను చిత్తము నశించును. ప్రాణస్పంద వాసనల రెంటి యొక్క బీజము శబ్దాది విషయములు. కాబట్టి ప్రథమమున దృశ్యములగు శబ్దాది విషయములను త్యజింపవలయును.

వాసనాక్షయ మనోనాశ తత్త్వ జ్ఞానముల మూడిటిని ఏక కాలమునే (తోడ తోడనే) దృఢముగ నభ్యసింప వలయును. ఏకార్యము చేయుచున్ననుగూడ ఈమూడింటిని అభ్యసించుచు రావలెను. సమస్త పదార్థములయొక్క యథార్థ దర్శనము ( ఆత్మరూప దర్శనము ) చేతను, శరీరముయొక్క నాశనమును .గూర్చి విచారించుట చేతను వాసనలు చిత్తమున ప్రవర్తింపవు.

ఓ రామచంద్రా ! కాబట్టి నీవు నిరంతరము ఆత్మ విచారణ సల్పుము. ఆత్మజ్ఞాని యగు జీవన్ముక్తుడు సమచిత్తము గల్గి హర్ష శోకాది రహితుడై ద్వంద్వములకు లోబడక ఆత్మయందే సదా స్థితికల్గి ఎల్లపుడు మహదానందము గలవాడై యుండును. నీవున్ను అట్టి జీవన్ముక్త స్థితి నవలంబించి ప్రాప్తించిన కార్యములను ఫలాభిసంధి రహితముగ గావించుచు నిరతిశయానంద రూపమగు ఆత్మపదమున వెలయుము.

# 6.(1) నిర్వాణప్రకరణము (పూర్వార్ధము)

'ఓ రామచంద్రా! ఉపశమ ప్రకరణానంతరము నిర్వాణ ప్రదమగు నిర్వాణ ప్రకరణమును నీవు వినుము' అని వసిష్ఠ మునీంద్రుడు చెప్పుచుండ శ్రోతలందరును నిశ్చలముగ వినుచుండ సాయంకాల సూచకములగు మృదంగ శంఖాది రావములు మ్రోగగా నపుడు వసిష్ఠమునీంద్రుడు సభ విరమింప సభ్యులెల్లరు వారి వారి నివాసముల కరిగిరి. విశ్వామిత్రుడు వసిష్ఠునితో సహా వసిష్ఠాశ్రమము వఱకు సాగనంపి తిరిగి వెళ్ళెను, ఆ రాత్రి రామలక్ష్మణ శత్రుఘ్నులు మూడు జాములవఱకు వశిష్ఠ ప్రోక్తోపదేశమును గూర్చి చింతనజేసి పిదప సగము జాము కాలము విశ్రమించిరి. మరల ప్రాతఃకాలము సభ్యులెల్లరును సమావేశము కాగా వసిష్ఠమునీంద్రుడిట్లుపదేశించెను.

ఓ రామచంద్రా! వైరాగ్య అభ్యాస తత్త్వజ్ఞానముల ద్వారా సంసారము దాటబడును గావున వానిని నీవభ్యసింపుము. బ్రహ్మము జగద్రూపమున వర్తించు చున్నది. కావున నిక ద్వైతకల్పన యెచట? కాబట్టి నీవు దృశ్యభావనను వీడి అహంకారమును ద్యజించి ఆత్మ (బ్రహ్మ) స్వభావమును బాగుగ నెఱిగి ఆత్మయందే స్థితిగలవాడవై పూర్ణసుఖము నొందుము.

శ్రీ రామచంద్రుడు:- మహాత్మా! తమ వాక్యార్థవిచారణచే నేను పరమార్థము నెరిగితిని. సంశయములుడిగినవి. ఆత్మయందు స్థితి కలిగినది. అంతఃకరణమున పరమశాంతి నొందుచున్నాను. సర్వవ్యాపకమై పరబ్రహ్మ స్వరూపమైనట్టి నా యాత్మకు నమస్కారము.

శ్రీ వసిష్ఠుడు:- ఓ రామచంద్రా! ఈ దృశ్యజగత్తు సంసారము, అవిద్య (అజ్ఞానము) యొక్క విలాసమైయున్నది. బ్రహ్మ విష్ణ్వాదులున్ను అవిద్య యొక్క సత్త్వాంశస్వరూపులు, వారు జీవన్ముక్తులు. దేహస్థితి పర్యంతమువారు ప్రపంచమున నుండి దేహాంతమున విదేహముక్తులై పరబ్రహ్మమున నెలయుదురు. వాస్తవముగ ఈ స్థావరజంగమాత్మకమగు దృశ్య ప్రపంచమంతయును భూతరూపత్వ మును బొందకయే యున్నది. అజ్ఞానమువలననే ఈ దృశ్య మీవిధముగ గానుపించుచున్నది. జ్ఞానముచే

ద్విత్వకల్పనయే లేక బ్రహ్మము మాత్రమే శేషించి యున్నదగును. అవి కాలక్రమమున నంకురించి జన్మప్రదములై దుఃఖహేతువు లగును. కావున బుద్ధిపూర్వకముగ వాసనలను జ్ఞానముచే దగ్ధ మొనర్చుటయే మోక్ష హేతువులై యున్నవి. వాసనారహితులగు జీవన్ముక్తుల చిత్తము గొప్పసంకటము లందును, గొప్ప ఐశ్వర్యము లందును గూడ సమముగను, ప్రశాంతముగను నుండును.

ఓ రామచంద్రా ! నీవున్ను జనకాదులవలె నట్లే బ్రహ్మస్వరూపము నవలంబించి అసక్త బుద్ధిగలవాడవై దృశ్యసత్యత్వభావన లేక వర్తింపుము.

శ్రీరాముడు :- మహాత్మా ! నా అజ్ఞాన మిపుడు నిక్కముగ శమించినది. నేను ప్రబుద్ధుడనైతి. నేనిక మరల దుఃఖమెన్నటికిని బొందను. ఇక తాము చెప్పిన చొప్పున ఆచరించెదను. జ్ఞానము ద్వారా వాసనలు క్షయించుటచే నేను నిశ్చయముగ జీవన్ముక్త పదస్థితి జీవుల కెట్లగునో తెలుప ప్రార్థన.

శ్రీవసిష్ఠుడు:- చిత్తోపశమనమునకు ఆత్మజ్ఞానము, ప్రాణ నిరోధము ఉపాయములు. రెండును సమములే. మఱియు ఏకఫలమునే కలుగ జేయునవి. కాని కొందఱికి మొదటిది అసాధ్య మగును, మఱికొందఱికి రెండవది అసాధ్యము గను నుండును. నాకు మాత్రము జ్ఞాన నిశ్చయమే సుసాధ్యమైయున్నది. ఓ రామచంద్రా ! జ్ఞానమువలన ముక్తి ఎట్లు లభించునో పూర్వము వచించితిని, ఇపుడు ప్రాణనిరోధోపాయమును గూర్చి నీకు వచించెదను. వినుము.

## భుశుండోపాఖ్యానము

బ్రహ్మదేవుని సుతుడనగు నేనొకప్పుడు స్వర్గమున ఇంద్రసభ యందు నారదాది ఋషుల వలన చిరంజీవుల కథను వింటిని. అచట అక్కథా ప్రసంగమున శాతాతపుడను ముని - మేరుపర్వతము యొక్క ఈశాన్య కోణమున నున్న పద్మరాగ శిఖరముపై గల ఆమ్రకల్ప వృక్షముపై దక్షిణభాగమున గల పక్షుల స్థానమున భుశుండుడను కాకి గలడనియు, ఆతడు చిరంజీవి, రాగరహితుడు, త్రికాలజ్ఞుడు, ఆత్మ వేత్త యనియు

ఈ ప్రకారముగ ఆ భుశుండుని వృత్తాంతము రెండు మారులు ఉన్నది ఉన్నట్లు చెప్పగా, ఆ సభానంతరము నేనా మేరుపర్వతముపైకి జని ఈశాన్యభాగమున గల కల్ప వృక్షమున పెక్కు కాకుల మధ్య విలసిల్లుచున్న భుశుండుని యెదుట ఆకసమునుండి దిగగా అతడు లేచి సత్కరించి నన్నాసనముపై గూర్చుండబెట్టి యిట్లనెను – మునీంద్రా! తమ రాకచే మేము ధన్యులమైతిమి. మా ఆశ్రమము పవిత్రమైనది. తమ యాగమన కారణ మెఱిగి యున్నను తమ వాక్యామృతమును గ్రోల తలంపుగల మాకు తమ రేల ఇటకు వేంచేసిరో వచింప వేడెదము. అపుడు నేను భుశుండునితో 'మీరేకుల మందు జన్మించితిరి ? బ్రహ్మవేత్త లెట్లిరి? మీ అయు వెంత? ఏయే వృత్తాంతములు మీకు జ్ఞాపకమున్నవి? అని యడుగ భుశుండు డిట్లు పలికెను.

కైలాసవాసియు పార్వతీవల్లభుడునగు శంకరుని యొక్క మాతృగణము నందలి ముఖ్యులగు ఎనిమిదిమందిలో ఏడవదియగు 'అలంబుసకు' చండుడను కాకి వాహనమై యొప్పుచున్నది. ఒకపుడు అమాతృక లందరును గలిసి ఆకాశమున ఉత్సవమును సలిపిరి. మఱి తుంబురు భైరవులను బూజించి మదిరాపానముచే సంతుష్టులై నొక గోష్ఠి సల్పి, అందిట్లనుకొనిరి – 'ఉమానాథుడగు శివుడు మనల నేల అనాదర దృష్టితో చూచుచున్నాడు. మనము మన ప్రభావము నాతనికి జూపెదము. దానిచే నాతడు మనలనిక అనాదరింపకుండును' అని నిశ్చయించి పార్వతిని వశపరచుకొని మంత్రసహిత జలము నామెపై ప్రోక్షించి ఆమెను భక్ష్యపదార్థముగ జేసి ఆడుచు పాడుచు మహోత్సవము గావించుచుండ ఆ యుత్సవమున బ్రాహ్మీదేవియొక్క వాహనములైన ఏడు హంసలును, చండుడను కాకియు ఆకసమున నృత్యము సలిపిరి. అనంతరము ఆ యేడు హంసలును చండునితో సమాగమమునొంది గర్భవతులైరి. ఆ పిదప మాతృకలును హంసలును రుద్రునికడకేగి భక్ష్యరూపమున నున్న పార్వతిని అతనికి సమర్పింప ఆతడు వారిపై కృద్ధుడు కాగా అంతట వారు (తమ అవయవముల దానము ద్వారా) పార్వతిని సృజించి వివాహ మూలకముగా నాపెను శివునకొసంగ అందరు సంతుష్టులై వారి వారి స్థానముల కరిగిరి. హంసలు బ్రాహ్మీదేవికడకేగి జరిగిన వృత్తాంత మామెకు

చెప్పగా ఆమె గర్భవతులైనవారిని జూచి 'మీరిక వాహన కార్యమునకు సమర్థులు కాజాలరు. కావున మీ యిచ్చా పూర్వకముగ సంచరింపుడని వచించి నిర్వికల్ప సమాధి యందు సుఖముగ నుండెను. అంతట కాలక్రమమున ఆ హంసలు విష్ణునాభి కమల పల్లవములపై యిరువది యొక్క గ్రుడ్లను పెట్టగా, నవి పగిలి మేమిరువదియొక్క కాకులము జనించి బ్రాహ్మీదేవిని చాలకాలము ఆరాధింప ఆమె మాకు జ్ఞాన మొసంగుటచే ముక్తులమైతిమి. తదుపరి ఏకాంతమున ధ్యాన (సమాధి) యందుండ గోరి మేము వింధ్యపర్వతముపై గల మా తండ్రివద్ద కేగగా అతడు (చండుడు) 'పుత్రులారా! మీరు ముక్తిని బొంద గోరుచో దేవియగు అలంబుసను బ్రార్థింపుడు' అని చెప్ప మేము బ్రాహ్మీదేవి యనుగ్రహముచే మేము జ్ఞేయము (బ్రహ్మము)ను బూర్ణముగ నెఱింగితిమి, ఏకాంత స్థితికై ఇపుడు ఉత్తమ స్థానమును గోరు చున్నాము. అని విన్నవింప నాతడు మేరు పర్వతమున నున్న యీ గూటిని గూర్చి వచించి తానిద్దానిని పూర్వము నిర్మించి నిట దేవీ ధ్యాన మగ్నుడై యుండెనియు అటకేగి సుఖముగ నుండుడని తెలుప, మేము భగవతికిని, మా తండ్రికిని వందనము లర్పించి ఆకసమున నెగసి ఆ వృత్తాంతమును తల్లులగు హంసలకును, బ్రాహ్మీదేవికిని ఎఱింగించి వారి యనుమతిని బడసి యచ్చోటు కేతెంచి సుఖముగ వసించుచున్నాము.

మా సోదరులు కాలగర్భమున లీనమై శివపదము నొందిరి. మేము ఆత్మస్వభావ మాత్రముచే సంతుష్టులమై ఆత్మయందే తృప్తినొంది సాంసారిక భ్రమలచే మోహము నొందక ప్రశాంతముగ కాలక్షేపము చేయుచున్నాము. అనేక యుగములు కల్పములు గడచిపోవుటను నేను గాంచితిని. యుగాంతమందలి ప్రచండ వాయువులచేతను తదితర సమయములందును గూడ ఈ కల్పవృక్షము చలింపకయే యున్నది. కల్పాంతమున జగత్స్థితి విరమించు నపుడు నేనీ గూటిని వదలి ఆకాశముననే స్థితి కలిగి ద్వాదశాదిత్యులు తపింప జేయునపుడు 'నేను వరుణుడను' అను ధారణ కలిగియు ప్రచండవాయువు వీచునపుడు 'నేను పర్వతమును' అనుధారణ గలిగియు, జగత్తు సముద్ర రూపమగునపుడు వాయువును నేను అనుధారణ గలిగియునున్నవాడనై

తిరిగి యుగారంభమగు వరకు నిర్వికల్ప సమాధియందు ఆత్మ యందు ప్రశాంతముగ స్థితిగల్గి తదుపరి ఈ వృక్షముపైకి స్వస్థానమున కేతెంచుదును. పరమేశ్వరుని నియతిచే నేను ప్రతికల్పమున నిట్లు ధారణాదులు నవలంబించి చిరంజీవియై యున్నాను. నాసంకల్పముచేతనే ప్రతికల్పమందు ఈ పర్వతముపై నీ శిఖరమున ఈ కల్పవృక్షము ఉదయించు చుండును. ఓ మునీంద్రా! నాయీ గడచిన జీవిత కాలమున నేనెన్నియో సృష్టులను, ప్రళయములను, విచిత్ర ఘటనలను, ఆశ్చర్యకరమైన దృశ్యములను గాంచితిని. ఈ సృష్టులందలి ఎందరో మహర్షులు, దేవతలు, రాజులు ఇపుడు నాస్మృతి పథమున గలరు. బ్రహ్మదేవుని పుత్రుడవగు నీకిది యెనిమిదవ జన్మము. ఎనిమిది కల్పములందు (లేక జన్మలందు) నీవు నన్ను గలిసికొనినట్లు నాకు జ్ఞాపకముగలదు.

వ్యాస వాల్మీకాది మహర్షులు యుగయుగమునను మహాభారత రామాయణాది గ్రంథముల రచించుట జ్ఞప్తికి గలదు. రామాయణమను వేలాది శ్లోకములుగల జ్ఞానశాస్త్రమును వాల్మీకి రచించి యుండుట స్మృతియందుగలదు. పూర్వకల్పములందు విస్మృతమగుటచే మరల వాసిష్ఠ రామాయణమను జ్ఞానశాస్త్రమును అతడు పండ్రెండవ మారు రచించును. అట్లే వ్యాసులవారు భారతమును ఏడవ మారు రచించును. ప్రతి మన్వంతరమున జగత్క్రమము విపర్యయమునొంద నాకు క్రొత్త మిత్రులు క్రొత్తబంధువులు క్రొత్త భృత్యులు క్రొత్తనివాసస్థానములు ఏర్పడుచుండును. ఒకపుడు వింధ్యాచలమున ఒకపుడు హిమాల యమున, ఒకపుడు మలయాచలమున, ఒకపుడు ఈమేరు పర్వతమున గూటిని నిర్మించుకొని యుందును.

వాసనలు లేనివానిని, చింతలు నశించినవానిని, వివేకయుక్తుని, బ్రహ్మపదమున విశ్రాంతి నొందిన, వానిని చంచలమనంబులేని వానిని, సమాహిత చిత్తుని మృత్యువు బాధింపదు. ఆత్మప్రాప్తి కార్యముననే మనుజులు తమ చిత్తమును నియోగింప వలయును. ముల్లోకము లందును ఈ సమస్తజగత్తునందును ఆత్మతప్ప మఱి ఉత్తమమైనదియు విశ్రాంతి దాయకమునగు వస్తు వేదియునులేదు. ఆత్మదృష్టి యొకటియే

సంసార భయమును నశింపజేయునది. ఆత్మచింతన యను దాని సఖులలో నొకటియగు ప్రాణచింతనను నేనాశ్రయించితిని, పూరక కుంభక రేచకాది రూప ప్రాణాయామాదుల యొక్క సంధిరూపమైన చిద్రూప పరమాత్మయందు స్థితిగలిగి యుండుట ముక్తి హేతువగును. అట్టి ప్రాణాపాన సంధిరూపమగు పరమాత్మనే నేనుపాసించుచున్నాను. ప్రాణసమాధిద్వారా నేను నిర్మలమగు ఆత్మయందు చిత్త విశ్రాంతి నొందితిని. ఇట్టి దృష్టి నవలంబించి నేనాత్మయందు నిరంతరము స్థితి కలిగి యుండుటచే ఈ జగత్థితులందు విక్షేపరహితుడనై సమబుద్ధి గలిగి ఆనందముగ వెలయుచున్నాను.

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ తన వృత్తాంతమంతయు తెలియజేసిన అమ్మహాత్ముడగు భుశుండుని నేను కొనియాడి అటనుండి బయలుదేఱి సప్తర్షి మండలమునకు బోవుచుండ ఆ భుశుండుడు స్నేహవశమున నావెంట చాలా దూరము వఱకు రాగా నేను చేయి పట్టుకొని యెట్లో అతనిని తిరిగి పంపివేయ కష్టముతో నాతడు వెనుకకు మరలెను. పిదప నేను సప్తర్షిలోకమును జేరితిని. పూర్వము కృతయుగాదియందు రెండు వందల సంవత్సరములైన తదుపరి నేను భుశుండునితో నట గలిసితిని. మఱల నేటికి యెనిమిదివత్సరముల క్రితము మఱియొక పర్యాయము మేరు పర్వతముపై భుశుండుని నేను గలసి కొంటిని.

శ్రీవాల్మీకి :- ఈ ప్రకారమగు భుశుండుని కథను ఏ విమలమతి విచారించునో ఆతడు భయవ్యాప్తమగు సంసార నదిని దాటివేయును. ఓ రామచంద్రా! ఇట్లు నిరంతరాభ్యాసముచే నుత్పన్నమైన జ్ఞాన యోగములచే భుశుండుడే రీతి పొందదగిన వస్తువు (ఆత్మ) బొందెనో నీవున్ను ఆరీతి పొందుము. సంసారమున అసక్తబుద్ధిగలవారునునగు జనులు భుశుండుని పగిది పరబ్రహ్మమున స్థితిగల వారగుదురు.

శ్రీరాముడు :- మహాత్మా ! ఈ శరీరరూప గృహము నెవరు నిర్మించిరి? ఇది ఎట్లు స్థితినొందియున్నది? దీనియందెవరు వసించు చున్నారు.

శ్రీవసిష్ఠుడు:- ఓ రామచంద్రా ! రక్తమాంసాదిమయమగు ఈ శరీరమును ఎవరును నిర్మింపలేదు. ఇది యంతయు స్వప్నమువలె ఆభాసమాత్రమే అయియున్నది. స్వప్న మనో రాజ్యాదులందువలె ప్రతిభాసకాలమందు మాత్ర మీ దేహము సత్యముగ తోచును. తదితర కాలము లందు అసత్యమైయున్నది. ఈ ప్రపంచము దీర్ఘస్వప్నమువలె దీర్ఘమనోరాజ్యము వంటిది. మనుజుడు తన మనోరాజ్యమందలి వ్యాఘ్రాదులచే నెట్లు భీతినొందడో అట్లే సంకల్పకల్పితమగు ఈ జగత్పదార్థములందు భయమేల? చిత్ప్రకాశము కంటె వేఱైనదేదియు లేదు అనునదియే సమ్యక్జ్ఞానము. కాబట్టి అజ్ఞాన నిద్రనుండి మేలుకొని ఆభాస మాత్రమును, అసత్యమునునగు ఈ దృశ్య ప్రపంచమునంతయు వీడి సద్రూపమగు ఆత్మనే ఆశ్రయించి ఆత్మయందే స్థితిగల్గి పరమానందము నొందుము.

ఈ ప్రకారమగు బోధను రామచంద్రుడు విని స్వాత్మయందు విశ్రాంతినొంద ఆతని ఆత్మవిశ్రాంతికి స్థిరత్వమును గలుగజేయుట కొఱకై వసిష్ఠమునీంద్రుడు తన బోధను కొంతసేపు నిలిపెను. ఒక ఘడియ కాలమైన పిదప వసిష్ఠుడు రామచంద్రుని సమాధినుండి మేలుకొలిపి మరల యిట్లు బోధింపనారంభించెను -

ఓ రామచంద్రా! పైన దెల్పిన విధమున ఆత్మయందు స్థితుడవై జగత్తు సత్యమను విశ్వాసమును వీడి పురుషప్రయత్నముచే ఈ సంసార చక్రముయొక్క నాభియైన సంకల్పము (చిత్తము)ను రహిత మొనర్పుము. నీవు సర్వ వ్యాపియు, సర్వజ్ఞుడునునగు ఆత్మవేకాని, మనస్సు దేహాదులుకాదు. పరమార్థమున ఈ సమస్త స్థూలసూక్ష్మ ప్రపంచము ఆత్మకంటె భిన్నముకాదు. ఇవ్విషయమున సాక్షాత్ పరమశివుడు నాకుపదేశించిన సంసారదుఃఖప్రశమనకరమగు బోధను వినుము.

## శివపూజోపాఖ్యానము

ఓ రామచంద్రా ! పూర్వమొకపుడు నేను పార్వతీపరమేశ్వరుల నివాసస్థల మగు కైలాస పర్వతముపై గంగాతటమున ఆశ్రమమును

నిర్మించుకొని శివపూజా తత్పరుడనైయుంటిని. ఒకనాడు రాత్రి మొదటిజాము సగము గడచిన పిమ్మట నేను సమాధిని విరమించి దృష్టిని బాహ్యమున బ్రసరింప నచట గొప్ప ప్రకాశము కనిపించెను. అదియేమియని చూచుచుండ నింతలో శివుడు పార్వతీ సమేతుడై పరివార సహితముగ నా శిఖరమున కేతించినట్లు కనుగొంటిని. అపుడు నే నమ్మహాదేవుని సమీపించి, ఆ పార్వతీ పరమేశ్వరులను భక్తితో బూజింప నంతట శివుడిట్లు ప్రశ్నించెను.

శివుడు:- మునీంద్రా! నీ తపము నిర్విఘ్నముగ జరుగుచున్నదా? నీవు బ్రహ్మపదమున స్థితిని బొందితివా? అపుడునే నిట్లంటిని:- ప్రభూ! మహాదేవుని స్మరణముచే ప్రాణులకు బొందరాని పదార్థమెద్దియును లేదు. తమ్మున్మరించి ఆనందించు ప్రాణులు ధన్యులు, వారుండు స్థలము ధన్యము. తమ స్మరణమను చింతామణిని ధరించుటచే నా సమస్తాపదలు నశించినవి. మహాత్మా! నాయీ సంశయమును భేదింపవేడెద. సర్వపాపక్షయకరమును. సర్వవిఘ్నవికార రహితమునగు దేవార్చన యేదియో సెలవిండు?

శివుడు:- మునీంద్రా! దేవుడన బ్రహ్మకాదు, విష్ణువుకాదు, శివుడుకాదు, సూర్యచంద్రాదులునుగారు. సచ్చిదానంద రూపమగు ఆత్మయే దేవుడు. అట్టి చిద్రూప ఆత్మ తత్త్వము నెఱుంగని వాని కొఱకు విష్ణ్వాద్యాకార పూజనము మొనర్పబడినది. ఆత్మ పూజనముచే ఆత్మసాక్షాత్కారమను అకృత్రిమ ఫలము లభించును. అట్టి ఆత్మను శమ జ్ఞానాది పుష్పములచే నర్పించవలెను. ఆత్మపూజను త్యజించి ఇతర పూజల నన్వేషించువాడు, కల్పవృక్షమును ద్యజించి కంటక వృక్షముల నాశ్రయించువాడే యగును.

మునీంద్రా! ఈ జగత్తంతయు పరమాత్మ స్వరూపమే అయియున్నది. ఆ పరమాత్మయే దేవదేవుడు. అతనినే శమజ్ఞానాదులచే పూజించవలయును. ధూపదీపాదులచే గావించు దేవపూజ సామాన్యుల కొఱకే చెప్పబడినదగును. మునీంద్రా! ఆత్మరూపమగు చైతన్యమున కన్యమైనది యెద్దియునులేదు. బ్రహ్మ విష్ణు శివాదులకున్ను ఆ పరమాత్మ

తండ్రి. అట్టి ఆత్మ నెఱింగినవాడు, మఱల ఈ సంసారమున జనింపడు, జ్ఞానము చేతనే ఆ యాత్మ పూజింపబడును.

అఖండ సాక్షాత్కార వృత్తిరూపమగు ఆత్మజ్ఞానము కలిగియుండుటయే పరమ ధ్యానము, అదియే ఆత్మరూపభగవంతుని పరమ పూజ. నడచుచున్నను, కూర్చొనియున్నను, చూచుచున్నను, వినుచున్నను సర్వకాలము లందును ఆత్మమయుడై యుండవలెను. సంకల్పములను వాసనలను పారద్రోలవలెను. ఆత్మయొక్క స్వల్పకాల ధ్యానముచేతనే యెన్నియోవేల యజ్ఞములు చేసిన ఫలము లభించును. కాబట్టి యథాప్రాప్తములగు పదార్థములను గ్రహించుచు సుఖ దుఃఖము లందు నిర్వికారుడై సమదృష్టి గలిగి ఆత్మను (జ్ఞానముద్వారా) నిరంతరము అర్చించవలయును. ఈ ప్రకార ముపదేశించి అమ్మహా దేవుడు తన యభిమత స్థానమునకు వెడలిపోయెను. రామచంద్రా! అప్పటినుండి నేటివరకును నేనా ఆత్మపూజనే చేయుచు చింతారహితుడనై యుంటిని. మఱియు అట్టి ఆత్మ పూజ గావించువాడు వ్యవహారమగ్నుడై యున్నను భేదవర్జితుడైయే యుండును. ఆపదలందును మహా దుఃఖములు సంప్రాప్తించినపుడును నీవిట్టి ఆత్మదృష్టియే అవలంబించి విచారించుము. ఈ సాంసారిక పదార్థములు నశ్వరములైనవి. కావున వానికై విషాదము నొందవలదు. శాశ్వతమై స్థిరమై ఆనందదాయకమైనట్టి ఆత్మనే అన్వేషించి అట్టి ఆత్మయందే స్థితి గలిగి దుఃఖరహితుడవై యుండుము. చిత్తము (వాసనా త్యాగము చేతను, జ్ఞానము జేతను లేక ప్రాణనిరోధము చేతను) అచిత్తత్వ దశ నొందుటయే పరమోత్తమ పదము (మోక్షము); అనంతమై, శాశ్వతమై, నాశరహితమై, నిర్వికారమైనట్టి బిల్వ ఫలమున ఈ బ్రహ్మాండము లన్నియు మజ్జవలె స్థితి నొందియున్నవి. మఱియును పరమాత్మయను మహాశిలయందు ఈ జగంబులు రేఖలు చందనమున వర్తించుచున్నవి, అవి అధిష్ఠానదృష్టియం దా పరబ్రహ్మమున కన్న వేఱుగాకయు దృశ్య (ఆరోప) దృష్టిచే కల్పితములైయు యున్నవి. అసత్యమున్ను, అవస్తువున్ను నగుటచే ఈ దృశ్యప్రపంచము దీర్ఘస్వప్నమేయని ఎఱుగుము.

ఓ రామచంద్రా! ఇక నిపుడు శ్రీకృష్ణునిచే అర్జునునకుపదేశింప బడిన అసంసక్తి వలన గలుగు శుభగతిని గూర్చి వినుము :-

## అర్జునోపాఖ్యానము

భగవంతుడగు యముడు ప్రతి చతుర్యుగమున కొంత కాలమైన వెనుక ప్రాణులకు తానొసంగు బాధయందు పాపమును గూర్చిన ఆశంకచే నొకప్పుడు అయిదు లేక ఏడు లేక ఎనిమిది లేక పది లేక పండ్రెండు లేక పదునాఱువత్సరములు తపస్సు చేయును. అత్తఱి మృత్యువు ఏ ప్రాణిని వధింపదు. అపుడు భూతలము అధిక ప్రాణులచే వ్యాప్తమై సంచారము నకు అయోగ్యమగును. ఆ సమయమున భూభార నివృత్తికొఱకు అధర్మ ప్రవర్తకులగు ప్రాణులను (రామకృష్ణాది) దేవతలు అనేకయుక్తులచే నశింపజేయుదురు. ఇపుడు యమ పదము నధిష్ఠించియున్న వైవస్వతుడు కొంతకాలమునకు అట్లే తపస్సు చేయబోవునపుడు భూతలము మృత్యురహిత ప్రాణులచే వ్యాప్తము కాగా భూదేవి భార నివృత్తికొఱకు విష్ణువును శరణుబొందును. అపుడు విష్ణువు నరనారాయణుల అనుచరులగు సమస్త దేవతలతో గూడ రెండు దేహములతో నీభూమిపై నవతరించును. అందొకటి వసుదేవుని పుత్రుడగు వాసుదేవుడుగను, మఱి యొకటి పాండు తనయుడగు అర్జునుడుగను ప్రసిద్ధికెక్కును. అపుడు కౌరవ పాండవులకు యద్ధము సంభవింప విష్ణువు ద్వారా కౌరవులను నశింపజేసి భూభారము నడంచును. ఆయుద్ధసమ యమున అర్జునుడు శోకయుక్తుడు కాగా తత్సంగ్రామ సిద్ధికొఱకై అపుడు కృష్ణపరమాత్మ ఆతనికి ఆత్మజ్ఞానమును నివ్విధమున బోధించును -

ఓ అర్జునా, ఆత్మపుట్టునదీకాదు, నశించునదికాదు. అది నాశరహితము, శాశ్వతము, నిర్వికారము, అట్టి ఆత్మయేనీవు. నీవు వధించువాడవు కాదు; వధించు దేహేంద్రియాది సంఘాతము నేనను అభిమానమును సర్వదా వీడి జరామరణ రహితమగుశాశ్వత ఆత్మయే నీవని భావింపుము. యుద్ధము నుండి పరుగిడిపోవుట క్షాత్రధర్మము కాదు. క్షత్రియులకు యుద్ధము సహజధర్మము, కార్యము యొక్క సిద్ధి అసిద్ధులయందు సమబుద్ధిగలిగి అసంగమగు ఆత్మయందు స్థితిగలిగి

యున్నవాడవై యథాప్రాప్తములగు కర్మములను నిస్సంగముగ నాచరించుము. అపుడు పాపము ఏమాత్రము నిన్నంటదు. సమస్త సంకల్పములను ద్యజించి సమశాంతచిత్తుడవై శేషించు ఆత్మయందు స్థిరబుద్ధి కలిగియుండుము. సంకల్పములన్నియు శమింప మనుజుని యొక్క వాసనారహితమగు చిన్మాత్రము యొక్క స్వరూప మేదిగలదో అదియే పరబ్రహ్మము. సామాన్యరూపము, పరరూపము అను రెండు రూపములు నాకు గలవు. శంఖ చక్ర గదాదియుక్తమగునది సామాన్యము. అద్యంత రహిత నిర్వికార చిద్రూప ఆత్మపరము. ఆత్మబోధ నీకు కలుగనంతపఱకు సామాన్యరూపమును భజించుము. ఆత్మజ్ఞాన ప్రాప్త్యనంతరము నా పర రూపమును నీవెఱుంగ గలవు. అద్దానిని బొందినజీవుడు మరల ఈ సంసారమున జనింపడు. జగత్తుయొక్క సత్యత్వబుద్ధిని ఆత్మయొక్క అసత్యత్వ బుద్ధిని వదలి తుచ్ఛమగు మనస్సును గూడ త్యజించి శేషించు ఆత్మయందు స్థితి గలిగియుండును. అనాది కాలాభ్యాసముచే ప్రౌఢమైనట్టి వాసనయే ఈ సంసార భ్రమనుగలుగజేయుచున్నది, కాబట్టి తత్త్వజ్ఞానాభ్యాసముచే వాసనను సమూలముగ నశింపజేసి శ్రేయమునొందుము. అనాత్మ రూపములగు దేహాదులందలి ఆత్మభావనారూపమగు ఈ వాసన ఆత్మజ్ఞానమను మహాబోధచే నశించుచున్నది. ఓ యర్జునా - నీవు పవిత్రమగు ఆత్మవు. దేహాదులు నీవుకావు. కావున వీనియందలి అహంభావ మమకార రూపమగువాసనను వీడి జీవన్ముక్తుడవై యథా ప్రాప్తములగు కార్యము లను అసంగబుద్ధితో నాచరింపుము. ఎవరి హృదయమున ఆత్మజ్ఞానమను అగ్నిప్రజ్వలించుచుండునో అతని యందిక వాసనారూపబీజముదగ్ధమై మరల యెన్నటికిని నంకురింపదు. అట్టి వాడిక జలమందు కమలపత్రమువలె సుఖ దుఃఖాదులందు మునుంగడు. ఈ ప్రకారముగ భగవంతుడుపదేశింప నపుడు అర్జునునకు ఆత్మజ్ఞానోదయమై సంశయములు క్షయింప భగద్వాక్యానుసారము కార్యసన్నద్ధుడగును.

ఓ రామచంద్రా! నీవున్ను ఇట్టి దృష్టి నవలంబించి అసంగమగు ఆత్మయందు స్థితిగలవాడవై యథాప్రాప్తములగు కార్యములను నిస్సంగబుద్ధితో నాచరింపుము, ఈ జగత్తుస్వప్నతుల్యమైనది. ఇట్టి సృష్టి

రూపస్వప్నమున సంభవింపనిది యెద్దియును లేదు. అజ్ఞుడగు జీవుడు ఈ సంసార స్వప్నమున ఒక భ్రమనుండి ఇంకొక భ్రమయందును బ్రవేశించుచు మోహితుడగుచున్నాడు.

ఈ సందర్భమున నొక భిక్షుకుని వృత్తాంతమును వచించెద; వినుము.

## జీవటోపాఖ్యానము

సమాధ్యభ్యాస తత్పరుడగు నొక భిక్షుకుడుండెను. సమాధ్యభ్యాసముచే శుద్ధమగు అతని చిత్తముదేనిని చింతనచేయుచుండెనో తద్రూపమును శీఘ్రముగ బొందు చుండెను. ఒకనాడాతడు సమాధి నుండి విరతుడై తనయాసనముపై గూరుచుండి ఏకాగ్ర చిత్తముతో దేనినో చింతనజేయుచు వినోదము కొఱకు నేనొక సామాన్య మానవుని వృత్తిని భావించెదను; అని తలంచెను. వెంటనే యాతడు జీవటుడను సామాన్య మానవునిగా తన్నుదలంచుకొనెను. ఆ జీవటుడు నిద్రయందు తన్ను వేదాధ్యయన యుతుడగు బ్రాహ్మణునిగను, ఆ బ్రాహ్మణుడు నిద్రయందు తన్ను రాజుగను, ఆ రాజు స్వప్నమున తను అప్సరసగను అట్లే ఆ యప్సరస నిద్రయందు తన్ను ఆడుజింకగను, ఆ జింక నిద్రయందు తన్ను లతగను, ఆ లత నిద్ర యందు తుమ్మెదగను, ఆ తుమ్మెద మరణకాలమున తన్నుహంసగను, ఆ హంస (అనేకజన్మ లందు తిరుగాడి తుదకు ఒకానొక హంస జన్మయందు) మరణకాలమున తన్ను దలంచుకొని ఆ యా రూపములనే బొందెను. బ్రహ్మదేవుని వాహనమగు హంసగా నున్నపుడు ఆ బ్రహ్మదేవుని వలన వివేక వైరాగ్య జ్ఞానాదుల నొంది జీవన్ముక్తుడై యుండెను. అట్లు బ్రహ్మదేవుని వాహనమగు హంసరూప మునున్నపు డాతడొకపుడు బ్రహ్మదేవునితో గూడ రుద్రపుర మున కేగి అట రుద్రునిగాంచి 'నేను రుద్రుడను' అను బుద్ధి కలుగ తన హంసరూపమున త్యజించి రుద్రుడాయెను. ఆ రుద్రుడు సర్వోత్తమ జ్ఞానయుక్తుడై మెలగుచు తన పూర్వకాలిక వృత్తామంత మంతయును స్మరించి యిట్లనుకొనెను. ఆహా! ఈ మాయ యెంత విచిత్రమైనది - అసత్యమైనను సత్యమువలె భాసించు చున్నదే - మనః కల్పితమగు ఈ సంసార సంభ్రమమున ఆయా బ్రాహ్మణ రాజ అప్సరసాది భావనలచే

ఆయా నూఱు జన్మలను ధరించి ఆ భిక్షుకుడనే యగు నేనిపుడు రుద్రుడనై వెలయుచున్నాను. ఇదియంతయు భావనావశము నను అనాత్మవస్తువుయొక్క చింతన చేతన ఏర్పడినది. విచారణచేతను, ఆత్మవస్తు చింతనచేతను ఈ దృశ్యమంతయు మిథ్యయను భావన దృఢపడగా అయ్యది విలీనమై పోవుచున్నది. ఈ జగదాకారము తత్త్వజ్ఞానముచే బాధితమైనందు వలన ప్రాతిభాసిక రూపమున నియ్యది స్థితి గలిగియున్నను దానిచే నేమియు హానిలేదు. అది వినోదము కొఱకే యగును. కావున నేనిపుడాయాబ్రాహ్మణాదుల సంసారము లందు ప్రవేశించి వారలను ప్రబుద్ధుల జేసెదను, అని నిశ్చయించి ఆ రుద్రుడు నిద్రించుచున్నట్టియు ఆయా భిక్షుక బ్రాహ్మణాదులందరిని తన జ్ఞాన తేజముచే ప్రబుద్ధుల జేయ, వారందరును రుద్ర తేజముచే జ్ఞానసంపన్నులై రుద్రరూపులై రుద్రుని యాజ్ఞచే వారి వారి సంసారములందు కొంతకాలము భోగముల ననుభవించి మరల రుద్రలోకమును జేరి ఉత్తమ గణములై కల్పాంతమున రుద్రునితో సహా విదేహముక్తులై వెలయుదురు.

అంతట శ్రీరాముడు వసిష్ఠుని ఆ జీవటాది రూపముల బొందిన భిక్షుకుడిపు డెచటనైన యున్నాడా లేడా యని ప్రశ్నింప నాటిరాత్రి సమాధియందు ముల్లోకములను గాంచి మరునా డా విషయమును తెలియజేసెదనని అమ్మునీంద్రుడు వచింప నింతలో మాధ్యాహ్నకాలిక డిండిమశబ్దములు మ్రోగగా సభ విరమింపబడెను. మరునాడు ప్రాతః కాలమున సభ్యులెల్లరును సమావేశమైన పిదప వసిష్ఠుడు శ్రీరామచంద్రు నకు గతరాత్రి సమాధియందలి తన యనుభవము నిట్లు వివరించి చెప్పెను - ఓ రామచంద్రా! గతరాత్రి సమాధియందు ధ్యాననేత్రముచే నేను భిక్షుకుని వెతకుచు, ఈతడు మనో రాజ్యమునకు బయట ఎట్లుండును 'అను తలంపు భూమిపై వెతకుచుండ రాత్రి రెండు భాగములు గడచిన మీదట, మూడవభాగమున ఉత్తర దిశయందు జినమను జనపదమున దీర్ఘదృష్టియను నొక భిక్షుకుడు తన కుటీరమున సమాధి యుండుట గాంచితిని. అతడు సమాధి యందు బ్రవేశించి నేటికి ఇరువదియొక్క రాత్రులు గడచినవి. నేడాతడు తన దేహమువీడి విదేహకైవల్యము నొందును. ఆ 21 దినములలో అతడు వేలకొలది

వత్సరముల కాలము ననుభవించెను. పూర్వమొకానొక కల్పమున అట్టి భిక్షుకుడుం డియుండెను. ఈతడు రెండవవాడు. నేను వినోదమునకు ఇతర సృష్టులను బరికింప నట అట్టివాడేయగు మూడవ భిక్షుకుడు లభించెను. ఈ ప్రకారముగ సృష్టి సమూహములందు భిక్షుకాద్యనేక పదార్థములు సమానముగనే యుండును. ఇపుడీ సభయందున్న నారదాది ముని బ్రాహ్మణాదులున్ను ఇట్టివియు లేక అన్యములునునగు జ్ఞానకర్మలతో గూడి మరల మరల యుద్భవించుదురు.

అంతట దశరథుడు కొందఱు మనుజులను బంపి భిక్షుకుని సమాధినుండి మేలుకొలుపనెంచ వసిష్ఠుడు అతడు దేహమును వీడి విదేహముక్తినొంద అతని స్థూలశరీరము ప్రాణరహిత మాయెననియు, మాసాంతమున అద్దానిని భక్తాదుల జలమునవైచి పూజాదుల కొఱకై ప్రతిరూపమగు అన్యభిక్షుకుని స్థాపించుదు రనియు దశరథునితో చెప్పెను.

ఈ ప్రకారము జగత్కార్యారంభకమైన ఈ గుణమయమగు అజ్ఞానముచే దుర్భేద్యమును సత్యఆత్మజ్ఞానముచే సులభముగ జయింప బడునదియునై యున్నది. ఓ రామచంద్రా! నీవు సుషుప్తమౌనివై చిత్తవిలాసమును త్యజించి, కల్పనారహితుడవై పరమాత్మ పదము మాశ్రయించి యుండుము. మౌనము వాఙ్మౌనము, ఇంద్రియ మౌనము, కాష్ఠ మౌనము, సుషుప్త మౌనము అని నాలుగు విధములు. అందు సుషుప్తమౌనము అన్నిటికంటె నుత్తమమైనది. ఈ జగత్తుయొక్క యథార్థ మెఱింగి వికల్పరహితుడై అనాది అనంతమగు ఆత్మయందు సదా స్థితి కలిగియుండుట తురీయ పదము యొక్కయు, జీవన్ముక్తుల యొక్కయు లక్షణము. ఏకతత్త్వ (ఆత్మ), దృఢాభ్యాసము, ప్రాణ విలయము, మనోనిగ్రహము, మోక్షప్రాప్తికి నుపాయములు. జ్ఞానము ఏకతత్త్వ దృఢాభ్యాసముచే సమస్త పదార్థముల యొక్క అస్తిత్వమును, బాగుగా నుదయింప ద్వైతవాసన బాధితముకాగా దానిచే వాసనలు క్షయింప తద్ద్వారా మనస్సు, ప్రాణము నిగ్రహింపబడును. చిత్తము వాసనామాత్రమే. వాసనారాహిత్యమే పరమ (మోక్ష) పదము. ఏకతత్త్వ (ఆత్మ) దృఢాభ్యాసము, ప్రాణ నిరోధము, మనోనాశము ఈ మూటిలో

నొకటి సిద్ధింప పరస్పరము మూడును సిద్ధించును. ఓ రామచంద్రా! (ఆత్మ విచారణ చేతనే చిత్తము అచితత్త్వదశ నొంద అవిద్య క్షయించును. ఇదియే మోక్షపదము. ఈ సంసారస్వప్న భ్రాంతి సందర్భమున పూర్వము బేతాళునిచే వచింపబడిన ప్రశ్నలను వినుము :-

## బేతాళోపాఖ్యానము

వింధ్యాచల మహారణ్యమున విశాలాకారముగల నొక బేతాళుడు వసించుచుండెను. వధ్యులగు అజ్ఞజనుల నిమిత్తమది అచటి కిరాతాది రాజ్యములకేగి అచటిరాజొసగువధ్యజీవుల భుజించి సుఖముగనుండెను. ఒకసారి అతనికి వధ్య (అజ్ఞ) జీవులు లభింపమి ఆకలిచే నొక నగరమున కేగ అటరాత్రికాలమున దుష్టనిగ్రహార్థము బయలువెడలిన ఆదేశపు రాజునుగాంచి అన్యాయముగ తన్ను వధింపననియు తాను వచించు ప్రశ్నలకు సమాధాన మొసంగవలె ననియు చెప్ప, రాజు అట్లే యనగా బేతాళుడు ఏసూర్యుని కిరణములందీ బ్రహ్మాండములు అల్ప రేణువులు? ఏది అనేక స్వప్నములను బొందుచును, వీడుచును తన నిర్మల ప్రకాశరూపమును త్యజింపకుండును? ఈ ప్రకారముగ నైదు ప్రశ్నలడుగ రాజు వానియన్నింటికినీ సరియైన సమాధానము చెప్పుచు తాను ప్రశ్నించినది కేవలము చిత్స్వరూపమగు ఆత్మయేయని వాక్రుచ్చెను. అది విని, బేతాళుడు సంతసించి రాజును తత్త్వజ్ఞునిగ గ్రహించి వదలివేసి ఆత్మచింతనచేయుచు ఆకలిని మరచి సమాధిస్థుడాయెను.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ఈ జగత్తంతయు చిద్రూపాత్మయందు స్థితిగలిగియున్నది. ఈ జగత్తు విచారణచే విలీనమై పోవుచున్నది. అపుడు శేషించునదియే ఆత్మపదము. నీవట్టి ఆత్మయందు స్థితిగలిగియుండుము. అట్టిచో భగీరథునకువలె దుస్సాధమైన కార్యములున్ను సిద్ధించును. ఎట్లన -

## భగీరథోపాఖ్యానము

ఈ కోసల దేశమున పూర్వము భగీరథుడను పరమధార్మికుడైన రాజుండెను. ఆతడు దానపరుడును మిగులపరాక్రమశాలియునై యుండెను. ఒకపుడు ఈ సంసారస్థితిని గూర్చి విచారించుచుండ ఆతనికి ఉత్తమ వైరాగ్యమంకురించెను. ఏకాంతమున నాతడు ''మరల మరల అవియే కర్మల జేయుచున్నాను. మరల మరల అవియే భోగముల ననుభవించుచున్నాను. కాని పరపురుషార్థమిందేమియు గానరాదు. దేనిని బొందినచో నిక బొందవలసిన దేదియు మిగిలి యుండదో దానిని బొందుటయే ఉత్తమ కర్మయని తలంచుచున్నాను.'' అని చింతనజేసి తన గురువగు త్రితలుని కడకేగి 'మహాత్మా! జనన మరణరూపమగు ఈ సంసారము యొక్క దుఃఖమెట్లు అంతమగునని ప్రశ్నింప ఆతడు 'జ్ఞేయమును బొందినచో నశించును. ఆ జ్ఞేయమే ఆత్మ. అమానిత్వము, అసక్తి, ఏకాంత వాసము నిరంతర అధ్యాత్మజ్ఞాన సంపాదనము, సర్వభూతదయ ఇత్యాది సుగుణరూపమైన జ్ఞానముద్వారా జ్ఞేయమగు ఆత్మ పొందబడును. 'నేనురాజున'ను అహంభావమును వీడి రాజ్యమును శత్రువుల కొప్పగించి వారివద్ద భిక్షాటనము చేయుము. అపుడు దేహాదులందలి అభిమాన అహంకార మమత్వాదులు నశించును. విషయభోగభావననువీడుము. ఈ ప్రకారముగ అహంకారాదులు నశింప శేషించు చిన్మాత్ర వస్తువు నీవే అయి యున్నావు. అదియే సంసారదుఃఖ రహితమగు పరమాత్మ పదము.

ఈ ప్రకారముగ త్రితలుడు బోధింప భగీరథుడంత మూడు దినములలో తన ధనాది సర్వస్వము త్యజించి రాజ్యమును శత్రువుల కొసంగి కౌపీన మాత్రముతో బయలుదేఱి తన్నెవరును తెలిసికొన జాలనట్టి గ్రామ అరణ్యాదులందు వసించుచు సర్వ అభిలాషా రహితుడై ఆత్మయందు పరమ విశ్రాంతిని బడసెను. అట్లాతడు భూమండలమున సంచరించుచుండ ఒకపుడు అకస్మికముగ తన నగరమును చేర అట మంత్ర్యాదులవద్ద భిక్షాటనముచేసెను. అచటి నగరనివాసులు,

మంత్రులు అతడు భగీరథుడని గుర్తించి పూజించి రాజ్యమును గైకొనుమని ప్రార్థించినను ఆ రాజ్యాది వస్తువు లందు అదరము లేనివాడై అట కొన్నాళ్లుండి తిరిగి మఱియొక చోటికి వెడలిపోయెను. నగర వాసులు శోకిల్లిరి. తదుపరి ఒక సమయమున అతడు తన గురువగు త్రితలుని కలిసి కొన వారిరువురును కొంతకాలము పర్వత వన గ్రామాదులందు వసించిరి. అట్లు జీవన్ముక్తులగు వారిద్దరును బ్రహ్మానందమగ్నులై యథాప్రాప్తములగు కార్యముల జేయుచు ధనాద్యైశ్వర్యములను తృణమువలె త్యజించుచు సుఖముగ నుండిరి.

పిమ్మట ఒకపుడొకానొక రాజ్యమున పుత్రరహితుడై రాజు మరణింప ప్రజాగణము రాజు నన్వేషించుచు భిక్షాటనము చేయుచున్న భగీరథుని సమర్థునిగ నెంచి అతనిని రాజుగ జేసిరి. అట్లచట రాజ్యపాలనము చేయుచుండ భగీరథుని వద్దకు కోసలదేశ మంత్రాద్యులు వచ్చి తాను రాజ్యమొసంగి వెళ్ళిన శత్రురాజు మరణించె ననియు తిరిగి ఆ రాజ్యయమును తానే పాలింపవలెననియు ప్రార్థింప, అతడందుల కంగీకరించి సప్తసముద్రావృతమగు భూమండలమును బాలించెను. ఒకపుడాతడు, కపిలముని శాపముచే పాతాళమునదగ్ధులైన తన పితామహులగు సగరపుత్రులుతరించుట కుపాయము గంగాజలమని విని స్వర్గమునుండి ఆ గంగనెట్లైన భూతలమునకు రప్పింప ధృడ నిశ్చయుడై రాజ్యమును మంత్రుల కొప్పగించి తపమొనరించుటకై అరణ్యమున కేగి అట వేలకొలది వత్సరములు బ్రహ్మదేవుని, శంకరుని, జహ్నుఋషిని ఆరాధించి తుదకు గంగానదిని భూతలమున ప్రతిష్ఠించెను. అప్పటి నుండియు ఆ పుణ్య నిర్మల స్రవంతి భూమిపై ప్రవహించెను.

ఓ రామచంద్రా ! భగీరథునివలె నీవున్ను ఆత్మదృష్టినవలంబించి శాంతసమచిత్తుడవై యథాప్రాప్తములగు, కార్యముల నొనర్చుచు, మఱియు సమస్త విభవ సమూహమును ప్రథమమున త్యజించి మనస్సును పక్షిని హృదయమున నిరోధించి శిఖిధ్వజుని వలె ఆత్మయందు నిశ్చలముగ నుండుము! ఇపుడా శిఖిధ్వజుని వృత్తాంతమును వినుము -

## చూడాలోపాఖ్యానము

ఓ రామచంద్రా! పూర్వకల్ప ద్వాపరయుగమున శిఖిధ్వజ చూడాలురను నిరువురు దంపతులుండి యుండిరి. ఈ కల్పద్వాపరమున కూడ వారు మరల ఆ రూపముననే జనింతురు. అట్లు జరుగవలెనని బ్రహ్మదేవుని నియతియై యున్నది కావున నట్లే సంభవించును.

పూర్వద్వాపరమున జంబూ ద్వీపమున వింధ్యాచలసమీపమున మాలవ దేశమున ఉజ్జయనీ నగరమున శిఖిధ్వజుడను గొప్ప రాజుండెను. అతడు విద్యావంతుడును ధైర్యఔదార్యాది గుణ సంపన్నుడునై యొప్పుచుండె. అతని చిత్తము సురాష్ట్ర దేశాధిపతి కొమరితయగు చూడాలయను కాంతయం దనురక్తమై యుండుటను మంత్రులు గ్రహించి వారిరువురకును వివాహము చేసివైచిరి. ఆ దంపతు లిరువురును అన్యోన్య ప్రేమ గలవారై ఏకమనస్కులై అనురాగయుతులై వర్తించుచు పెక్కుభోగముల ననుభవించుచు నుండిరి. ఇట్లుండ క్రమముగ యౌవనము క్షీణింపజొచ్చ వారిరువురును సంసారస్థితిని గూర్చి విచారించి ఆత్మజ్ఞానమే సంసారవ్యాధికి ఔషధమని నిర్ణయించినవారై అద్దాని సంపాదనయందే తత్పరులై యుండిరి. తదుపరి చూడాల అధ్యాత్మ శాస్త్రార్థమును విజ్ఞుల వలన విని ఈ ప్రకారముగ రాత్రింబవళ్ళు ఆత్మవిచారణ సలుప సాగెను - 'నేనెవరు? దేహము, మనస్సు జడరూపములు గాన అవి నేను గాను. అవి అసద్రూపములు. నిర్వికారమగు చిద్రూప ఆత్మనే నేను. అట్టి చిదాకాశరూప ఆత్మకు నాశముగాని జనన మరణములుగాని లేవు. ఆహా! చిరకాలమునకు నేనిపుడు ఆత్మను బొంది భ్రమరహితనై సుఖముగ నున్నాను. ఇట్టి యాత్మచింతనచే నామె స్వాతారామయై నిత్యము అంతర్ముఖ వృత్తి గలిగి రాగద్వేష ఇచ్ఛాది రహితయై ప్రాప్తక్రియలను సమశాంత చిత్తముతో నాచరించుచు, ఆత్మప్రాప్తిచే అపూర్వశోభాన్వితయై వెలయ జొచ్చెను. అది గాంచి ఒకపుడు శిఖిధ్వజుడు అట్టి యాపెశోభకు కారణమేమని చూడాల నడుగ ఏకోర్కెయు లేక విషయ భోగాశను పరిత్యజించి ఆత్మయందు స్థితిగలిగి యుండుటయే అందులకు గారణమని వచింప అది విని

యారాజు ఆమెను పరిహసించి అట్టి యసంబద్ధ ప్రలాపమును వీడి తనతోబాటు విలాసముగ క్రీడింపుమని చెప్పి వెడలగా చూడాల తన భర్త స్థితిని గాంచి విచారపడెను.

ఇట్లుండ ఒకపుడు చూడాలకు ఆకాస గమనసిద్ధిని బొంద కోర్కె జనింప సమస్త భోగములను వీడి నిర్జన స్థానమున కరిగి ఏకాంతముగ ప్రాణాయామాద్యభ్యాసములను గావించి, అణిమాది సిద్ధులను బడసెను. తద్ద్వారాఅపె ఆకాశ శిల జలాదులందు కూడా నిరాటంకముగ ప్రవేశింప శక్తి గలిగి యుండెను. అనేక పర్యాయములు తన భర్తకు జ్ఞానోపదేశము చేసెనుగాని ఆతనికి రాగాది కషాయము లింకను పరిపాకము జెందమి జ్ఞానము కలుగకుండెను. ఉపదేశ క్రమము కేవలము శాస్త్రమర్యాదను కాపాడుట కొఱకేగాని జ్ఞాన ప్రాప్తికి గారణము శిష్యుని ప్రజ్ఞయే యైయున్నది. కాని అంతమాత్రముచేత గురూపదేశ శాస్త్రాదులు వ్యర్థములు కావు. ఎట్లనగా - వింధ్యాచలప్రదేశమున ధన ధాన్యసంపన్నుడును, అతిలోభియునగు ఒక వర్తకు డుండెను, అతడొకపుడు అరణ్యమున బోవుచుండ అతని ఒక గవ్వ గడ్డియందు పడిపోవగా ఆప్రదేశము నంతయు నతడు మూడు దినముల వఱకు వెతకుచుండెను. అది దొరికినచో దాని క్రయ విక్రములచే నెనిమిది యగును. క్రమముగ పదివేలగును. ఈ ప్రకారమగు యాలోచనచే నాతడు జనుల పరిహాసమును గూడ లెక్కచేయక అదేపనిగా రాత్రింబగళ్లు ఆ గవ్వకొఱకై వెతకుచుండ మూడు దినములైన పిదప నతనికొక చింతామణి దొరుకగా ప్రసన్నుడై సర్వైశ్వర్యములతో గూడి సుఖముగ వసింపదొడగెను.

గవ్వను గూర్చిన యన్వేషణము చేయనిచో నా వర్తకునకు చింతామణి యెట్లు లభించి యుండెడిది కాదో, అట్లే గురూపదేశ శాస్త్రాది విచారములేక ఆత్మతత్త్వము ప్రాప్తింపదు. అయినను గురూపదేశము ఆత్మప్రాప్తికి సాక్షాత్కారణము కాదు. ఏల యన ఆత్మబ్రహ్మము, ఇంద్రియ మనోజ్ఞానములకు పరమై వెలుగుచున్నది.

తత్త్వజ్ఞానము లేమి శిఖిధ్వజుడు మహామోహము నొంది దుఃఖాగ్నిచే సంతప్తుడై రాజ్యాది భోగములను తృణమువలె జూచుచు

పరమ వైరాగ్య మవలంబించి ఒకనాడు తానరణ్యమున కేగి ఏకాంతమున తపంబాచరింప నిశ్చయము గలిగి యుండె ననియు, అందులకు నీవేమియు విఘ్నమును గలుగజేయరాదనియు, రాజ్యపాలనము చేయుచు సుఖముగ నుండుమనియు చూడాలకు జెప్ప, ఆమె అతని యొక్క వైరాగ్య దృఢత్వమును బరీక్షింప దలంచి అతని యభీష్టమును వారించి యౌవన కాలము గడువనంత వఱకును గృహమందే యుండి ఆ పిదప యిరువురును గలిసి వనమునకు బోవచ్చునను భావము నాతనికి తెలియజేసెను. కాని ఆతడందుల కంగీకరింప లేదు. ఆనాటి రేయి శయన స్థానమున తన ప్రక్కన నిదిరించుచున్న చూడాలను వీడి దుష్ట నిగ్రహార్థము బయలు దేరుచున్నానని సేవకాదులకు జెప్పి రాజగృహమును వదలిపోయి శిఖిధ్వజుడు అరణ్యగ్రామాదులను దాటి మందరాచల తటమున నున్నయొక్క శుద్ధ శీతల ఫల వృక్ష జలాది సహితమై యొప్పుచు రమ్యమై విలసిల్లుచు తాపసుల కనువై యున్న యొకానొక వన ప్రదేశమున జేరి అటనొక పర్ణశాలను వైచికొని దండకమండలు దర్భాసనాది సామగ్రిని సేకరించి దేవతార్చన జప పూజాదులందు గాలము గడుపుచుండెను.

ఇట చూడాల అర్ధరాత్రి సమయమున భర్త వెడలిన పిదప భయముచే లేచి తన పతి రాజ్యమును వీడి చనినందులకు చింతిల్లి అతని చెంత కేగ దలంచి ఆకాశ మార్గము గుండా బోవ ఒక నిర్జన స్థానమున సంచరించుచున్న తన భర్తను జూచి అతని భవిష్యత్తు నంతట యోగబలముచే విచారించి అతని వద్ద కేగుట కది సమయము కాదని నిశ్చయించి తిరిగి రాజగృహమునకు జని నిదురించెను. ఒకానొక కారణమున రాజు ప్రవాసమున కేగెనని ప్రజలకు జెప్పి తానే రాజ్యపాలనా కార్యములను జూచుకొనుచుండెను.

ఇట్లుండ పదునెనిమిది వత్సరములు గడిచిన మీదట చూడాల రాజుయొక్క రాగద్వేషాది కషాయములు పరిపక్వము కాగా ఆత్మజ్ఞానము బోధించుట కది తగిన సమయమని యెఱిగి ఒకనాడు రాత్రి అంతఃపురమును వీడి ఆకాశమార్గము గుండా మందర పర్వతతట ప్రదేశమును జేరి బ్రాహ్మణ కుమార వేషమున రాజుముందు వ్రాలెను.

అత్తఱియట పుష్పమాలను గ్రుచ్చుచున్న శిఖిధ్వజుడు లేచి ఆతనిని మిగుల సత్కరించ తానెవరని ప్రశింప చూడాల యిట్లు చెప్ప దొడగెను.

ఒకపుడు దేవర్షియగు నారదుడు ఒకానొక గుహ యందు ధ్యానస్థుడై యుండగా తత్సమీపమున గంగానదియందు కోలాహల ధ్వని యగుట విని అది యేమియని పరికింప రంభాద్యప్సరసలట జలక్రీడ నొనర్చుచుండుటనుగాంచ, అకస్మాత్తుగ నాతని చిత్తము సంక్షోభ మొందవీర్యము స్ఖలితమయ్యెను. అమ్మునీంద్రుడు వెంటనే తన చిత్తమును వివేకముచే బంధించి అచ్యుతవీర్యము నొక స్పటికమణి నిర్మిత ఘటమందుంచి స్వసంకల్ప రచిత క్షీరముచే నద్దానిని నింపెను, ఆ వీర్యమొక మాసములో క్రమముగ వృద్ధికాగా కాలక్రమమున నందుండి యొక సుందర బాలకుడుద్భవించెను. తండ్రియగు నారదుడాతనిని విద్యావంతునిగ జేసి బ్రహ్మదేవుని యొద్దకు గొంపోవ బ్రహ్మదేవుడాతనిని సర్వవిద్యాకోవిదునిగ జేసి కుంభుడను నామమిడెను. అట్టి నారద పుత్రుడగు కుంభుడనే నేను. బ్రహ్మ లోకమున నేను వసించుచుందును. లీలాపూర్వకముగ నిపుడు బ్రహ్మాండము లందు విహరించుచున్నాను. నేను భూమిపై సంచరింపదలంచినచో నా అంగములు భూమిని స్పృశింపవు. ఆకాశమార్గమున జనుచు నిన్నిచట అవలోకించి ఇచటి కేతెంచితిని.

తదుపరి చూడాల శిఖిధ్వజునితో నాతడవ్వనంబున నెంత కాలము నుండి వసించుచున్నదియు, ఏమిచేయుచున్నదియు తెలుపుమని కోరగా, శిఖిధ్వజుడిట్లు వచించెను - దేవా ! సంసారము యెడల భయభీతుడనై రాజ్యాదులను త్యజించి నేనీవనమున తపస్సు నాచరించుచున్నాను. కాని దానిచే విశ్రాంతి లభింపకున్నది.

చూడాల:- ఓ రాజర్షీ ! పూర్వకాలమున ఒకపుడు బ్రహ్మదేవుని నేనిట్లడిగితిని - మహాత్మా జ్ఞానము, కర్మ ఈ రెంటిలో నేది శ్రేయోదాయక మైనది? అపుడు బ్రహ్మదేవుడిట్లనియె - ఆ రెంటిలో జ్ఞానమే పరమ శ్రేయమగు మోక్షము నొనగూర్చును. జ్ఞానము లేనివాడే కర్మనాశ్రయిం చును. వాసనా త్యాగముచే జీవునకు జనన మరణవర్జితమగు పరమార్థ

వస్తువు లభించును, వాసనారహితమగు మనస్సే జ్ఞానము. అట్టి జ్ఞానముచే 'జ్ఞేయ'మగు ఆత్మలభింప జీవుడు పునర్జన్మ రహితుడగును !

ఈ రీతిగ ఓ రాజర్షీ ! బ్రహ్మాదులు గూడ జ్ఞానమే పరమ శ్రేయమని వచింపనీవేల అజ్ఞునివలె నున్నవాడవై ఈ తపోరూప అనర్థ విలాసమున వర్తించు చున్నావు? నేనెవడను? ఈ ప్రపంచ మెట్లుత్పన్నమైనది? ఇది యెట్లు శమించును? అను నీ ప్రకారముగ ఏల విచారింపక యున్నావు?

శిఖిధ్వజుడు:- (అశ్రుపూరిత ముఖుడై) - దేవా ! మీరే నా గురువులు ! మీ చరణములకు నమస్కరించుచున్నాను. దేనిని బొందినచో జీవుడిక దుఃఖము నొందడో అట్టి సుఖ స్వరూప బ్రహ్మమునుగూర్చి నాకుపదేశింపుడు. మీరు వచించిన దంతయు తిరుగు చెప్పక శ్రద్ధతో నంగీకరించెదను.

## మణికాచోపాఖ్యానము

చూడాల:- అట్లైన వినుము - శ్రీమంతుడును, గుణవంతుడును, శాస్త్రకుశలు డును నగు ఒకానొక మనుజుడు గలడు. ఆతడొకపుడు చింతామణి కొఱకై తపస్సు చేయ కాలక్రమమున నయ్యది సంప్రాప్తించెను. కాని ఎదుట నున్న ఆ చింతామణినిగూర్చి 'ఇది చింతామణియా కాదా? దీనిని నేను తాకెదనా తాకకుందునా; తాకినచో ఒకవేళ మాయమై పోవునేమో, ఇంత త్వరలో చింతామణి నాకెట్లు లభింపగలదు? అని యిట్లు చింతనజేసి దాని నుపేక్షింప ఇంతలో నయ్యది యెచటికో ఎగిరిపోయెను. సిద్ధులు సంప్రాప్తించునపుడు వానిని గ్రహించువానికి అవి సద్బుద్ధిని గలుగజేయును. ఉపేక్షించువానికి ఉన్న బుద్ధికూడా నశింపజేసి వెడలిపోవును. తదుపరి అతడు చింతామణి కొఱకై మరల యత్నింప వంచక సిద్ధులచే వానియెదుట నొక గాజుముక్క యుంచబడగా అది చింతామణియే యని తలంచి దానిచే సమస్తైశ్వర్యములు ప్రాప్తించునని తనకున్న సంపత్తినంతయు వదలి వేసి ఒకానొక శూన్యవనమున కేగి యట వసించుచు పెక్కు దుఃఖముల ననుభవించెను.

## హస్తిపకోపాఖ్యానము

ఓ రాజా! మఱియొక వృత్తాంతమును వినుము - వింధ్యారణ్యమున నొక గొప్ప ఏనుగుండెను. ఒకపుడు మావటివాడు దానిని గొలుసుతో బంధించి దూరముననుండెను. బంధనము వలన ఆ యేనుగు మూడురోజులు మిగుల బాధనొంది తదుపరి ప్రయత్నముచే ఆ గొలుసును త్రెంపివైచెను. మావటివాడది గ్రహించి సమీప మందలి యొక తాటిచెట్టుపైనెక్కి దానినెత్తిపై దుముక పొరబాటున క్రింద బడెను. కాని అవయవములు విరుగలేదు. ఆతని నెదుట గాంచి ఆ ఏనుగు కరుణ గలిగి ఆతనిని వధింపక తనదారిని తానేగెను. ఆ మావటివాడు ఏనుగు తప్పించుకొనిపోయి నందులకు దుఃఖితుడై దానిని మరల వెతకుచు చిరకాలమునకు ఒకచోట దానిగాంచి రాజసామగ్రి సహాయముచే దానిచుట్టూ కందకము త్రవ్వి దానిపై గడ్డి లతలు మున్నగువానిని పఱచెను. కొంతకాలమునకా గజము ఇటు నటు తిరుగుచు ఆ కందకమునందుపడి మావటివానిచే తిరిగి గొలుసుచే బంధింపబడెను, అట్లు బంధింపబడిన యది ఇప్పటికిని అచటనే యున్నది. మొదటనే ఆ గజము మావటి వానిని వధించియుండినచో కందకమందలి దుఃఖము ననుభవింపకయే యుండెడిది. కాబట్టి ఓ రాజా! అజ్ఞానమే పరమ బంధము.

ఓ రాజా ! ఇపుడు తెలిపిన ఈ రెండు కథలయొక్క తాత్పర్యమును వినుము. శాస్త్రకుశలుడుకాని తత్త్వజ్ఞానరహితుడునైన ఆ మణి సాధకుడవు నీవే. సర్వత్యాగమే చింతామణి. అట్టి సర్వత్యాగము నీకు సిద్ధించినది. ఏల యనగా నీవు రాజ్యాది సమస్తమును త్యజించివైచితివి. కాని సర్వత్యాగరూప మహోదయ మది కాదనియు ఇంకేదియో ఇతర మనియు తలంచి చింతనచే మెల్లగ సంకల్ప గ్రహణమును వృద్ధిజేయ నీ సర్వత్యాగ మెచటికో యెగిరి పోయినది. తదుపరి నీవు సంకల్పమను నేత్రముచే తపస్సను గాజు ముక్కను నీ యెదుటగాంచి దానిని గ్రహించి దుఃఖితుడవగు చున్నావు. రాజ్యబంధనమును వీడి నీవిపుడు వనవాసమను బంధనమున తగుల్కొని యున్నావు. చింతామణిని

బొందితివని నీవు తలంచు చున్నావు. కాని నిజమునకు గాజుముక్కను గూడ నీవు బొందలేదు.

ఇక రెండవ కథా తాత్పర్యమును వినుము - ఈ పృథివియే వింధ్యాచలము. వింధ్యాచల గజమే నీవు. దాని రెండు దంతములే నీ వివేక, వైరాగ్యములు. మావటివాడు నీ అజ్ఞానము. ఏనుగువలె నీవు బలవంతుడవైనను అజ్ఞానమను మావటివానిచే ననేక దుఃఖములను, భయములను బొందు చున్నావు. ఆశయే గొలుసు. నీ రాజ్యత్యాగమే గజము శృంఖలమును ఛేదించుట. రాజ్యత్యాగ సమయమున నీ యందు అజ్ఞానము ప్రవేశించుటయే బంధచ్ఛేద సమయమున మావటివాడు ఏనుగుపై పడుట. భోగములను సంపూర్ణముగ త్యజించినచో మనుజుని యొక్క అజ్ఞాన మెచటికో పారిపోవును. రాజ్యత్యాగ సమయమున నీయందలి అజ్ఞానమును మనస్త్యాగముచే నీవు ఛేదించకుంటివి. జ్ఞానముచే నీ యజ్ఞానమును సమూలముగ నశింపచేయకుంటివి. శత్రువు కందకమును త్రవ్వుట యేదికలదో అది అజ్ఞానము నిన్ను దుఃఖమందు పడత్రోయుట యగును. కందకము కోమల లతాదులచే గప్పబడుట ఏది కలదో అది నీ తపోదుఃఖ మొకింత శాంత్యాది సజ్జన వృత్తులచే నావేష్టింపబడుట. ఈ ప్రకారముగ నేటి వఱకు నీవు తపో రూప దారుణ కందకమునబడి దుఃఖితుడవై యున్నావు.

ఓ రాజా ! పూర్వము చూడాల నీకు వచించిన జ్ఞానమును నీవేల అపుడాదరింపకుంటివి? పోనీ, నీవు తలపెట్టిన సర్వత్యాగమునైన ఏల ఆచరింప కుంటివి?

శిఖి:- ఏమి ? నేను రాజ్య, గృహ, ధన దారాది సమస్తమును త్యజించివైచితినే, అది సర్వత్యాగము కాదా?

చూ:- ఆ రాజ్యధనాదులన్నియు నీవికావు. నీ వస్తువును ఉత్తమమైన భాగమును నగు ఒకదానిని నీ వింకను త్యజింపకనే యున్నావు. దానిని త్యజించినచో దుఃఖరహితుడవగుదువు.

శిఖి:- సరే, వృక్షాదిసహితమగు ఈ వనమును గూర్చిన వాసన నిపుడు త్యజించి వేసితిని. ఇక సర్వత్యాగము సిద్ధించినది.

చూ:- త్యజింపవలసిన ఉత్తమభాగ మింకను నీవు త్యజింప లేదు.

అదివిని శిఖిధ్వజుడు తన యాశ్రమమును గూర్చిన ప్రీతిని గూడ త్యజించి ఇక సర్వత్యాగము సిద్ధించినదిగదా యని వచింప చూడాల 'ఈ ఆశ్రమాదులు నీవు కావు. నీదైనట్టి ఒక ఉత్తమ వస్తువు యింకను త్యజింప వలసినది గలదు,' అనెను. అప్పుడు శిఖిధ్వజుడు తన యజ్ఞపాత్ర, కుటీరము మున్నగు సామాగ్రినంతయు తన వల్కలాదులను గూడ అగ్నికి ఆహుతిజేసి ''ఇప్పుడు నా సర్వత్యాగము సంపూర్తి అయినది,'' ఏలయనిన నా బంధనము లన్నియు తొలగినవి, అని వచింప చూడాల ''ఓ రాజా ! నీవు సర్వము నింకను త్యజింపలేదు. సర్వత్యాగముచేతనే పరమానందము లభించును'' అని చెప్పగ అపుడు శిఖిధ్వజుడు ''ఇక మిగిలియున్నది. ఈ నా శరీరము మాత్రమే. దీనినిగూడ అగ్నియందు వైచెదను. అపుడు సర్వత్యాగము సంభవించును. అని నిశ్చయించి లేచి అగ్నియందు దుమకబోగా చూడాల నివారించి రాజున కిట్లు హితోపదేశము చేసెను. -

ఓ రాజా ! నిరపరాధియగు ఈ దేహమును వ్యర్థముగ నగ్నియందు బడద్రోయకుము. దేహము జడమే. దానిని చలింప జేయునది వేఱుగ గలదు. అదియే మనస్సు. అదియే దేహాదులన్నిటికి బీజము. దానిని వీడిననే సర్వత్యాగము సిద్ధించును. అపుడే పూర్ణసౌఖ్యము లభించును. వాసనయే ఆ చిత్తముయొక్క స్వరూపము. అజ్ఞానమే దాని బీజము. ఆ వాసనను, అజ్ఞానమును సమూలముగా నశింపజేసిననే చిత్తము నశించును. విషయ భోగముల యందలి ఆసక్తిని విడుచుట వలనను, 'నేనెవరు' అను నీ ప్రకారమగు ఆత్మవిచారణ చేతను చిత్తము క్షయించును. మఱియు ఈ శరీరాది దృశ్య జగత్తు మిథ్య, ఆత్మయే సత్యము అను భావన దృఢపరచుకొనవలెను. ఇట్లు అజ్ఞానము నశించి శరీరాది దృశ్యపదార్థభావన బాధితము కాగా శుద్ధ చిన్మాత్ర ఆత్మవస్తువగ నీవే శేషింతువు. అపుడే బంధరహితుడ వగుదువు.

ఈ ప్రకారముగ బహురీతుల చూడాల శిఖిధ్వజునకు ఆత్మోపదేశము చేయగా రాజు ప్రబుద్ధుడై రెండు ఘడియల సేపు

నేత్రములను మూసికొని నిశ్చలముగ ఆత్మయందు స్థితిగలిగి యుండెను. ఆ పిదప చూడాలతో తాను కృతకృత్యుడాయె ననియు, నిరతిశయానంద రూపమగు ఆత్మపదము తనకు లభించెననియు చెప్పి, పూర్వమే అట్టి స్థితి తనకేల లభింపలేదని యడుగ, రాగద్వేషాది కషాయములపుడు పరిపాకము జెందలేదనియు ఇపుడవి పరిపక్వములై చిత్తము శుద్ధ మగుటచే ఉపదేశము బాగుగ అంటిననియు చూడాల వచించెను, మఱియు రాజున కిట్లుపదేశించెను. ఓ రాజా ! పునర్జన్మకరమగు ఘనీభూతమైన వాసనయే చిత్త మనబడును. అట్టి వాసన జ్ఞానుల కుండనందుచే వారలకు చిత్తములేనట్లే. తత్త్వజ్ఞుడు ఏ వాసనచే ఈ ప్రపంచమున విహరించునో అది దగ్ధ బీజమువలె పునర్జన్మ రహితమైనది.

మూఢుల చిత్తమునే చిత్తమందురు, జ్ఞానుల చిత్తమును సత్త్వమందురు. ఓ రాజా! నీ విపుడు చిత్తమును, వాసనను త్యజించితివి కావున సత్త్వయుతుడవై వెలయుచున్నావు. ఈ ప్రకారముగ తత్త్వబోధను బాగుగ నెఱింగి, మననము చేసి పరమాత్మ పదమున నీ యిచ్ఛవచ్చినట్లు సమాధిచేగాని, వ్యవహారముచేగాని మెలగుము. ఇపుడు నేను స్వర్గమునకు బోవుచున్నాను. ఏలయనగా ఈ పర్వకాలమున బ్రహ్మలోకము నుండి నారదముని ఇంద్రుని సభకు వచ్చి యుండవచ్చును. అతడు నన్నచట గాంచనిచో కృద్ధుడగును. నీవు సంకల్పమును, ఇచ్ఛను వదలి నేను వచించినరీతి ఆత్మదృష్టియందే సదా మెలగుము.

- అని యిట్లు వచించి చూడాల రాజొసంగుచున్న పుష్పాంజలిని గ్రహింపకయే అంతర్ధాన మొందెను. తదుపరి శిఖిధ్వజుడు తన భాగ్యోదయమునకు మిగుల సంతసించి సంకల్పరహితుడై సమాధి యందు నిశ్చలముగ నుండెను.

ఇట చూడాల శిఖిధ్వజున కుపదేశించిన పిదప ఆకాశ మార్గముగుండా నెగిరి తన నగరమున బ్రవేశించి రాజకార్యముల నొనర్చుకొని మూడు దినములైన పిమ్మట కుంభుని వేషము ధరించి శిఖిధ్వజుడున్న వనమునకేగి చూడనట యాతడు సమాధియందు

నిశ్చలముగ నుండెను. (ఇంకను ప్రారబ్ధకర్మ శేషించియుండ) ఈతడిపుడే యేల దేహమును త్యజింపవలయును? కొంతకాలము రాజ్యమునగాని, వనమునగాని క్రియల నాచరించి ఆ పిదప యిరువురము విదేహముక్తి నొందెదము- అని నిశ్చయించి చూడాల అతనిని మేలుకొలుపుటకై గొప్ప సింహనాదము చేసెను. కాని దానిచే నతడు లేవలేదు. అపుడు చేతితో నాతని గదిల్చి క్రిందపడ వైచినను సమాధినుండి లేవకుండెను. అత్తఱి యామె యిట్లు చింతన జేసెను - ఈతడు స్వాత్మపదమున పరిణతుడాయెను. ఇపుడు క్రియాయుక్తిచే ఈతనిని మేలు కొలిపెదను. లేక ఇతనిని మేలుకొలుపనేల? విదేహముక్తినొంది సుఖ పూర్వకముగ నిట్లేయుండుగాక ! నేనున్ను ఈ నా స్త్రీ దేహమును వీడి పతితో గూడ జనన మరణ రహితమగు కైవల్య ధామము నొందెదను; అని తలంచి దేహత్యాగమున కుద్యుక్తురాలు కాగా నపుడామె పతియొక్క అవశ్యభోక్తవ్య ప్రారబ్ధమును గూర్చి యోచించి ముందీరాజు యొక్క అంతఃకరణమున జాగ్రద్బీజభూతమగు మనశ్శేష మేమైన యున్నదో చూచెదను. ఉన్నచో ఈతడు తప్పక జాగృతుడై జీవన్ముక్తుని పగిది వ్యవహరించును. లేకున్న ఈతనితోబాడు నేను కూడ విదేహముక్తి నొందెదను అని తలంచినదై స్పర్శాదుల ద్వారా అతనియందింకను జాగ్రద్బీజ భూతమనశ్శేష మున్నదని యెఱింగి కాలక్రమమున నీతడు జాగ్రతుడగును.

కాని నేనేల అంతవఱకు నొంటరిగ నుండవలెను అని యోచించి తన దేహమును వీడి అతని హృదయమున ప్రవేశించి అటచైతన్యముతో నేకరసీభూతమై యున్న బుద్ధిని పృథగ్రూపమున స్ఫురించుచున్నట్లు చేష్ట యొనర్చి తిరిగి తన దేహమున ప్రవేశించి పుష్పాసనముపై గూర్చుండి సామగానము చేయుచుండ నింతలో శిఖిధ్వజుడు మేలుకొని తన యెదుట సామగాన మొనర్చుచున్న కుంభుని గాంచి అతని రాకకు కారణమరయ 'నీవంటి మిత్రుడు నాకింకొకడు లేడు; ఇచటి నుండి వెళ్ళినప్పటినుండియు నా మనస్సిచ్చటనే లగ్నమైయున్నది' అని కుంభుడు (చూడాల) వచింప శిఖిధ్వజుడు 'మీరిచట ఈ రమణీయ వనమందే వసింపుడ'ని ప్రార్థించెను. తదుపరి వారిరువురును కలిసి అనేక పర్వత వన కుంజములందు విహరించిరి. ఇట్లుండ చూడాల తన పతితోడ

భోగముల ననుభవింపదలంచి ఒక పన్నాగము పన్నెను. ఎట్లన తన భర్త కడకేగి ఆమె 'నేడు చైత్ర శుక్ల పాడ్యమి. మహాదివసముగాన స్వర్గమున ఇంద్రుని సభ జరుగును. అటకు దేవతలు ఋషులు పెక్కురు వత్తురు. కాబట్టి అట నా తండ్రిగారి వద్దకు నేను తప్పక వెళ్ళ వలయును అని చెప్పి వెడలిపోయి తన యంతఃపురమున బ్రవేశించి రాజకార్యములను జూచుకొని తిరిగి వెంటనే శిఖిధ్వజుని కడకు మ్లాన ముఖియై, దుఃఖముతో నున్నట్లు నటించుచుబోవ అతడామె దుఃఖమునకు కారణమరయ చూడాల గద్గద స్వరముతో నిట్లు వచించెను.

నీ వద్దనుండి వెడలి స్వర్గమునకు జని అచట సభ పూర్తియైన పిదప ఆకాశమార్గము గుండా యిచటికి తిరిగి వచ్చుచుండ త్రోవలో మేఘముల గుండా భూలోకమునకు శీఘ్రముగ జనుచున్న దూర్వాసమునిని జూచి నమస్కరించి 'నీలమేఘమను వస్త్రమును ధరించుటచే మీరు అభిసారిక (వ్యభిచారిణి) వలె జూపట్టుచున్నారు' అని నేననగా ఆ వాక్యములను విని, యాతడు 'ప్రతి రాత్రియందు నీవు స్త్రీవి యగుదువుగాక' అని నన్ను శపించెను. అపుడు నే నొకింత చింతన చేయుచుండ నింతలోనే యాత డంతర్ధాన మొందెను. కావున నేను దుఃఖపరవశనై యిచటి కేతెంచితిని. అపుడు శిఖిధ్వజుడు 'దుఃఖింపకుము. శరీరమున కేమి సంభవించినను ఆత్మకు దానితో సంబంధములేదు. కాబట్టి యథాప్రాప్తమగు దాని నంగీకరించి సమత్వము గలిగియుండుము' అని యామెను సమాధాన పఱచెను. ఆనాటి నుండి రాత్రి సమయములం దామె మదనిక యను పేరుతో స్త్రీరూపమున వ్యక్తమై కన్యాధర్మమును బాలించుచు పగలు కుంభరూపమున శిఖిధ్వజుని మిత్రుడుగ వ్యవహరించుచు నుండెను.

అట్లు కొన్ని రోజులు గడచిన మీదట చూడాల తన స్త్రీ రూపమును సఫలమొనర్చుటకుగాను అతనిని (శిఖిధ్వజుని) వివాహమాడ దలంచి నట్లుగ అతనికి దెలుప అతడందులకు సమ్మతింప నాటి రేయి యిరువురును అగ్నిసాక్షిగ గాంధర్వ వివాహ మాడిరి. పగటి యందు వారు ప్రియమిత్రులుగను రాత్రి యందు దంపతులుగను నుండుచు అన్యోన్యానురాగము గలిగి వర్తించుచు అనేక పర్వత వనాదులందు విహరించుచు నుండిరి. మూడు మూడు దినములకొకసారి చూడాల పతి

నిదురించిన మీదట తన నగరమున కేగి రాజ్యకార్యములను జూచుకొని మరల పతి వద్దకు వచ్చుచుండెను. ఇట్ల నేకమాసములు గడచిన వెనుక 'ఈతనికి భోగముల దాసక్తి క్షయించినదా లేదా అను విషయము నిపుడు అనేక ఉత్తమ భోగ సమూహములచే నీతనిని బరీక్షించెదను' అని నిశ్చయించి తన మాయచే అవ్వనభూమియందు దేవతా, అప్సరసాది సహిత ఇంద్రుని దర్శింపజేసెను. ఆ యింద్రుడు స్వర్గము నకు వచ్చి అనేక సౌఖ్యములననుభవింపుమని రాజును ప్రాధేయ పడినను అతడు 'స్వర్గము (చిదాత్మ )సర్వత్ర గలదు. నేను సర్వత్ర సంతుష్టుడను, స్వర్గమునకు బో నభిలషించను' అనిచెప్ప, అది విని యింద్రుడు సపరివారముగ వెడలిపోయెను, అట్లు రాజు భోగేచ్ఛకు వశీభూతుడు కాకుండుట జూచి చూడాల సంతసించి మఱియొక పరీక్ష చేయ దలంచినదై, రాత్రి సమయమున శిఖిధ్వజుడు సంధ్యాజపతత్పరుడై యుండ నొకచోట లతాగృహమున సంకల్పరచిత పుష్పశయ్యపై సంకల్ప రచిత జారపురుషునితో క్రీడించుచు పరుండెను. ఇంతలో శిఖిధ్వజుడామెను వెతకుచునటకు వచ్చి అట్లు జారునితో క్రీడించు చుండుటకు గాంచి సమచిత్తుడై 'నన్ను గాంచి భయపడకుడు, నేను మీ కార్యమున విఘ్నమును గల్పింపను' అని చెప్పి వెడలిపోయెను. తదుపరి చూడాల ఆ మాయ నుపసంహరించి ఏకాంతమున శిలపై సమాధి యందున్న రాజును జూచెను. క్షణకాలములో రాజు సమాధినుండి లేచి ఎదుటనున్న మదనికనుగాంచి ''నీ యెడల నాకు క్రోధములేదు. కాని సాధుజనులచే నిందితవగు నిన్నిక నా భార్యగా మాత్రము పరిగ్రహింపజాలను.

పూర్వము వలెనే యిపుడును మనమిక మిత్రులవలె సంచరించెదము'' ఆ వాక్యములను విని చూడాల తన పతి యొక్క నిర్వికారస్థితిని జూచి యానంద మొంది ఇక తన నిజవృత్తాంతమంతయు నాతని కెఱిగింప దలంచి చూడాల రూపముతో నట ప్రత్యక్షమై అంత దనుక జరిగిన సమాచార మంతయు నాతనికి విశదుపరచి తానే ఆయా రూపముల ధరించి యాతనికి ప్రబోధము సలుపుచు చిత్తమును పరీక్షించుచు నుండెననియు, విషయ మంతయు తాను ధ్యానముద్వారా

చూడవచ్చు నని చెప్ప నంత శిఖిధ్వజుడట్లే రెండు ఘడియలసేపు ధ్యానమందుండి అంతయు గ్రహించి పరమాశ్చర్య యుతుడై చూడాలను కౌగలించుకొని స్తుతించెను. అపుడు చూడాల ''స్వభావముగనే మనము రాజులము. కావున మోహమును వీడి యథాప్రాప్తమగు ఆ రాజ్య కార్యమును నిర్లేపముగ ఆచరించెదము'' అని చెప్ప శిఖిధ్వజుడందుల కియ్యకొన సంకల్ప నిర్మిత సువర్ణ సింహాసనముపై యాతనిని గూర్చుండ బెట్టిచూడాల సప్త సముద్ర జలముచే నాతని నభిషేకించి మహారాజ పదవి యందధిష్ఠింపజేయ ఆ రాజున్ను చూడాలనట్లే యభిషిక్త మొనర్చి ఆమెను మహారాణి పదమునందధిష్ఠింపజేసి సంకల్పముచే గొప్ప సైన్యమును సృష్టింపమని కోరగా చూడాలయట్లే తనసత్య సంకల్పముచే గజతురగాది సమన్వితమైన మహా సైన్యమును సృజింప ఇరువురును గజారూఢులై తత్సైన్యము వెంటరాగా మహా విభవముతోను, ఆనందముతోను స్వపురమునకు బోవ అట మంత్ర్యాదులు దూరముననే జయ జయ రావములను విని సేనాసమేతులై నగరమునుండి బయలుతేరి ఇరు సైన్యములను గలసి మహా సంరంభముతో నగరమున బ్రవేశించిరి. అత్తఱి యేడు దినముల వఱకు గొప్ప ఉత్సవము జరుపబడెను. తదుపరి పదివేల వత్సరములు సమదృష్టితో రాజ్యమేలి శిఖిధ్వజుడు చూడాలతో గూడ విదేహ ముక్తి నొందెను.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ (శిఖిధ్వజునివలె) నీవున్ను రాగద్వేష రహితబుద్ధి నవలంబించి, సమదృష్టి గలిగి వ్యవహార మొనర్పుము. మఱియు శిఖిధ్వజుని వలెనే బృహస్పతి తనయుడగు కచుడెట్లు జ్ఞానప్రాప్తి నొందెనో నీవును నట్లే జ్ఞానమొందుము.

## కచోపాఖ్యానము

పూర్వము బృహస్పతి పుత్రుడగు కచుడు సమస్త విద్యలందును ప్రవీణుడై ఒకపుడు తండ్రిని సమీపించి సంసార సాగరమును దాటుటెట్లు అని యడుగ నంత యాతడు సర్వత్యాగముచే సులభముగ దాటబడునని చెప్పెను. ఆ వాక్యమును విని కచుడు తన సర్వస్వమును వీడి ఏకాంత వనమునకు జనెను. ఎనిమిది వత్సరములైన పిదప ఒకానొక మహావన

మున కచుడు తన తండ్రిని కలిసికొనగా అపుడాతడు తండ్రితో ''నేను సర్వత్యాగ మొనర్చి ఎనిమిది వత్సరములైనది. ఇంకను చిత్త విశ్రాంతిని బొందలే ''దని చెప్ప, నంత బృహస్పతి ''సమస్తము త్యజింపుము'' అని నుడివి స్వర్గమునకుబోయెను. అపుడు కచుడు తన చిరవల్కాలాదులను గూడ త్యజించి వైచెను. మరల మూడు సంవత్సరములకచట తన తండ్రిని కలిసికొని ''తండ్రీ ! నేను దండ వస్త్రాది సమస్తమును త్యజించితిని. నాకింకను ఆత్మ పదమున విశ్రాంతి కలుగలేదే'' యని యడుగ బృహస్పతి ''పుత్రకా ! చిత్తమే సర్వమున్ను అయియున్నది. దానిని త్యజించుటయే సర్వత్యాగము. అట్టి త్యాగముచేతనే నీకు శ్రేయము కలుగును.'' అని వచించి ఆకసమున నెగసిపోవ, అంత కచుడు చిత్త మెయ్యది అని చింతనజేసి దానినెఱుంగుటకై తన తండ్రివద్దకేగదలంచి స్వర్గమునకు బోయి చిత్తము యొక్క స్వరూపమునుగూర్చి యడుగ అది విని బృహస్పతి యిట్లు వచించెను - ''పుత్రా ! అహంభావమే చిత్తము. సాక్షి రూపమగు ఆత్మ నెఱింగినచో, దానిని వదలుట బహుసుకరము. రజ్జు సర్పమువలె వాస్తవముగ అహంకారమను నదియే లేదు. అజ్ఞానముచేతనే అదిభాసించుచున్నది. నిర్మలమై సర్వుల యనుభవ రూపమైనట్టి ఆత్మ యొకటియే సత్యమైనది, అట్టి ఆత్మ నీవే అయియున్నావు. కాబట్టి పరిచ్ఛిన్నమైనట్టి అహంభావమును వదలి సత్యమగు ఆత్మ యందే స్థిరుడవై యుండుము'' అని యిట్లు బోధింప దానిని విని అట్లే యాచరించ కచుడు జీవన్ముక్తుడై మమత్వ అహంకార వర్జితుడై శాంతచిత్తుడై విలసిల్లెను.

ఓ రామచంద్రా ! మాయారూపుడును, మూఢమతియునగు ఒక పురుషు డుండెను. ఆత డేకాంతమున జనించిన వాడై ఏకాంతము ననేయుండెను. అచట ఆతడు తప్ప మఱేదియును లేదు. ఏది గలదో అదియాతడే. ఆతడు పెరిగినమీదట నేనాకాశమునకు జెందినవాడను. ఆకాశమునాది. కావున దానినేరక్షించెదను అని తలంచి ఆ యాకాశరక్ష ణముకొరకై యాతడొక గృహమును నిర్మించెను. అట్లు నిర్మించి 'నేనాకాశమును రక్షించితిని' అనితలంచి సంతుష్టుండయ్యెను. ఇట్లుండ కాలక్రమమున ఆ గృహము నశింప 'అయ్యో ! నాగృహాకాశమా !

నీవునశించితివే !' అని దుఃఖించి మరల యొక ఘటమును నిర్మించెను. అదియు నశింప ఒక కుండమును నిర్మించెను. తదుపరి మహాశాల కుసూలము (గరిసె) మున్నగు వానిని ఆకాశ రక్షణార్థము నిర్మించెను, ఇట్లాతనికి అనంత కాలము గడుచుచున్నది. ఈ ప్రకారముగ అతడు మహా దుఃఖము నొందుచు ఒకపుడు దాని నుండి విడి వడుచునున్నాడు.

ఓ రామచంద్రా ! ఇక ఈ అఖ్యాయిక యొక్క తాత్పర్యమును వినుము. అహంకారమే మిథ్యాపురుషుడు, అతడు అసత్తైనను మాయచే వ్యర్థముగ రక్షించుటకొఱకే ఆ యహంకారము నానా దేహములను నిర్మించుచున్నది. గృహ కూప ఘటాది రూపదేహములను నిర్మించి ఆ శరీరావచ్ఛిన్న ఆకాశమునే మాయచే ఆత్మయని తలపోసి దానివి రక్షించుచున్నది. పూర్ణబ్రహ్మమున ఈ యహంకారమను మిథ్యాపురుషుడు భూతాకాశమును కల్పించి అద్దానియందు జగద్రచనను నిశ్చయించి నానావిధ సుఖదుఃఖముల నొందుచు నున్నాడు. ఓ రామచంద్రా ! మిథ్యాపురుషుడు ఘటాకాశాదులను రక్షించినట్లు నీవున్ను దేహాద్యుపాధులను ఆత్మయను నమ్మికచే వానిని రక్షించినట్లు రక్షించుచు క్లేశము నొందకుము. ఆత్మ ఆకాశముకంటెను విస్తృతమై శుద్ధమై సూక్ష్మమై శివమైయున్నది. అట్టిదానినెవడు పట్టి రక్షించగలడు? ఘటము నశించినను ఘటాకాశము నశించనట్లు దేహము నశించినను ఆత్మ నశింపదు.

ఓ రామచంద్రా ! ఈ జగత్తంతయును చిన్మాత్రమే. ఇట అన్యమెద్దియును లేదు. కాబట్టి నీవు మనస్సు ఇత్యాది అనేకత్వమును వీడి అభ్యంతరమందలి శుద్ధచిన్మాత్ర వస్తువు నందు స్థితి గలిగి యుండి ఇంద్రియాదులను నిగ్రహించి అహంకారరహితుడవై యథా ప్రాప్తములగు రాజ్యాది వ్యవహారములను జేయుచు ఈ ప్రపంచమున వర్తింపుము.

ఓ రామచంద్రా ! పూర్వమొకపుడు సుమేరు పర్వత ఉత్తర శిఖరమున పరివార సమేతముగ శంకరుడు వసించుచుండ భృంగీశుడు పరమభక్తితో నాతని నిట్లడిగెను - 'దేవా ! ఏ యుత్తమ వస్తువును గ్రహించినచో నేనీ జగత్తున సంతాప రహితముగ నుండగలను? అది విని

యమ్మహేశ్వరుడిట్లనియె - ఓ భృంగీశా! నీవు మహా కర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము. అపుడే సంతాపరహితముగ నుండ గలవు. ఆత్మయందు స్థితిగలిగి అహంకార మమత్వాది రహితుడై ఉద్వేగ వర్జితుడై సమబుద్ధి గలిగి యథాప్రాప్తములగు కార్యములను నిస్సంగమున నాచరించువాడు మహాకర్త. అట్లే సాక్షి మాత్రుడై సుఖదుఃఖాదులందు సముండై పదార్థముల ననుభవించువాడు మహాభోక్త యనబడును. ఈ దృశ్యకల్పనను మిథ్యయని యెఱిగి త్యజించినవాడును, 'నేను దేహమునుగాను, నాకు జన్మలేదు' ఇత్యాదిభావనలు గలవాడును, సమస్త ఇచ్ఛలను సంశయములను విషయాదులను త్యజించి నిత్యతృప్తమగు ఆత్మయందు స్థితిగలవాడును మహాత్యాగి యనబడును, ఈ ప్రకారము శివుడు బోధింప అదివిని అట్టి యుత్తమదృష్టి నవలంబించి భృంగీశుడు దుఃఖరహితుడై వెలసెను. ఓ రామచంద్రా! నీవున్ను అట్లే ధైర్య మవలంబించి మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము.

ఓ రామచంద్రా! అహంకార రూపమగు చిత్తము క్షయింప దొడగునపుడు మనుజుని యందలి కామక్రోధాదు లెచటికో పారిపోవును. సుఖదుఃఖాదులపుడు జీవుని బాధింపవు. అత్తఱి జీవుడు శాంతుడై, ప్రియుడై, స్వచ్ఛుడై, సంసార భ్రమ రహితుడై వెలుగొందును. సమస్త ఆపదలను నశింపజేయునట్టి ఆత్మజ్ఞానమెయ్యది గలదో, అద్దానిని పొందని మనుజుడు అధముండే యగును. ''నేనెవడను, ఈ ప్రపంచమేమి? ఆత్మతత్త్వమెట్టిది? భోగములచే నేమి ప్రయోజనము?'' ఇత్యాది విచార వైరాగ్య యుక్తమగు బుద్ధియే మోక్షప్రాప్తికి ఉత్తమ ఉపాయము.

ఓ రామచంద్రా! మీ ఆది పురుషుడగు ఇక్ష్వాకురాజు ఎట్లు ముక్తిబడసెనో వినుము.

## ఇక్ష్వాకు మను సంవాదము

పూర్వము ఇక్ష్వాకు మహారాజు రాజ్యమేలుచు నొకపు డేకాంతమునకు జని 'సుఖదుఃఖాది భ్రమయుక్తమగు ఈ దృశ్యప్రపంచమునకు

కారణమేమై యుండును' యని యాలోచించి అద్దాని నెఱుంగక బ్రహ్మలోకమునుండి తన సభ కేతెంచిన తన తండ్రి యగు మనువు నిట్లు ప్రశ్నించెను - మహాత్మా ! ఈ సృష్టి యెటనుండి యేతెంచినది? దీని స్వరూపమేమి? రచయిత యెవరు? అది విని మను విట్లు వచించెను. ఓ రాజా ! ఈ కానుపించునది యంతయు వాస్తవముగ లేదు. ఇది గంధర్వ నగరము వలెను, ఎండమావుల వలెను. మిథ్యయై యున్నది. ఏదో కలదో అది ఇంద్రియాతీతమైన సద్రూప ఆత్మయే. ఈ జగత్తు ఆ చిద్రూప ఆత్మయందు ప్రతిబింబించినది. ఈ సుఖదుఃఖా దులు మనస్సునందే కలవుగాని ఆత్మయందు లేవు, 'నేను దేహమును' అను బుద్ధి సంసారమున బంధించునది గావున ముముక్షువు లెన్నడును అట్టి బుద్ధికలిగి యుండరాదు. 'నేను చిన్మాత్ర ఆత్మను' అను నిరంతర బుద్ధియే ముక్తి హేతువు. ఈ జగత్తు చిద్వస్తువగు ఆత్మమయము' అను భావన చేయుచు అభిలాషావిరహితుడై యుండువాడు అట్టి భావనారూపక వచనము వలన సంసార మోహముచే అభేద్యుడై సుఖము నొందును. విషయభోగము లందలి ఆశ యుండునంతవరకు మనుజుడు జీవదశ గలిగి యుండును. వివేకముచే ఆ యాశ శమించునపుడు ఈ జీవదశను త్యజించి నిరామయమగు బ్రహ్మ (ఆత్మ) రూపత్వము నొందును, అహంకారము గలిగియుండుటయే బంధము. జ్ఞానముచే తద్వినాశ మగుటయే ముక్తి. ముముక్షువగువాడు ప్రథమమున శుభేచ్ఛ గలిగి వైరాగ్యయుతుడై సాధనాభ్యాసమువలన క్రమముగ ఉత్తమ (జ్ఞాన) భూమికలందు వర్తించుచు తుదకు జీవన్ముక్తుడై వెలయును. అట్టి యోగినుండి సింహమువలె ఈ జగజ్జాల బంధమునుండి వినిర్గతుడై హర్షశోకాది రహితుడై యందే సదా వర్తించుచుండును. ఐశ్వర్యాదులను గోరువారట్టి జీవన్ముక్తుని పూజింప వలయును. జ్ఞానియగువాడు ఆత్మస్థితిచే నిత్యతృప్తుడై యుండును గాన అణిమాది సిద్ధులను వాంఛింపడు. మను విట్లు బోధించి తదుపరి బ్రహ్మలోకమున కేగెను. ఇక్ష్వాకువున్ను అట్టి ఆత్మ దృష్టిని దృఢముగ నవలంబించి స్థిరచిత్తు డాయెను.

ఓ రామచంద్రా ! జీవునకు స్థూల (దేహము), సూక్ష్మ (మనస్సు),

పరము (ఆత్మ)లను మూడురూపములు గలవు. అందు మొదటి రెంటిని వదలి వానియం దాత్మబుద్ధిలేకమూడవదియగు తురీయ (ఆత్మ) పదము నాశ్రయించి అద్దాని యందు దృఢముగ ఆత్మబుద్ధి గలిగియుండుము. అజ్ఞానుల కీజగత్తు స్థిరముగను, జ్ఞానులకు విలీనమయ్యునుండును. అహంకారములేక సమత్వము గలిగి చిత్తము క్షయింప తురీయావస్థ కలుగును.

## ముని వ్యాధీయము

ఒకానొక యరణ్యమున మహామౌనమును ధరించి యున్న ఒకానొక మునిని బాణముచే గొట్టబడిన లేడిని తరుముకొనుచు అటు పరువెత్తుచున్న ఒక బోయవాడు చూచి ''మహాత్మా! బాణముచే గొట్టబడిన లేడి యిటు వచ్చినది. అది యెటకేగినది?'' అది విని అమ్మునీశ్వరుడిట్లు పలికెను - సాధూ! వ్యవహార సమర్థమగు అహంకారమెద్దిగలదో అదిమాకు లేదు. సమస్తేంద్రియ అహంకార మెద్దిగలదో అది మాకు లేదు. సమస్తేంద్రియ కార్యములను మనస్సు చేయును. అట్టి అహంకార పూర్ణమగు మనస్సు నా కెపుడో క్షయించినది. కావున జాగ్రత్స్వప్న సుషుప్తదశలను నే నెఱుంగను. దేనియందీ దృశ్యము లేదో అట్టి తురీయ స్థితియందు నేనిపుడున్నాను'' - మునియొక్క యా వాక్యముల భావ మెఱుంగక ఆ బోయవాడు తనదారి తానేగెను.

కావున ఓ రామచంద్రా! తురీయదశ యందితర జాగ్రదాది దశలులేవు. జాగ్రత్స్వప్న సుషుప్తి దశలు చిత్తము యొక్క రూపములు. వికల్ప రహితమగు శుద్ధచైతన్యమే తురీయము. నీవు అంధ బధిరుల వలె శబ్దాది విషయరహితుడవై నిత్యము అంతర్ముఖుడవై, ఆత్మయందే సదాస్థితి గలిగియుండుము. రమణీయ, అరమణీయ వస్తువులను జూచినపుడు చిత్తము శిలవలె నిర్వికారముగ నుండవలెను.

ఇంత మాత్రపు ప్రయత్నముచేతనే ఈ సంసారము జయింపబడును. సుఖదుఃఖములయొక్కయు, వాని సాధనముల యొక్కయు చింతను చేయరాదు. ఇంతమాత్రపు యత్నము చేతనే అనంతసుఖము కలుగును.

ఓ రామచంద్రా ! ప్రవృత్తుడు, నివృత్తుడు అని మనుజులిరు తెరగులు. ''ఈ సంసారమే ఉత్తమము. నిర్వాణమేమి?'' అని తలంచి భోగసాధనాది కార్యము లందు ప్రవర్తించువాడు ప్రవృత్తుడు. అట్టివానికి అనేక జన్మలుగడచిన పిదపయే వివేకాభ్యాసముచే తుదకు మోక్షము కలుగును. ''ఈ సంసారము అసారము, ఉత్తమ విశ్రాంతి స్థానమెద్ది'' అను విచారణ గలిగి సంసారతరణోపాయము నాలోచించువాడు నివృత్తుడు. అట్టివాడు మొట్టమొదట కర్మల నాచరించును. భోగములయెడల ఇచ్ఛ లేకుండును. అత్తఱి యాతడు శుభేచ్ఛయను ప్రథమజ్ఞాన భూమికయందు ప్రవేశించును. పిమ్మట విచారణయను రెండవ భూమికయందు ప్రవేశించి, ఉత్తమ గురువుల వద్ద శ్రుతిస్మృత్యాదుల భావమును గ్రహించుచు నుండును. తదుపరి అసంగమను మూడవ భూమికయందు ప్రవేశించి 'నేను కర్తనుగాను. భోక్తనుగాను, భోగములు మహారోగములు, సంపదలు విపత్తులు, అను నిశ్చయముచే గలుగు పదార్థముల గూర్చిన అభ్యాసమేది గలదో అట్టిరూపమగు, మాన్యఅసంగమును నిరంతరాభ్యాస రూపయత్నముచే సంసార సముద్రమును దాటి ఆత్మ సాక్షాత్కారము గలిగి శాంతముగను, మౌనముగను నుండునట్టి స్థితియగు శ్రేష్ఠ అసంగమును రెండింటిని స్వయముగ నపుడనుభవించును. సాధకునకు ప్రథమమున వైరాగ్య ముదయించినపుడు అద్దానిని బహుజాగరూకతతో సంరంక్షించవలెను. అదియే తక్కిన భూమికలకు పునాది. ఈ భూమికల యభ్యాసకాలమున దేహము వీడుట తటస్థించినను, మరల యుత్తమ కులమున జనించి విడచిన దానిని తిరిగి అభ్యసించును. ఈ మూడు భూమికల యభ్యాస ముచే అజ్ఞానము క్షయించి సమ్యక్ జ్ఞాన ముదయింప యోగి చతుర్థభూమిక యందు ఈ జగత్తును స్వప్నతుల్యముగ వీక్షించును. పంచమభూమికయందు యోగి మిక్కిలి అంతర్ముఖుడై యుండి సుషుప్తుని (నిద్రించువాని) పగిది కానుపించును. తురీయమను ఆఱవ భూమికయందు సముద్రమందలి పూర్ణఘటమువలె ఆత్మయందు మగ్నుడై వెలయును. తదుపరి ఏడవభూమిక యందు ప్రవేశించి

కేవలము శివస్వరూపుడై విదేహముక్తుడై వెలుగొందును. ఈ సప్తభూమికల యభ్యాసముచే జీవుడు దుఃఖానుభవ మొందడు.

ఓ రామచంద్రా ! ఇచ్ఛ (వాసన, లేక మనస్సు) అను ఏనుగును ధైర్యమను అస్త్రముచే జయించినవాడీ భూమికల యందు విజయము నొందును. లేకున్న ఈ సంసార సమర భూములందెవడు ప్రవేశింప గలుగును?! ఇది నాకు లభించుగాక ! అను నిట్టి రూపమగు మనస్సే సంసారము ఆ మనస్సు శమించుటయే మోక్షము. ఇదియే జ్ఞాన సంగ్రహము. వెయ్యేల ! సంకల్పమే పరమబంధము. అద్దాని అభావమే మోక్షము.

శ్రీ వసిష్ఠ మునీంద్రుని యా బోధ విని శ్రీరామచంద్రుడు ప్రబుద్ధుడై ఆత్మానందమగ్నుడై ప్రశ్నోత్తరవర్జితుడై రెండు ఘడియల కాలము ఆత్మయందు విశ్రమించెను, సమాధి యందుండెను. శ్రీరామచంద్రుడట్లు సమాధియందాత్మస్వరూపమున స్థితుడై యుండు నపుడు విశ్వామిత్రుడు వసిష్ఠ మునీంద్రునితో నిట్లనెను - ఓ మునీంద్రా ! మీరు మీ యనుగ్రహముచే శ్రీరామచంద్రుని జ్ఞానయుతునిగ జేసిరి. కాని నేను ఇపుడు ఏ కార్యము నుద్దేశించి యిట కేతెంచితినో అద్దానిని స్మరించి మీరాతనిని సమాధి నుండి మేలుకొలుపవలెను. భక్త రక్షణాది అవతార ప్రయోజన రూపములగు కార్యము లెన్నింటినో అతడు మున్ముందు చేయవలసి యున్నది. అప్పుడు వసిష్ఠుడు శ్రీరామచంద్రుడు ఈ జన్మకు పూర్వము దేవుడా, మనుజుడా చెప్పవలసిలనదిగా కోరగా, అతడు (శ్రీరాముడు) కేవలము సృష్టి స్థితిలయ కారకుడును జననమరణ రహితుడును భక్తవత్సలుండునునగు పరమాత్మయే, అయి యున్నాడు అని విశ్వామిత్రుడు వాక్రుచ్చెను.

భరద్వాజుడు:- (వాల్మీకితో) మహాత్మా ! శ్రీరామచంద్రునకు ఆత్మపదము సంప్రాప్తించినది. అట్టి స్థితి నాకెట్లు కలుగును? నేనీ సంసార మెట్లు దాటగలను?

వాల్మీకి:- భరద్వాజా ! వసిష్ఠ ప్రోక్తములగు సదుపదేశములను అనుభవమునకు తెచ్చుకొనుము. ఈ జగత్తు వాస్తవముగ లేదు, ఆత్మయే

సత్యము. అట్టి ఆత్మయందే నీవు స్థితి గలిగియుండుము, చిత్తము శుద్ధమగు వఱకును సాకారమగు శ్రీ శంకరుని రూపమును ధ్యానింపుము. ఈశ్వరానుగ్రహము చేతనే మనుజునకు వాంఛిత ఫలము లభించును.

భ :- తామువచించినది యెఱింగితిని. వైరాగ్యమునకు మించిన బంధువుగాని సంసారమునకు మించిన శత్రువుగాని లేదు. ఇపుడిక శ్రీవసిష్ఠ మునీంద్రుడు వచించిన జ్ఞానసారమును తెలిసికొన గోరుచున్నాను.

వాల్మీకి :- ఎద్దాని శ్రవణ మాత్రముచే సంసార సాగరమున నిక మునుగకుందువో అట్టి ముక్తిదాయకమగు జ్ఞానమును వచించెద వినుము:- శమ దమ వైరాగ్యశ్రద్ధాది సమన్వితుడవై, ఇంద్రియములను జయించి, దేహేంద్రియాది దృశ్యజాతము నంతయు వాని వాని కారణములందు లయముచేసి ఆత్మమాత్రుడవై శేషింపుము. (ఆత్మయందు సమస్తమును లయము చేసి ఆత్మమాత్రుడవై శేషింపుము). (ఆత్మయందు సమస్తమును లయము చేయుము) అదియే తురీయ పదము. ''అట్టి పరమాత్మయే నేను'' అని ధ్యానింపుము. అపుడే నీవు ముక్తుడ వగుదువు. ఆత్మయందు మనస్సు అస్తమింప మనుజున కిక ఆత్మయే మిగిలి యుండును. అట్టి ఆత్మామృత సముద్రమున మునుక లిడుము. అట్టి ఆత్మాజ్ఞాన సిద్ధికై జగద్గురువగు శ్రీ శంకరుని (ఈశ్వరుని) భజింపుము - ఇదియే వసిష్ఠ మునీంద్రుని యుపదేశసారము.

భ :- మహాత్మా ! శ్రీరామచంద్రుడు సమాధి ద్వారా ఆత్మతోటి ఏకత్వమును బొందిన పిదప మరల వసిష్ఠ మునీంద్రు డాతని నెట్లు వ్యవహారమున బ్రవేశింప జేసెను? వాల్మీకి పలికెను - తదుపరి వసిష్ఠ మునీంద్రుడు శ్రీరాముని నుద్దేశించి ''ఓ రామా ! రామా ! ఇది సమాధియందు విశ్రాంతి నొందు కాలము కాదు. లోక సంగ్రహ మొనర్చి ప్రపంచమునకు ఆనందదాయకుడవు కమ్ము'' అని చెప్పగా నిర్వికల్పసమాధిస్థుడైయున్న రామచంద్రుడు ప్రత్యుత్తర మేమియు నీయక యున్నందున అత్తఱి క్రమముగ శ్రీరామచంద్రుడు ప్రబుద్ధుడై

వసిష్ఠ మునీంద్రునితో ''మహాత్మా! తమ కృపచే నేను బ్రహ్మ (ఆత్మ) స్వరూపుడనై విధి నిషేధములకు పాత్రుడను గాకున్నను తమ యాజ్ఞ ప్రకారమే యాచరించెదను'' అని విన్నవించి యాతని చరణములకు శిరస్సుచే వందన మాచరించి సభ్యులెల్లరకు నిట్లు చెప్పెను - ''ఓ సభ్యులారా! వినుడు. మహా నిశ్చయమగు వార్త యిదిగో - ఆత్మజ్ఞానము కంటెను, దానినెఱింగిన గురువు కంటెను నుత్తమమైన దేదియు ఈ ప్రపంచమున లేదు.

ఓ భరద్వాజా! అది విని సిద్ధాదు లందఱును శ్రీరాముని స్తుతించి నమస్కరించి వారి వారి స్థానములకు వెడలిపోయిరి. అత్తఱి శ్రీరామచంద్రుని శిరంబుపై పుష్పవృష్టి కురుసెను - ఈ ప్రకారముగ శ్రీరామచంద్రుని యాఖ్యానము నంతయు నీకు వచించితిని. అదే రీతిగా నీవున్ను ఆచరించి సుఖింపుము. మోక్షప్రదమగు ఈ వసిష్ఠ రామచంద్ర సంవాదము నెవడు ప్రతి దినము శ్రవణము చేయునో ఆతడట్టి శ్రవణ మాత్రము చేతనే సర్వదోషరహితుడై తదుపరి శాంత్యాది గుణముల ద్వారా బ్రహ్మమును బొందును.

ఓం తత్ సత్

నిర్వాణ ప్రకరణ పూర్వార్థము సమాప్తము.

# 6. నిర్వాణ ప్రకరణము (ఉత్తరార్థము)

శ్రీ వసిష్ఠ మునీంద్రు డిట్లు పలికెను - ఓ రామచంద్రా ! దేహాది దృశ్యవస్తువులు సత్యమను అభిమానమే సంకల్పమనబడును. సర్వత్ర బ్రహ్మాకాశ సత్తయొక్క భావనయే సంకల్ప త్యాగమనబడును. అనుభూత, అననభూత పదార్థముల నన్నింటిని విస్మరించి బ్రహ్మాకార వృతియందు లీనమై కాష్ఠము పగిది నిశ్చలముగ నుండుము. నేను భుజములనెత్తి చాటుచున్నాను. సంకల్పమే బంధము. అసంకల్పమే పరమశ్రేయము. దృశ్యరహితమగు ఆత్మతత్త్వమే అసంకల్పము. కావున సంకల్పమును వీడి అసంకల్ప రూపమగు ఆత్మయందు స్థిరుడవై యుండుము. ఓ రామ చంద్రా ! కర్మయను వృక్షమును సమూలముగ ఛేదించి వేయవలెను. సమస్త కర్మలకును ఆదిబీజము జీవుడు లేక అహంకారము. జీవుడు అహంకారముతో కలిసి యుండునపుడు కర్మబీజత్వమును బొందును. అహంకారముకంటే భిన్నమైన శుద్ధ చిద్రూపమును భావించుటచే పరమాత్మ రూపుడే యగుచున్నాడు. చిదాభాస (జీవ) శూన్యమగు చిద్రూప సత్తయే మోక్ష మనబడును. దేహమున్నంతవఱకు చిత్తము యొక్క గాని కర్మముల యొక్కగాని త్యాగము సంభవింపదు. జ్ఞానముద్వారా 'అసంగ అద్వితీయ చిన్మాత్రమును నేను. శుద్ధ చిద్రూపుడనగు నేనేమియు చేయుటలేదు' అనునిట్టి నిష్క్రియ ఆత్మస్వభావస్థితిచే కర్మ అకర్మలగూర్చిన వికల్పమును త్యజించి జీవుడు స్వయముగ బ్రహ్మరూపుడగు చున్నాడు. ఓ రామచంద్రా ! చిదాభాసుని రహిత మొనర్చి అనంత నిశ్చల బ్రహ్మరూపుడవై మూలసహితముగ సంసారమును ఛేధించి వేయుము. నిశ్చల ఆత్మస్థితియే యథార్థమైన కర్మత్యాగము. అహంభావమే సంసారమునకు మూలము. అయ్యది అనహంభావనా ఆత్మభావనా మాత్రముచే శమించును. ఈ శరీరాదులు నేను, ఈ ధనాదులునావి. ఇత్యాది రూపమగు జగత్తు శమింప బోధరూపమగు శాంత ఆత్మయే శేషించును. నిర్మల చిత్తముగల మనుజునియందు నిర్మల వస్త్రముపై రంగువలె స్వల్ప ఉపదేశమైనను బాగుగ ప్రవేశించును. మలిన చిత్తునియందట్లు ప్రవేశింపదు.

ఇవ్విషయమున కాక భుశుండుడు నాకు జెప్పిన ఒక పురాతన వృత్తాంతమును వినుము.

## విద్యాధరోపాఖ్యానము

పూర్వము మేరుపర్వత శిఖరమున ఏకాంత ప్రదేశమందున్న భుశుండుని అధ్యాత్మ కథా ప్రసంగమున నేనిట్లడిగితిని - మహాత్మా! ఆత్మజ్ఞాన రహితుడును, దీర్ఘకాలము జీవించిన వాడును నగు ఏ ప్రాణియైన మీకు స్మృతియందు కలదా? అది విని భుశుండు డిట్లు పలికెను. లోకాలోకాంతర పర్వత శిఖరముపై అట్టివాడగు ఒక విద్యాధరుడు పూర్వముండియుండెను. తపనియమాదులచే నాతడు దీర్ఘజీవియై నాలుగు కల్పముల వఱకు బ్రతికెను. నాల్గవ కల్పము యొక్క చివఱ కాలమున నాతనికి చిరకాల సాధనచే వివేక ముదయింప జరామరణ రహితమైన స్థిరవస్తువేది గలదు? అని చింతించి ఆ విషయమును నన్నడుగుటకు గాను నావద్ద కేతెంచి యిట్లు నుడివెను. -

మహాత్మా! చిరకాలము కాంతాద్యనేక భోగముల ననుభవించి వానిలో సారములేదని గ్రహించి అవి దుఃఖప్రదములుగనే యెంచి తుదకు విరక్తిబొందితిని. దుఃఖరహితమై క్షయాతిశయ వర్జితమై ఆనంద రూపమైనట్టి పరమపావనపద మెయ్యది గలదో నాకు శ్రీఘ్రముగ వచింపుడు. ఈ దుష్టఇంద్రియములు నన్ను బహుకాలము వేధించినవి. వానినిజయించుట మహా కష్టతరముగా తోచుచున్నది. వానిని జయించిన వాడే నిజమైన శూరుడని నా మతము, ఇంద్రియములను భయంకర రోగముల శాంత్యర్థము, జ్ఞానార్జనయే పరమౌషధమని నేను తలంచు చున్నాను. మహాత్మా! దుష్టములగు ఇంద్రియములచే జనింపబడిన ఆపత్సముద్రమున మునింగిన నన్ను దయచేసి యుద్ధరింపుడు.

ఇట్లాతడు వచింప నేనిట్లంటిని - ఓ విద్యాధరా! నీవు వైరాగ్యాదియుతుడవై యొప్పుచుంటివి గావున నే నుపదేశించు దానిని ప్రయాసము లేకుండగనే గ్రహింపగలవు. మేము బహుకాలము విచారణ సలిపి నిశ్చయించినది గావున నేను వచించు దానిని అంగీకార బుద్ధితో గ్రహింపుము. సత్తువలె భాసించినప్పటికిని ఈ జగత్తు ఎండమావులవలె

అసత్తని, అవస్తువని (లేనిదిని) యెఱుంగుము. ఉన్నది ఆత్మయొకటియే, అదియే సత్యము. రజ్జు సర్పమువలెను, జలతరంగము వలెను, అదియే ఈ జగద్రూపమున భాసించుచున్నది. నామరూపాత్మకమగు ఈ జగత్తునకు బీజము అహంకారము. అద్దానిని ఆత్మజ్ఞాన రూపమగు అనహంభావనయను అగ్నిచే కాల్చివైచినచో ఉన్నప్పటికిని మరల మొలకెత్తదు. శస్త్రములచే దెబ్బ తగిలినప్పుడుగాని, స్త్రీ యొక్క అవయవములు దిగంబర శరీరమునకు తగిలినప్పుడుగాని ఎవడు నిర్వికారుడై అవి తగులకుండ యున్నట్లే యుండునో, అట్టి జితేంద్రియు డగు మనుజుడు పరమాత్మ పదమున నున్నవాడే యగును. ఆత్మనెఱింగిన తత్త్వజ్ఞునకు గొప్ప మానసిక వ్యథయైనను ఏమియు చేయ జాలదు. మనస్సు, అహంభావము, బుద్ధి, దేశకాలాదుల యనుభవము మున్నగునవి యన్నియు అవిద్యయనియే యెఱుంగుము. ఆ యవిద్య ఆత్మజ్ఞానమను పురుష ప్రయత్నముచే నశించును. అవిద్య యొక్క అర్ధభాగము శాస్త్రవిచారణ సత్సంభాషణాదుల చేతను, తక్కిన యర్ధభాగము ఆత్మసాక్షాత్కారము చేతను నశించును. స్వప్నమును స్వప్నమనుజుడు కాంచునట్లు ఈ సృష్టి ఏ మనుజుని మనంబున ఉదయించునో, అతడే అద్దాని ననుభవించును. ఇవ్విషయముననొక అఖ్యానమును వచించెద వినుము.

## ఇంద్రోపాఖ్యానము

మాయాశబలిత బ్రహ్మమను కల్పవృక్షమున ఆవిర్భవించిన అనేక బ్రహ్మాండములను ఫలములం దొకానొక బ్రహ్మాండము నందలి ఇంద్రుడు గురూపదేశ స్వాభ్యాసములచే అజ్ఞానావరణ రహితుడై యుండెను. ఒకపుడాతడు అసురులతో యుద్ధ మొనర్చి పరాజితుడై పారిపోయి, విశ్రాంతిస్థాన మెచటను గానక తుదకు సూర్యకిరణ కోశమందలి యొక త్రస రేణువునందు ప్రవేశించి, అచట విశ్రాంతి లభింప సుఖముగ నుండెను. క్రమము నాతడ చట తనకల్పనచే పర్వత నగరవనాది సహితములగు ముల్లోకములను వీక్షించెను. ఆ త్రిలోకమున నాతడు దేవతాధీశుడై నివసింపదొడగెను. కాలక్రమమున నాతడు దేహమును

త్యజించి నిర్వాణ (మోక్ష) మును బొంద అతని పుత్రుడగు కుందుడు రాజయ్యెను. అతడున్ను కొంత కాలమునకు దేహమును వీడి పరమపదమును బొంద అతని సుతుడు రాజయ్యెను. ఈ ప్రకారముగ ఆ త్రస రేణువునందు ఇంద్ర సంకల్పితమగు ఆ రాజ్యమున ఆ వంశమందలి అంశకుడను రాజు నేడు పరిపాలన చేయుచున్నాడు. ఆ వంశమందలి ఒకానొక ఇంద్రుడు బృహస్పతి యొక్క యుపదేశముచే ఆత్మజ్ఞాన మొంది యథా ప్రాప్తకర్మల నాచరించుచు నూఱు అశ్వమేధయాగముల జేసెను. ఒకప్పుడేదో యొక కార్యవశమున నాతడు కమలదండ సూత్రమున నివసించి యచట యుద్ధాద్యనేక కార్యముల ననుభవించెను. ఒకానొక సమయముననాతనికి ధ్యానమందుండి (మాయా శబిలిత) బ్రహ్మము యొక్క స్వరూపము నవలోకించెదను' అను కోర్కె పొడమెను. అట్లే యాతడేకాంతమున ధ్యానస్థుడై సర్వ వ్యాపకమును, సర్వశక్తి యుతమును, అనంత హస్తపాదాది సమన్వితమును, చరాచర రూపమును చిన్మయ మును నగు బ్రహ్మమును వీక్షించెను. అత్తఱి యాతడు బ్రహ్మాండము లన్నింటిని పరమాత్మ యందు గాంచుచు ఈ మనఃబ్రహ్మాండమును గూడ జూచి యందు విహరించుచు ఇంద్రుని వద్దకు బోవ పూర్వపు ఇంద్ర సంస్కారము గలవాడగుటచే ఆ యింద్రుని యనంతర మింద్రు డయ్యెను. ఈ ప్రకారముగా త్రస రేణువందలి ఇంద్రవంశమున జనియించిన రాజు ఈ బ్రహ్మాండమున ఇప్పటికిని ఇంద్రుడుగ నున్నాడు. ఇట నింద్రుడుగ నున్నతఱి కమలదండ సూత్రమందలి తన నివాసాది వృత్తాంతము లన్నియు నాతని స్మరణకు వచ్చెను. ఆ ఇంద్రుని వంటి ఇంద్రులెందఱో ఈ (మాయా శబలిత) చిదాకాశమున గలరు. మఱియు నట్టి వ్యవహారము లెన్నియో యీ చిదాకాశమున విద్యమానములై యున్నవి. ఆత్మ సాక్షాత్కారము కలుగనంత వఱకు ఈ దృశ్యమను నది నిరంతరము ప్రవహించుచునే యుండును.

ఈ దృశ్య జగత్తునకు బీజము అహంకారము. ఆ యహంకారము అనహంభావమను జ్ఞానముచే నశించును అపుడు నిర్వాణరూపమగు

ఆత్మయే శేషించును. ఓవిద్యాధరా! అహంకారమును నశింపజేసి అట్టి ఆత్మయందు నీవు నిలకడ కలిగి యుండుము.

ఓ మునీంద్రా ! ఈ ప్రకారముగ నేనా విద్యాధరునకు వచించు చుండ నాతని దృశ్యవృత్తులన్నియు శమించుటచే నాతడు సమాధినిష్ఠు డాయెను. అత్తఱి నేనెంత మేలుకొలిపినను నాతడా సమాధి స్థితి నుండి లేవకుండెను. కనుకనే శుద్ధ చిత్తమున ఉపదేశము శీఘ్రముగ ప్రవేశించి విస్తరించునని నే నిదివఱకు చెప్పితిని. ఆత్మస్వరూపుడవగు నీ యందు వాస్తవముగ అహంకారము లేదు. కాబట్టి అసత్యమగు ఆ యహంకార మును గూర్చిన భావన చేయకుము. ఇదియే పరమోత్తమ మగు ఉపదేశము. ఇట్టి యుపదేశము విచారరహితులగు సాంసారిక జనుల మనంబున బడినను నయ్యది ప్రతిబింబించదు. ఈ ప్రకారముగ ఆత్మజ్ఞాన రహితులును అపుడపుడు చిరంజీవులగుదురు. కాని చిరజీవనమునకు ముఖ్యకారణము తత్త్వజ్ఞానమే యని యెఱుంగుము.

ఓ రామచంద్రా ! మేరు పర్వత శిఖరమునౌ ఆ పక్షిరాజగు భుశుండు డిట్లు పలికి మౌనముగ నుండ నేనాతని వద్ద సెలవు గైకొని ఆ సంవాదమును గూర్చి యడుగుటకై ఆవిద్యాధరుని కడకేగి తదుపరి నిజవాసమున కరిగితిని. అట్లు భుశుండునితో నేను సంభాషించి యిప్పటికి పదునొకండు మహాయుగములు గడచినవి.

ఓ రామచంద్రా ! ఆయా జీవుల సంకల్పముచే కల్పితములగు అనేక బ్రహ్మాండము లీ యాకాశమున పరిభ్రమించు చుండుటను నేనిపుడు నాయెదుట గాంచుచున్నాను. నీవున్ను బుద్ధిదృష్టిచే గాంచుము. ఈ బ్రహ్మాండములన్నియు క్షణభంగురములు, మిథ్యారూపములు; గంధర్వ నగర తుల్యములు, అజ్ఞానాంధ కారముచే ఆవృతములు, చిద్రూప పరమాత్మ యొక్క వివర్తములు, మిథ్యారూప మగు యీ దృశ్యము నుండి చిత్తమును మరలించి సత్యస్వరూపమగు ఆత్మయందు జేర్చి పరమానందము నొందుము. మాయాశక్తిచే నాచ్ఛాదితుడగు జీవుడు దృశ్యాది ద్వైత రూపమునే కాంచును గాని తన శుద్ధ రూపమును వీక్షింపడు. జ్ఞానముచే అహంకారమను అజ్ఞాన గ్రంథి నశింప

బంధవిముక్తుడై తన యథార్థ (ఆత్మ) స్వరూపము నవలోకించును. అదియే మోక్షము. ఓ రామచంద్రా! మనుజుడు జ్ఞాని కావలెనేగాని జ్ఞానబంధువు కాగూడదు. జ్ఞానబంధువు కంటె అజ్ఞానియే శ్రేష్ఠుడని నా యభిప్రాయము. శాస్త్రములను జీవికోపార్జన కొఱకు పఠించువాడును, పఠించియు అనుష్ఠింపని వాడును జ్ఞానబంధు వనబడును. దృశ్యమును మిథ్యగ నెఱుంగువాడును, వాస నా రహితుడును, ఆత్మలాభముచే సంతుష్టుడును, యథాప్రాప్త కర్మలను శాంత చిత్తముతో కామసంకల్ప వర్జితముగ నాచరించువాడు జ్ఞాని యనబడును.

అజ్ఞాని వాసనా సహితుడై దృశ్య పదార్థములు సత్యములని యెంచి వ్యవహరించును, జ్ఞాని వాసనారహితుడై దృశ్య పదార్థములు అసత్యములని యెంచి వ్యవహరించును. ఇంత మాత్రము భేదము తప్ప వ్యవహారమందు వారిరువురికిని మరియే విశేషమున్ను లేదు.

ఓ రామచంద్రా ! మంకి యను బ్రాహ్మణుని వలె సమస్త సంసార వాసనను త్యజించి తత్త్వబోధచే సంసారమును దాటి ఆత్మ పదమును పొందుము.

## మంక్యుపాఖ్యానము

పూర్వమొకపుడు నీ పితామహుడగు అజునివలన ఒకానొకకార్యము నిమిత్తము ఆహ్వానింపబడి నేనతని కడకు బోవుచుండ త్రోవలో నొక మహా ఆతపసంయుక్తమగు విశాలారణ్యమును బొందితిని. అయ్యది ధూళిచే ధూసరితమై విశాలమై, శూన్యమైయుండెను. అట్లునేనా మహారణ్యమున సంచరించుచుండ నింతలో నొక బాటసారిని అచ్చోటగాంచితిని. 'ఆహా ! ఈ ఎండ తీక్ష్ణముగనున్నది ! ఈ మహా ఆ తపముచే నా అవయవములు శిథిలములగుచున్నవి. కావున ఎదుటనున్న ఈ చిన్నిగ్రామమున బ్రవేశించి సేదదీర్చుకొని తిరిగి వెడలెదను' అని యాతడనుకొనుచు ఆ గ్రామమున ప్రవేశింపదలంచుచుండ 'అయ్యది దుష్టులనివాసమైన గ్రామ మనియు, దుష్టులసహవాసము చేయరాదనియు చెప్ప' అతడిట్లు వచించెను - 'మహాత్మా ! తామెవరో మహనీయులుగ గన్పట్టుచున్నారు, తామెవరు? నేను శాండిల్యగోత్రోత్పన్నుడనగు మంకియను బ్రాహ్మణుడను,

తీర్థయాత్రకై చాల దూరమేగి, అనేక తీర్థములగాంచి తిరిగి గృహమునకు జనుచున్నాను. ప్రాణులయొక్క క్షణికమైన స్థితిని జూచి నేను వైరాగ్యయుక్తుడనుకాగా, నాకిపుడు గృహమునకు బోవ నిష్టములేకున్నది. ఇంద్రియాదులు నన్ను వేధించుచున్నవి. నా అజ్ఞానమింకను నశింపలేదు. ప్రాపంచిక సుఖములు దుఃఖరూపములుగ తోచుచున్నవి. మఱియు సాంసారిక సుఖముల కంటె దుఃఖములనే ఉత్తమములుగ నేను తలంచుచున్నాను. కావున మహాత్మా ! దయచేసి ఆత్మతత్త్వమును నాకెఱింగింప వేడెద!'

అపుడు నేనాతనికి నేనెవరో, ఎచటికి బోవుచుంటినో చెప్పి మఱియు నిట్లు ప్రబోధించితిని - ఓ ద్విజుడా! నీవు వైరాగ్యయుతుడవైతివి. కావున సంసారమును తరించితి వనియే నేను తలంచుచున్నాను. ఏలయనగా వైరాగ్యాది సాధనయుక్తుడే జ్ఞానోదేశమునకు అధికారి. అట్టివాడే జ్ఞానముద్వారా ఆత్మను బొందగలడుగాని తదితరులుకాదు. వాసనల వలననే జీవుడీ సంసారమున బంధింపబడుచున్నాడు. సమస్త అనర్థములకును కారణము ఆ వాసనలే. కావున జ్ఞానముచే వానిని సమూలముగ నశింప జేయవలెను. ఈ జగత్తంతయు వాస్తవముగ ఆత్మస్వరూపమే. నామరూపాత్మకమగు దృశ్యమును మిథ్యగ నెఱింగి వాసనారహితుడవై సత్యమగు ఆత్మయందే స్థితి గలిగియుండుము. అహంకారమును త్యజించినచో ఆత్మసత్తయే శేషించును. ఆత్మయే సర్వత్ర పరిపూర్ణమైయున్నది. జ్ఞానియగువాడు వ్యవహార మాచరించుచున్నను తన ఆత్మ స్వరూపముననే స్థితిగల్గియుండును. పదార్థముల గూర్చిన అభిలాషయే బంధము. తత్త్యాగమే మోక్షము. సమస్త అభిలాషా రహితుడై దేహాదులగూర్చిన యభిమానములేక జ్ఞాని కేవలము తన ఆత్మయందే స్థితుడై యుండును' - ఈ ప్రకారమగు నా యొక్క బోధను విని తత్కాలముననే యా బ్రాహ్మణుడు సంసార మోహమును పారద్రోలి వాసనారహితుడై యథాప్రాప్తకార్యముల జేయుచు నూఱువత్సరముల యనంతరము ఒకానొక పర్వతముపైకి జని సమాధినిష్ఠుడై నిశ్చలముగ నుండెను. ఇపుడును అతడట్లే యందున్నాడు. ఎవరైన మేలుకొలిపినచో మేలుకొనును.

ఓ రామచంద్రా ! మంకివలె నీవున్ను జ్ఞానయుతుడవై వివేకము ద్వారా స్వాత్మానందమున విహరింపుము. రాగయుక్తుడవై దీనత్వము నొందకుము, ఆత్మయందు స్థితిగల్గి అంతర్ముఖుడవై బాహ్యమున యథాప్రాప్తములగు సమస్త కర్మలను రాగ రహితముగ నాచరింపుము. ఈ ప్రకారముగ మెల్ల మెల్లగ నభ్యసించుచు, ఆద్యంత వర్జితమై సర్వపదార్థాతీతమైనట్టి ఆత్మపదమును బొందుము. ద్వైతముగాని ఏకత్వముగాని, ఈ జగత్తుగాని వాస్తవముగ లేవు అను నిశ్చయము గలిగి విశాలాంతఃకరణయుక్తుడవై పరమవిశ్రాంతిని బడయుము.

శ్రీరాముడు - మునీంద్రా ! పదార్థములన్నియు మిథ్యయైనచో రాముడను నేనెవరు, వసిష్ఠుడను తామెవరు; ప్రశ్నోత్తర వ్యవహారమే అపుడు సంభవింపదుగదా! శ్రీరాముడుడిట్లు పలుక నంత వసిష్ఠమునీంద్రుడు ఒక ఘడియకాలము స్పష్టముగ మౌనమును ధరింప అపుడు సభాసదు లందరును 'ఇపుడేమగునో' అను సంశయమున మగ్నులైరి. అత్తఱి శ్రీరాముడు 'తాము మౌనమేల ధరించిరి? విజ్ఞులగు గురువులు బదులివ్వ జాలని ప్రశ్నయేదియు నుండదు' అని వచింప అంత ఆ మునీంద్రుడిట్లు పలికెను -

ఓ రామచంద్రా ! చెప్పుటకు యుక్తి దొరకక అట్లు మౌనమే ప్రత్యుత్తరము కావున నట్లుంటిని. అజ్ఞానికి అజ్ఞానరీతిగను జ్ఞానికి జ్ఞానరీతిగను ప్రత్త్యుత్తర మీయవలసి యున్నది. నీవు ఆత్మపదమెఱింగి జ్ఞానివైతివి, కావున జ్ఞాన పూర్వకముగ నీకు ప్రత్యుత్తర మొసగితిని. ఏలయనగా ఆత్మ వాగాది పరిచ్ఛేదములకు అతీతమై మౌనరూపమై యున్నది. వాగాతీతమగు ఆత్మపదమున నున్నవాడు వాగ్రూప మలము నెట్లు ధరించును. కాబట్టి అవాచ్యమగు ఆత్మను మౌనము ద్వారాయే నీకు నిరూపించితిని.

నిత్య నిరతిశయానంద రూపమై దుఃఖాది క్షోభవర్జితమైనట్టి ఆత్మయందలి స్థితియే మోక్షమనబడును. 'నేను చిద్రూపమగు ఆత్మను' అను నిశ్చయము సంసారమను అగ్నిని శమింప జేయుచున్నది. సమస్త అవిద్యలకు మూలమై మోక్షపదమును గప్పునదియైనట్టి అహంకారమను

మలమును పూర్ణముగ విడినాడి జ్ఞాని నిర్మల చిదాకాశమున సంతాప రహితుడై వెలయుచుండును. వ్యవహార నిమగ్నుడైనను అతడు ఏ క్షోభయులేక సమరూపమున నుండును. 'నేను (దేహాదులు) గాని ఇతరముగానిలేదు' అను నిట్టి అనహంభావనచే నిర్భయుడవై చెన్నొందుము. ఓ ముముక్షువులారా! మోక్షప్రాప్తికై భోగ త్యాగము, తత్త్వ విచారము, ఇంద్రియ మానసాదుల నిగ్రహము అను పురుషప్రయత్నము తప్ప మఱియేదియు నుపకరింపదు. కావున అనాత్మ వస్తువులన్నింటిని త్యజించి శీఘ్రముగ మీ యాత్మనే శరణుబొందుడు. వాసనా రహితమగు మనస్సుయొక్క బ్రహ్మరూపస్థితియే మోక్షమని పెద్దలచే వచింపబడినది. అయ్యది తత్త్వజ్ఞానములేక ఎన్నడును సిద్ధింపదు. జగత్తు భ్రమ మిథ్య ఆత్మ సత్యము అనునదియే ఉత్తమజ్ఞానము. ఇట్టి జ్ఞానమందు దృఢవిశ్వాసము లేనందుచేతనే జీవులకు చిరకాలము బంధనము సంభవించుచున్నది.

నేనెవరను? ఈ దృశ్యమేమి? జీవుడెవరు? - ఈ ప్రకారమగు విచారణను తత్త్వజ్ఞుని సాంగత్యమున యావజ్జీవితము గావింప వలయును. తత్త్వజ్ఞుడగు మహాత్ముని సహవాసముచే అహంభావ మను బంధము క్షయించును. శాస్త్రీయ ప్రతి కల్పనచే అశాస్త్రీయ (వాసనారూప) కల్పనను ఛేదించి వేయవలెను. అహంభావ నాశము కొఱకై అనహంభావ (బ్రహ్మభావ) రూప ప్రతికల్పనను గావింపవలయును. ఇహలోక పరలోక రూపములగు రెండు మహాఘోర వ్యాధులు జీవునకు గలవు. అందు ఇహలోకమునకు జెందిన వ్యాధుల నివారణకై ఔషధ సేవనాది యత్నములను జనులు గావించుచున్నారు గాని, పరలోక వ్యాధి నివారణకై యత్నించుట లేదు. ఉత్తములు శమ సత్సాంగత్య జ్ఞానములను అమృతతుల్య ఔషధములచే పరలోక రూప మహావ్యాధి నివారణకై యత్నించుచున్నారు. భోగములను త్యజించి శమ జ్ఞానములను సేవించినచో మోక్షప్రాప్తి యందు విజయము చేకూరును. నరకమును మహావ్యాధికి ఈ మనుష్య శరీరముననే యెవడు చికిత్సను గావించుకొనడో అట్టివాడు సత్సంగ, శాస్త్రాది ఔషధ శూన్యమగు నరక స్థావరాది స్థానములకు రోగ సహితముగబోయి యేమి చేయగలడు?

అయువు మిగుల చంచలమైనది. కాబట్టి ఆత్మజ్ఞానాది ఔషధములచే పరలోక వ్యాధికి చికిత్స వెంటనే గావించుకొనవలెను. అత్తఱి ఇహలోక వ్యాధి తనంతట నదియే శీఘ్రముగ శమించును.

ఈ జగత్తు దర్శన మాత్రముచే జనించుచు, అదర్శనమాత్రముచే శమించుచు నున్నది. కావున ఇది దృష్టిమాత్రమే అయియున్నది. ఇట్లే జగత్తు కల్పనా మాత్రమే అయియున్నందున విచారణచేనది శమించి పోవుచున్నది. భోగేచ్ఛా త్యాగమే పరమ సమాధి యని చెప్పబడునది. విషయములందలి నీరసత్వమును గ్రహించి భోగ రూప రోగములకు చికిత్స నొనర్పనిచో నిక శాంతి యెచట? ఇచ్ఛాత్యాగముచే మనస్సు శాంతించునట్లు మఱియెన్ని యుపదేశముల చేతను శాంతించదు. ఇచ్ఛయే దుఃఖదాయకమగు చిత్తము. ఇచ్ఛా శాంతియే మోక్షము. ఇచ్ఛా శాంతియే సమస్త శాస్త్ర తపయమ నియమాదుల తాత్పర్యమై యున్నది. ఇచ్ఛ యెంతెంత యుదయించుచుండునో జీవునకు దుఃఖ మంతంత వృద్ధి యగుచుండును. వివేకముచే నయ్యది యెంతెంత తగ్గుచుండునో దుఃఖము, చింత అంతంత తగ్గుచు నుండును. ఒక్క పర్యాయమే ఇచ్ఛలన్నిటిని త్యజింప జాలనిచో కొంచెము కొంచెముగా వానిని త్యజించుచు రావలయును. ఏలయనగా సన్మార్గమున బోవువానికి దుఃఖమెన్నటికిని గలుగదు. వెయ్యేల, ఇచ్ఛయే సంసారము, తత్త్యాగమే మోక్షము. కావున ఇచ్ఛారాహిత్యమునకై బుద్ధిమంతులు ప్రతిక్షణము నన్ను ప్రయత్నింప వలెను.

మనుజునకు జ్ఞాన మెంతెంత ఉదయించుచుండునో దృశ్యరూప మగు ద్వైత మాతనికి అంతంత శమించుచు, వాసన లయించుచు నుండును. కావున దృశ్యమే లేదను రూఢభావన గలిగియున్న జ్ఞానికిక విషయములం దిచ్ఛ యెట్లు జనించును? ఒకవేళ జనించినను అయ్యది (అతనికి) బ్రహ్మస్వరూపమే యగును. ఎవనికి ఈ విశ్వమంతయు రోమము యొక్క లేశముతో సమానమో, అట్టి జ్ఞానికిక (ఏపదార్థముచే) నెవడీ ముల్లోకమున లోభింప జేయగలడు? ఓ రామచంద్రా ! ఈ దృశ్యాదులు సదా దుఃఖదాయకములును, భ్రమరూపములునై యున్నవి. కావున అసత్తగు ఈ దృశ్యమును భావన చేయకుము.

నాశరహితమగు నిర్వాణ రూపమైన ఆత్మయందే నెలకొని యుండుము. దృశ్యమున్నచో మహాదుఃఖము, లేనిచో మహాసుఖము కలుగును. కాబట్టి బంధన హేతువగు ఈ దృశ్యమును జ్ఞానాగ్నిచే భస్మీభూత మొనర్పుము.

ఓ రామచంద్రా! వివేకమను కానుక నర్పించి సచ్చిదానంద రూపుడగు ఆత్మదేవుని నీవు పూజింపుము, అట్లు వివేకముచే పూజితుడగు ఆత్మ నిరతిశయానంద మను వరమును ప్రసాదించును. ఇట్టి పరమాత్మ యొక్క పూజ ముందు తక్కిన దేవతాదులగూర్చిన పూజలు తృణసదృశములు. ఏలయనగా విచార శమసత్సంగాది పుష్పములచే పూజితుడైన ఆత్మరూప పరమేశ్వరుడు తత్కాలమే మోక్షమను ఫలము నొసంగును, కావున నీవు బహిర్ముఖ వృత్తులను వదలి వాసనారహితుడవై ఆత్మబోధ యందు మగ్నుడవై జన్మాది రహిత నిర్వాణ రూపుడవు కమ్ము. అజ్ఞానమను జ్వరము పోయినవాడును, జ్ఞానమను శీతలత్వము గలవాడును నగు మనుజుని చిహ్నము అతనికి భోగములు రుచింప కుండుటయే. ఓ సజ్జనులారా ! మీరు చిదాకాశరూపులుకండు. నిర్వాణ మను నందనవనమున నిరతిశయానంద మనుభవింపుడు. ఈ సంసార మను మహారణ్యమున వ్యర్థముగ గడుపకుడు మనస్సు జగత్పదార్థములు - ఈ రెంటియందును భేదములేదు. పవనస్పందముల వలె మనస్సు, జగత్తు (దృశ్యవాసన) ఈ రెంటిలో ఒకటి నశించిన రెండును నశించును.

అవిద్య శమింప మహాత్ములు ఆత్మానంద పరిపూర్ణులై సమాధి తత్పరులై యుందురు. ఓ రామచంద్రా ! సమాధియను వృక్షమునకు వైరాగ్యమే బీజము. అద్దానిని బహుజాగరూకతతో రక్షించుచు శుద్ధ చిత్తమను క్షేత్రమున నుంచి, శ్రవణ మననాది జలములచే తడుపుచు నుండిన కాలక్రమమున వివేకమను అంకుర ముద్భవింప శాస్త్రవిచారణా వైరాగ్యాది జలముచే నయ్యది వృద్ధినొందును. అత్తఱి పూర్వము సంసారారణ్యమున పరువెత్తి పరువెత్తి అలసిన మనస్సను (జీవుడను) మృగము ఆ సమాధి వృక్షము క్రిందకు జేరి విశ్రమించును. ఆ జీవుడు ఆ ధ్యాన వృక్షము యెడల ప్రీతిగలవాడై ఆత్మ సాక్షాత్కారమను ఫలమును ఆ వృక్షముపై గాంచి అద్దాని ననుభవించుటకై సమాధి వృక్షమును

కాలక్రమమున అధిరోహించి తుదకు ఆత్మరూప ఫలము నాస్వాదించి పరమానందము నొందును. అత్తఱి సంసార రూపములగు క్రింద నున్న పదార్థముల నాతడభిలషింపక ఆత్మానంద మనుభవించుచు క్రింద నున్నట్టి సాంసారిక మనుజులను జూచి వారి యజ్ఞానమునకు నవ్వుచుండును.

దృశ్యరూప సంకల్పిత పదార్థముల పరిత్యాగముచే గలుగు ఆత్మస్వభావ మందలి విశ్రాంతియే పరమార్థ బ్రహ్మ మనబడును. దృశ్యము శమింప త్రిపుటీ రహితమగు శేషించు సాక్షిచైతన్య మాత్రమే బ్రహ్మమన బడును. విషయముల యెడల తీవ్ర వైరాగ్యమే (తృష్ణారాహిత్యమే) సమాధి. సంసారము యెడల అట్టి పరమ వైరాగ్యమెవడు సంపాదించునో అమ్మహాత్మునకు నా నమస్కారము. ఓ రామచంద్రా! నీవు దృఢవైరాగ్యము జేపట్టి ఆత్మజ్ఞానమును బొందిభేద బుద్ధిని విడనాడుము. అదియే ఉత్తమధ్యానము. ఓ రామచంద్రా ! మనస్సు అవస్తువు (లేనిది) అగుటచే గలుగు మనోనాశమే మోక్షప్రాప్తియగును. అనగా మనస్సు శమింప శేషించు ఆత్మ యందలి స్థితియే మోక్షము.

చిత్ర లిఖిత మనుజునివలె భోగములను గాంచనంత వఱకు మహాత్ములు విషయ వైరాగ్యమును సంపాదించుచు నుందురు. జ్ఞానముద్వారా బలాత్కారముగ సంభవించు 'విషయముల యెడల వైరాగ్యమే' సమాధి యనబడును. దృశ్య ఆస్వాదన రహితుడును, ఉత్తమ జ్ఞాన యుక్తుడును నగు జ్ఞానికి నిర్వికల్ప సమాధి నిరంతరము స్వయముగనే ప్రవృత్తమగు చుండును. వివేకి యగువాడు శాస్త్రాభ్యాస సాధు సాంగత్యములను - స్వప్నమందును వాని ననుభవించునంతటి తీవ్రముగ నాచరించుచుండును. జ్ఞాని సర్వజన ప్రియుడును, పరోపకార సాధకుడును, పవిత్రకార్యముల వాచరించువాడును, శీతలాంతఃకరణు డునునై వెలయుచుండును. అట్టి జ్ఞానుల చెంత యితరులును చిత్తశాంతిని, అంతఃశీతలత్వమును బొందుదురు. సంపదలు, స్త్రీలు (విషయములు) క్షణభంగురములు. కావున బుద్ధిమంతులందు రమింపరు. పరమ వైరాగ్యమను ఖడ్గముచే నెవరు మనస్సుయొక్క బాహ్యవిషయానుసరణమును, సంకల్పాదులను ఛేదించి వేయుదురో

అట్టివారి హృదయమున జ్ఞానము ప్రకాశించును. ఆత్మజ్ఞులగు మహనీయులకు విషయభోగములు రుచింపవు.

అహర్నిశము చిరకాలము పరమ భక్తితో నీశ్వరుని ప్రసన్న మొనర్చినచో వివేకముద్వారా యాతనికి నిర్వాణపదము లభించును. ఈశ్వరుడు దూరమున లేడు. దుర్లభుడు కాడు. మహాబోధ స్వరూప మగు ఆత్మయే పరమేశ్వరుడు. ముముక్షువు యొక్క శుభకర్మాదులచే నమ్మహేశ్వరుడు ప్రసన్నుడై బోధ నిమిత్తము వివేకమను దూత నాతని కడకు పంపును. ఆ దూత వాసనామయుడగు యా జీవునకు క్రమముగ బోధ సలిపి సంసార సాగరమును దాటించును.

ఓ రామచంద్రా! వాసనావృత్తి నశింప చిదాకాశమే శేషించును. వాసనయే మహాపిశాచి. వాసన శమింప ఈ సంసారము స్వయముగ శమించిపోవుచున్నది. కావున వివేకులిద్దాని ఛేదనమున తత్పరులై యుందురు. బాహ్య పదార్థముల త్యాగముచే పూర్ణరీతి మనస్సు శమించునట్లు మఱియే యితరోపాయముచేతను శమింపదు. సత్యము (బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్యయను జ్ఞానము) యొక్క అభ్యాసముచే ఈ దేహజగదాదుల గూర్చిన భ్రాంతి నివృత్తమగుచున్నది. అత్తఱి జగత్పదార్థములందలి సత్యత్వభావన తొలగుచున్నది. కావున మృగతృష్ణా జలమువలె ఎదుట నున్నప్పటికిని అసత్యములగు దృశ్యపదార్థములు వివేకికి స్వాదిష్టములుగ గానుపింపవు, ఏ వస్తువు మిథ్యయని యెఱుగబడునో అద్దాని యందు గ్రాహ్యబుద్ధి యెట్లు కలుగును? స్వప్నమని యెఱింగిన పిదప (అనగా జాగ్రత్తునందు) ఇక ఆ స్వప్నమందలి సువర్ణము నెవడు వాంఛించును?

(అధిష్ఠాన దృష్టిచే) సమస్త పదార్థములున్ను చిన్మయ స్వరూప ములు. స్వప్న మందలి నగర పర్వతాది పదార్థ సమూహమంతయు చిన్మాత్రమే అయి యున్నట్లు జాగ్రద్వస్తుజాతమంతయు గూడ చిదాకాశ మాత్రమే అయియున్నది. ఇవ్విషయమున పూర్వము నాచే గాంచబడిన ఒక విచిత్ర అఖ్యానమును వచించెద, వినుము -

## పాషాణోపాఖ్యానము

పూర్వమొకపుడు నేను వేద్యవస్తువు (బ్రహ్మము) నెఱుంగుటచే పూర్ణచిత్తుడనై వ్యవహారపూర్ణమగు యీ లోకమును త్యజింపనెంచి ఏకాంతస్థలమును వాంఛించుచు దేవలోకమున నిట్లు చింతించితిని - 'ఈ సంసార స్థితి నీరసమై, సుఖరహితమై యున్నది. వివేకముచే 'ఇది ఏమి, నేనెవరు' అని విచారింప అంతయు నిరాకార చిన్మాత్ర ఆత్మగనే భాసించుచున్నది. కాబట్టి జగద్విక్షేప శాంతి కొఱకై సిద్ధ దేవదైత్యాది సర్వ ప్రాణులకును దుర్గమమైనట్టి స్థలమున ఏ జీవికిని కానరాక గుప్తముగ నున్నవాడనై సర్వదృశ్యవృత్తులను త్యజించి నిర్వికల్ప సమాధి తత్పరుడనై సమస్వచ్ఛ శాంత ఆత్మపదమున స్థితుడనై యుండెదను. అందులకుగాను శబ్ద స్పర్శాది విషయముల యొక్కయు అనుభవములేని ఏకాంత నిర్విక్షేప స్థలమెయ్యది? భూప్రదేశ మనేక శబ్దాదులతో గూడి సమాధి విఘ్నకరమై యున్నది'-అని తలంచి ఆకాశమున కేగి చూడనదియు దేవ గంధర్వాదులతో గూడి వ్యవహారయుక్తమైయుండ అపుడు నేనాకాశమున నతి దూరము వెడలి ఏప్రాణియొక్కయు సంచారము లేనిచోట సంకల్పముచే నొక కుటీరమును నిర్మించి ఏ జీవియు రాకుండునట్లు సంకల్పించి నూఱు సంవత్సరములైన పిదప సమాధి నుండి లేవవలెనని నిశ్చయించి పద్మాసనస్థుడనై శాంత చిత్తముతో సమాధి నవలంబించితిని. తదుపరి శతవర్షములైన తదుపరి పూర్వపు వ్యుత్థానమును గూర్చిన సంస్కారము ప్రబుద్ధముకాగా నేను సమాధినుండి లేచితిని. ఆ నూఱుసంవత్సరములు నాకొక నిమిషమువలె గడచెను. ఏలయనగా, ఏకాగ్రచిత్తునకు కాలగతి అల్పముగ తోచును. ఓ రామచంద్రా ! అధిష్ఠాన రూపమగు చిదాకాశమున (ఆరోపితమై, కల్పితమగు) అనంత సృష్టి సముదాయము గలదు. మఱియు లతాగుల్మ కుడ్య ఆకాశవాయు జల అగ్ని ప్రాణి అంకురాదు లందును అసంఖ్యేయములగు సృష్టులు కలవను నివ్విషయమును ఈ పాషాణోపాఖ్యానము ద్వారా నీ కెఱిగింపబోవు చున్నాను.

అట్లు సమాధినుండి లేచిన పిదప అచట నేనొక సూక్ష్మమగు శబ్దమును వింటిని. ఆ శబ్దమెచట నుండి వచ్చినది యని ఆశ్చర్యముతో నలుదెసలు పరికించినను ఏమియు కానరాదయ్యె. అత్తఱి నేను ధ్యానము ద్వారా చిదాకాశముతో నేకత్వమునొంద అపుడు సమస్త జగదాది పదార్థములకును ఆధారభూతుడనైతిని. అట్టి దశయందు చిదాకాశమున అనేకములైన సృష్టులను, బ్రహ్మాండములను వీక్షించితిని. అవి యన్నియు ఆరోప దృష్టిచే జగదాకారములుగ నున్నను, అధిష్ఠాన దృష్టిచే కేవల చిదాకాశ రూపములే అయియున్నవి.

అట్లు నేనా శబ్దమొనర్చిన వానిని వెతుకుచు చిదాకాశరూపుడను కాగా నత్తఱి యాశబ్దము స్ఫుటమగు ఆర్యాఛందమున నాకు వినిపించెను. అంత ఆ శబ్దమువైపునకు నాదృష్టి పఱుప సమీపముననే నేనొక సుందర స్త్రీని గాంచితిని. 'దోషరహితుడవును, సంసారమను నదియందు మునిగి పోవుచున్న వానికి అవలంబనమైనట్టి తీరమందలి వృక్షము వంటి వాడవునగు ఓ మునీ ! నీకు నమస్కారము' అను నర్థమును సూచించు ఆర్యాఛందము నామె పఠించెను. అదివిని' ''స్త్రీ తోటి నాకేమి ప్రయోజనము''ని తలంచి ఆమె నాదరింపక వెడలిపోతిని. తదుపరి నేను చిదాకాశరూపుడనై చిదాకాశ మందలి మాయా నిర్మిత జగజ్జాలమును అందలి వైచిత్రము లన్నిటిని గాంచితిని. దేహాత్మ బుద్ధిగల మనుజుడు తన దేహమందలి అవయవములను గాంచునట్లు నేనా జగత్తు లన్నిటిని చిద్రూప నేత్రముచే నా ఆత్మయందే చూచితిని.

ఆర్యాఛందమును పఠించిన – ఆకాశరూప ధారిణియగు ఆ స్త్రీ నా సమీపముననే యుండెను. సమాధికి పూర్వము నేనామెను గాంచలేదు. ఎపుడు నేను చిదాకాశ రూపుడనైతినో అపుడు చిదాకాశరూపిణియగు ఆమెను జూడగల్గితిని. అపుడు స్వప్న మనుజులకు వలె మా యిరువురకును సంభాషణాది వ్యవహారము సంభవించెను. నీ వెవతవు? నీ స్థానమెయ్యది? ఏల యిచట కేతెంచితివి?' అని నేనామె నడుగ ఆమె యిట్లు వచించెను.

'మహాత్మా ! చిదాకాశమున ఒకానొక కోణమందున్న యీ మీ

జగత్తునందు భూతలము యొక్క చివఱ లోకాలోకమను బర్వత మొండు కలదు. అది అత్యున్నతమై మనోహరమై యలరుచున్నది. దానిపై ననేక శిలలు గలవు. ఆ పర్వతము యొక్క ఉత్తర దిశయందలి శిఖరమున గల ఉత్తమ శిలయందు నేను వసించుచున్నాను. అట్లచట నివసించుచు నా కనేక యుగములు గడచిపోయినవి. నేనేకాదు. అచట నాభర్తయు పరివార మంతయు గూడ వసించుచున్నాము. పురాణ పురుషుడును, ద్విజుడునగు నాభర్త అనేక యుగములు జీవించుచు ఎచటికిని బోక ఒకే చోట నుండును, బాల్యకాలము నుండియు అతడు బ్రహ్మచారియు వేదశాస్త్రజ్ఞుడును కాని అలసుడునునై యున్నాడు. పూర్వమాతడు తనకు యోగ్యమైన ఉత్తమ గుణసంపన్నమగు స్త్రీ యెట్లుత్పన్నమగునని తలంచి మనస్సు చేతనే నన్నాతడు సృజించెను, నేను క్రమముగ యౌవనవతి నైతిని. కాని నా పతి తపోనిరతుడై యుండుటచే నన్నింకను వివాహమాడలేదు. యౌవన భోగముల ననుభవింప కోరిక గల నేను ఆతనిని భోగవ్యసన రహితునిగ గాంచి చాలకాలము మిగుల సంతాప మొందితిని. తదుపరి క్రమముగ నాకు భోగముల యెడల విరక్తి జనించినది. ఇట్లు వైరాగ్యముతో గూడు కొనిన నాకును ఆత్మజ్ఞానము నింకను బొందని నాపతికిని ఆత్మ జ్ఞానోపదేశము జేసి తరింప జేయుడు. నాపతి విరక్తుడై యుండుట వలన నేనున్ను సంసార వాసనను వర్జించితిని. మఱియు ధారణాదులచే ఆకాశగమనాది సిద్ధులను బడిసి నిజ జగత్తును గాంచి అద్దాని వెలుపలకు రాగా ఈ లోకాలోకపర్వత శిలను జూచితిని. మహాత్మా ! మేమిరువురమును పరమ (ఆత్మ) పదమును వాంఛించు చున్నారము. కాబట్టి మాకు తత్త్వోపదేశము చేయుడు. ఆకాశమున కల్పితమైన ఆసనముపై గూర్చుండిన ఆ విద్యాధరి యిట్లు వచింప, అంత అట్లాకాశమున కల్పితమైన ఆసనముపై గూర్చుండియున్న నేనామె నిట్లడిగితిని -

ఓ విద్యాధరీ ! నీ వంటి దేహధారులకా శిలయందు సంచలనాది వ్యవహార మెట్లు కలదో అట్లే ఆ శిలయందలి మా జగత్తున్ను గలదు. ఇచట నున్న వ్యవహార జాలమంతయు నచటను గలదు. మీకు ఆశ్చర్యముగ నున్నచో ఆ శిలాంతర్గత జగత్తును జూచుట కేగెదము రండు !

అంత మే మిరువురమును అకసమున కెగసి ఆ లోకాలోక పర్వతశిలను సమీపింప అందు సృష్టి యేమియు నాకు కానరామి ఆమెను కారణమరయ అభ్యాసాభావమే అందులకు గారణమనియు, అభ్యాసముచే సాధింపరాని దెద్దియును లేదనియు, క్లేశములచే పూర్వపు సూక్ష్మజ్ఞానము యొక్క విస్మృతి సంభవించుటచే తనకును ఆ శిలాజగత్తు పూర్వమువలె స్పష్టముగ గోచరించుట లేదనియు నిర్మల పరమాత్మయందు సర్వజ్ఞత్వ మొసంగు, సమాధిరూప ధారణచే తమ పూర్వపు సమాధ్యభ్యాసము నిరువురము సాక్షాత్కరించుకొనెదమనియు ఆమె చెప్ప అంతట నేను సమాధిస్థుడనై చిదాకాశ రూపత్వము నొంది స్థూలత్వ (భౌతిక) భ్రాంతిని వీడిచూడ ఆ శిలాది సమస్తము పరమాత్మమయముగ గనుపట్టెను. తదుపరి ఆ విద్యాధరి శిలయందలి సృష్టియందు బ్రవేశింప సంకల్ప (సూక్ష్మ) రూపుడనగు నేనున్ను ఆమెతో గూడ నందు బ్రవేశించితిని. ఆమె ఆ శిలయందలి బ్రహ్మలోకమున కేగి బ్రహ్మదేవుని యెదుట గూర్చుండి - ఈతడే నాభర్త. ఇపుడు మహాప్రళయము సమీపించినను ఈతడు తన ధ్యానము నుండి చలింపక నున్నాడు. ఓ మునీశ్వరా ! ఈ మా యిరువురకును జ్ఞానప్రదానము చేసి బ్రహ్మమార్గమున నియోజింపుము' అని నాతో జెప్పి తన భర్తను ధ్యానము నుండి మేలుకొలుప అంతట ఆ బ్రహ్మదేవుడు కనులు విప్పగా దేవతా సిద్ధాది సమూహము నలువైపుల నుండి యట కేతెంచెను. మీకు శుభాగమనము. ఆసనముపై విరాజిల్లుడు; అని ఆ బ్రహ్మదేవుడు నాతో జెప్ప నేనాతనికి వందన మాచరించి అట్లే మణిమయ ఆసనముపై గూర్చుండ అంతట దేవ ఋష్యాదులాతనికి స్తుతి పూజాదులొనర్ప పిమ్మట నేనాతనితో నట్లంటిని - తాము సకల జ్ఞానపారంగతులు, భూతేశ్వరులు అయియుండ ఈ విద్యాధరి నా వద్దకు వచ్చి 'మా యిరువురకును ప్రబోధము సల్పుము' అని చెప్పుచున్నది. హేతువేమి? భార్య కొఱకు ఈమెను సృజించి మరల యేల భార్యగా పరిగ్రహింపలేదు? వచింపుడు! అది విని బ్రహ్మదేవుడిట్లనియె -

ఓ మునీ ! శాంతచిద్రూపమైన సద్వస్తువునుండి నేను వ్యక్తమైతిని. నేను చిదాకాశరూపుడనై చిదాకాశముననే స్థితి గలిగియున్నాను.

జగద్వాసనా అధిష్ఠాతృదేవతయగు ఈమె నాయొక్క సంకల్పముచే దేహరూపిణియైనది. అంతే గాని ఈమెను నాయొక్క గృహిణికొఱకై సృజింపలేదు. ద్విపరార్థపర్యంతమగు నాయొక్క ఆయువు సమాప్తమగు చున్నందున నేను నిత్యానంద చిదాకాశమయ కైవల్యస్థితిని బొందదలంచు చున్నందుచే మహాప్రళయ మిపుడాసన్నమగు ఇట్టి సమయమున నేనీమెను త్యజింపదలంచుటచే నీమెవైరాగ్యమును బొందినది. మఱియు మహాప్రళయము వాసనాక్షయము సంభవింప నున్నందున వాసనా రూపిణియగు నీమె నామార్గము (బ్రహ్మజ్ఞానము) వైపునకు బరువిడు చున్నది. ఆత్మతత్త్వ దర్శనాభిలాష గల యీమె ధారణాభ్యాసముచే మీ బ్రహ్మాండమును ఈ లోకాలోక పర్వతశిలను గాంచి మిమ్ములను దర్శించినది. ఆ పర్వతశిలయందీ జగత్తెట్లుకలదో అట్లే అచటి యితర శిలలందును మా జగత్తునందలి పదార్థము లందును ఈ శిల వలెనే అగు ఘట పటాదులందును అనేక జగత్తులు కలవు. ఆ బ్రహ్మాండములన్నిటిని భేదదృష్టిచే గాంచ జాలము. సమాధి ద్వారా చిద్రూపత్వము నొందినచో అట్టి యోగదృష్టిచే శీఘ్రముగ వాని నన్నింటిని గాంచగలము. ఓ మునీంద్రా! వాస్తవముగ ఈ నదులుగాని, పదార్థములుగాని లేవు. చిదాకాశమే యట్లు ఆయా పదార్థరూపమున వివర్తితమగుచున్నది. ఆ పదార్థములు నిజరూపముచే మిథ్యయు, అధిష్ఠానదృష్టిచే చైతన్యము కంటే భిన్నముకాకయు నున్నవి. ఓ మునీంద్రా ! ఇపుడు ప్రళయ మాసన్నమైనది గావున మీరు మీ బ్రహ్మాండమునకు బోయి సమాధి ద్వారా నిర్విక్షేప ఆత్మ సుఖమను భవించుడు. నాచే కల్పితమైన ఈ జగత్తు ఇపుడు అవ్యక్తరూపమును బొందుగాక! మేమున్ను ఇపుడు కైవల్య పదమును పొందుచున్నాము.

ఈ ప్రకారమా బ్రహ్మదేవుడు వచించి పద్మాసనస్థుడై తక్కిన బ్రహ్మలోక నివాసులతో గూడ సమాధి తత్పరుడై ప్రణవలక్షితమగు పరమాత్మయందు చిత్తమును లయముజేసి నిశ్చలముగ నుండెను. ఆ బ్రహ్మదేవుని స్మరించుచు ధ్యానతత్పరయైన విద్యాధర రూపిణియగు ఆ వాసనయు సర్వథా శమించుటచే చిదాకాశరూపము నొందెను, అత్తఱి నేను సమాధిద్వారా సర్వగామి యగు చిదాకాశ రూపము నొంది అచటి

వృత్తాంతమంతయును గాంచితిని. ఆ బ్రహ్మదేవుని యొక్క సంకల్పము నశింప దొడుగగా భూమి క్రమముగ శిథిలము కాజొచ్చెను. జీవుల వ్యవహారములన్నియు అస్తవ్యస్తములైపోయెను. భూకంపాదులు సంభవించెను. తదుపరి బ్రహ్మదేవుడు ప్రాణముల నెపుడు ఉపసంహరించెనో అపుడు వాయువు గ్రహ నక్షత్రాదుల ధారణారూపస్థితిని త్యజించెను. సిద్ధులాకాశము నుండి పడజొచ్చిరి. ద్వాదశాదిత్యులుదయించి ప్రపంచము నంతయు దగ్ధమొనర్చిరి. ప్రళయ వాయువులు వీయదొడగెను. పుష్కరావర్త మేఘములు వర్షింప అంతయు జలమయమైపోయెను. ఇట్లు తపోలోకమువఱకు ప్రళయసముద్ర మావరింప అత్తఱి సత్యలోక సమీపమున ఆకాశముననున్న నేను ఆ (సత్య) లోకమువైపు దృష్టి పఱుప అచట బ్రహ్మదేవుడుసమాధిస్థుడై అధికారి పురుషులగు దేవమునులతో గూడను ఇంద్ర, వరుణ, కుబేర, యమాదులతోడను, ద్వాదశాదిత్యులతోడను నంతర్ధానమగుటను గాంచితిని. వారందరును ముక్తి పదము నొందిరి. తదుపరి భూలోకాదులను వలె బ్రహ్మలోకమును గూడ అగ్నిజ్వాలలు భస్మమొనర్చ అపుడు మహాసముద్ర మచ్చోటును పూరించెను.

పిమ్మట ఆ యాకాశమునుండి త్రినేత్ర త్రిశూలాది యుక్తమగు నొక భయంకర కృష్ణవర్ణరూపము బయలు వెడలెను. అతడు కాలరూపుడగు రుద్రుడని యెఱింగి దూరమున నుండియే అమ్మహేశునకు వందన మాచరించితిని. ఆ మహాసముద్రము నంతటిని నాతడు శీఘ్రముగ త్రాగివైచెను. అపుడు జలరహితమగు నిర్మలాకాశమే శేషించెను. తదుపరి విశాల రూపధారియగు ఆ రుద్రుడయ్యాకసమున నృత్యమొనర్ప నారంభించెను, అనంతర మాతని శరీరమునుండి అతని శక్తియగు కాళీభగవతి యావిర్భవించి అతని నృత్యము ననుకరించెను. ఆమె విశాలాకారవతియు కృష్ణవర్ణము గలదియు పర్వతాదుల యొక్కయు, శూర్పాదులయొక్కయు మాలలను ధరించునదియు, నగర గ్రామాదులచే శోభించు నదియు, త్రిశూలాద్యాయుధములతో గూడి నదియునై యొప్పుచు ఆ రుద్రునితో సహా యాకాశమున తాండవము సల్పెను. వాయు స్పందములకు భేదములేనట్లు భైరవరూపుడగు ఆ

శివునకును, ఆతని యిచ్ఛారూపిణియగు ఆ భైరవీ (కాళి) దేవికిని భేదములేదు. అట్లు చిదాకాశమున నృత్యము చేయుచు ఆ దేవి కాకతాళీయ యోగముచే ప్రేమవశమున సమీపమున నున్న శివుని స్పృశించి క్రమముగ తన రూపమును వీడి శివుని రూపమున నైక్యమొందెను. ఏలయన పురుషుని (ఈశ్వరుని) స్పృశింపనంతవఱకు ప్రకృతి (ఈశ్వరేచ్ఛారూపిణియగు దేవి) ఈ ప్రపంచమున పరిభ్రమిం చుచుండును. స్పృశించిన వెంటనే, నదిసముద్రమున గలిసి సముద్ర రూపమగునట్లు తన ప్రకృతి రూపమును వదలి ఈశ్వరరూపమే యగును. అటు పిమ్మట ఆ రుద్రభగవానుడు పైన క్రింద నున్న బ్రహ్మాండ ఖండములగాంచి క్షణకాలములో నారెండిటిని తన నోటిలోనికి ఆకర్షించి వైచి క్రమముగ సూక్ష్మరూపమునుబొంది అంతర్ధాన మయ్యెను. అపుడంతయు నిర్మల బ్రహ్మరూపముగ విలసిల్లెను.

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ ఆ శిలయందలి యా మహావిలాసము నంతయు స్మరించి నేనాశ్చర్యము నొందితిని తదుపరి యా శిలయొక్క అన్యస్థానమును బరికింప, అదియు అనేక సృష్టులచే బరిపూర్ణమై యుండెను. ఇట్లాశిల యంతయు సృష్టిమయమై యుండెను. బుద్ధిరూప నేత్రము చేతనే అవి కానుపించును. మాంసనేత్రముచే శిలయే దృగ్గోచరమగును. పిమ్మట నేనాశ్చ ర్యముతోడ ఆ పర్వతము యొక్క అన్యశిలలను, తృణ లతాదులనుజూడ, సర్వత్ర ఆ ప్రకారముగనే అనేక జగత్తులు కానుపించెను. తరువాత నేనేకాగ్ర చిత్తముతో జూడ నా హృదయమందే సృష్టియగు పడెను. కాని వాస్తవముగ ఈ జగదాది దృశ్య సమూహము సత్యముకాదు. అంతటను బ్రహ్మాకాశమే వెలయుచున్నది. మరుభూమి యందు భ్రమచే జలమును గాంచునట్లు అజ్ఞానావృతచిత్తమే ఈ జగద్భ్రమను గాంచుచున్నది. అటు పిమ్మట నేను నాచిత్స్వరూపమును త్యజింపకయే క్రమముగ పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశముల గూర్చిన ధారణలచే ఆయా పంచభూత రూపములనొంది, ఆయా 'భూతక్రియల నన్నిటిని స్వయముగ నొనర్చితిని, అనుభవించితిని.

పిదప, ఆ యాకాశమందలి పూర్వపు నా సమాధిస్థానమగు

కుటీరమువద్దకు బోయి చూడ అట నా శరీరమెచటను గన్పట్టకుండె, సమాధియందున్న ఒక సిద్ధపురుషుడు మాత్రమచట నుండెను. అతడు పద్మాసనస్థుడై సమాధియందు నిశ్చలముగ నుండెను. అతనిని గాంచి నేను 'ఈతడెవరో నావలెనే సమాధికై యేకాంత స్థలమపేక్షించి యిటకు వచ్చి యుండును. మఱియు చిరకాలము వఱకు నేను రాకుండుటచే నా శరీరమును మృతమని తలంచి యెచటనో పారవైచి యుండును. ఇపుడు నా స్థూల శరీరము నశించిపోయినది. కావున ఈ సూక్ష్మ శరీరముతోనే నిజసప్తర్షి లోకమునకు జనెదను' అని నిశ్చయించి అటనుండి పోదొడగ 'నేనుండునంతవఱకీ కుటీరముండు గాక' అను నా పూర్వపు సంకల్పము క్షయించుటవలన, ఆ కుటీరము నశించిపోవ, ఆ సిద్ధుడట నుండి క్రిందపడెను. నేను మనస్సు (సూక్ష్మ శరీరము) తోనే ఆ సిద్ధునితో గూడ భూతలమునకు వచ్చితిని. ప్రాణాపానముల యూర్ధ్వగమనమువలన నాతడు కుటీరమునను్న విధముగనే పద్మాసనస్థుడై సప్తదీప, సప్తసముద్రాంతమున గల దేవతాక్రీడాస్థలమగు సువర్ణ భూమిపై బడెను. యోగబలముచే వజ్రతుల్యముగను, లేక, దూదివలె లఘువుగను నున్నందున అతడు అంత దూరమునుండి పడినను సమాధినుండి లేవకుండెను. పిదప నేనాతనిని మేలుకొలుపుటకై సంకల్పముచే మేఘము నుత్పన్నమొనర్చి వడగళ్ళవాన వర్షింపజేసి, బలపూర్వకముగ గర్జన యొనర్ప అతడు లేచెను. అత్తఱి నేను సూక్ష్మ శరీర ధారియైయున్నను' ఈతడు నన్ను జూచుగాక' యని నేను సంకల్పించుటచే నన్నాతడు చూడగలిగెను. అంతట నేనాతనిని 'నీ వెవడవు? ఎచటనున్నావు? ఇంత దూరమునుండి పడినను ఏల తెలియకయున్నావు! అని యడుగ, అంత నాసిద్ధుడు 'మహాత్మా! కొంచెము సేపాగుడు.నేను నాపూర్వ వృత్తాంత మంతయు స్మరించి చెప్పెదను' అని పలికి, తన వృత్తాంతమును చింతనజేసి పిమ్మట యిట్లు చెప్పదొడగెను – మహాత్మా! మిమ్ములనిపుడు నేనెఱింగితిని, నమస్కారము. మొదటనే నమస్కరింపని దోషమును క్షమింపుడు. మునీంద్రా! నేను మొదట దేవతల యుపవన భూములందు చిరకాలము సంచరించి అనేక భోగముల ననుభవించి, ఈసంసార సాగరమున దృశ్యతరంగములచే వ్యాకులత్వము జెంది తుదకిట్లు చింతన జేసితిని –

'ఈ ప్రపంచమున రమణీయమగు వస్తువేదీ? జ్ఞాన మాత్రమగు చిదాకాశమే. కావున నేనద్దానియందే స్థితి నొందెదను. దుఃఖప్రదములగు శబ్ద స్పర్శాది విషయములందు రమింపనేల? ధన పుత్రాది సాంసారిక పదార్థములు అనిత్యములు. అట్టివానియందు విశ్వాసమేల? ఆయువు ప్రతిక్షణము తరిగిపోవుచున్నది. కాని ఆవిషయమెవరును గమనించుట లేదు. పైగా అనేక వ్యర్థకార్యములందు జీవితమును గడిపివేయు చున్నారు. విషయములందు ప్రీతిలేకుండుటయే ఉత్తమస్థితి. ప్రీతి గలిగియుండుటయే అధమస్థితి. సంపదలు ఆపత్తిస్వరూపములే గావున, అవి సంభవించినపుడు ఆపదలు సంభవించినట్లే అని బుద్ధిమంతుడెంచ వలెను. సుఖములే దుఃఖములు, సంపదలే ఆపదలు; భోగములే (సాంసారిక) రోగములు. సంపదలు, స్త్రీలు మున్నగునవి తరంగముల వలె క్షణభంగురములు. సర్పపు పడగ క్రిందవలె అట్టివాని యందు ఏ బుద్ధిమంతుడు ప్రీతిగొనును? వాసనా రహితులగు మనుజులకు ఆత్మయందు విశ్రాంతి లభించుటచే నే సుఖము సంప్రాప్తించు చున్నదో, అట్టిది పాతాళమునగాని, స్వర్గమునగాని, భూతలమునగాని, మఱియే భోగములచేగాని ప్రాప్తించదు' - ఈ ప్రకారముగ చింతనజేసి తుదకు నేను వైరాగ్యము నొందితిని. ఇకనిపుడు పంచేంద్రియవృత్తులు నన్ను జయింపజాలవు.

ఇట్లు వైరాగ్యయుతుడనగు నేను ఏకాంతమున చిరకాలము ఆత్మయందు విశ్రాంతి నొందుటకై ఆకాశమును బొంది, అట తమ కుటీరమును గాంచితిని అది తమదనిగాని మీరు మరల దీనియందు ప్రవేశింతురనిగాని నేను తలంచి యుండలేదు. సిద్ధుడెవడో యిందుండి యుండి దేహత్యాగము చేసి కైవల్యపదము నొంది యుండవచ్చునని యూహించితిని. ఇపుడు తమ యిష్ట ప్రకారము చేయుడు. తమవంటి సిద్ధులకున్ను ఏకాగ్రచిత్తముగల్గి సమాధి దృష్టిచే విచారించిన తప్ప త్రికాలముల జ్ఞానము కలుగదు.

అది విని నే నిట్లంటిని - మీరు చెప్పినది సత్యమే. నేను మీస్థితిని ముందుగ విచారించి ఆ కుటీరమును స్థిరమొనర్చి యుండినచో మీరట స్థిరముగ యుండెడివారు. లెండు ఇరువురమును సిద్ధలోకములకు

పోయెదము - అని వచించి యిరువురమును ఆకాశమున కెగసి మా అభీష్ట స్థలములకు బోయితిమి. మనోమాత్ర దేహధారినగు నేనంతట యింద్రపురమునకు బోవ అచట నన్నెవరును జూడజాలకుండిరి. నేను మాత్రము వారలను జూచుచు అట వ్యవహరించుచు నుంటిని. ఇట్లా దేవతా స్థానములందు నేను పిశాచము పగిది వర్తించితిని. ఓ రామచంద్రా ! పిశాచములు సూక్ష్మ శరీరధారులై కర్మానుసారము వివిధ రీతుల వర్తించుచుందురు. అందు కొందఱు అపవిత్ర స్థానములందు సంచరించుచును. కొందఱు జీవుల నాక్రమించి బాధించును, మఱికొందఱు ఐశ్వర్యవంతులయ్యు - ఇట్లు పలుతెఱగులనుందురు. వారి యెదుట ఎపుడును అంధకారమే యుండును. అంధకారముననే వారు వ్యవహరించుచుందురు.

అట్లు నేను పిశాచమువలె నాకాశమున సంచరించుచు ఈ దేవతలందఱును నన్ను జూచుగాక ! యని సంకల్పింప వారందఱును నన్ను జూడగల్గ, నేను వారితో భాషణాది వ్యవహారముల గావించితిని. నేనట్లు వ్యవహరించినను చిదాకాశరూపుడనే అయియుంటిని. అజ్ఞానము వలనే ఈ దృశ్యము సత్యముగ తోచును. జ్ఞానము కలుగగా ఈ దృశ్యదృష్టి శమించిపోవును. సంసారవాసనా వశమున ఇంద్రియార్థము లగు భోగ్యపదార్థములందాసక్తుడును, మోక్షేచ్ఛా రహితుడునునగువాడు శునకము లేక కృమియేగాని మనుజుడు కాడు. చిత్తముయొక్క శీతలత్వమే (శాంతియే) మోక్షము, సంతప్తతయే బంధము. (అపుడు సాయం సమయముకాగా సభ విరమింపబడెను.

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ పాషాణోపాఖ్యానమును నీకు వర్ణించి చెప్పితిని.దీనిచే సమస్త సృష్టియు చిదాకాశమున కల్పితమై యున్నదని యెఱుగుము. ఈ జగత్తు అధిష్టానదృష్టిచే బ్రహ్మమాత్రమే అయియున్నది. ఆరోపితదృష్టిచే లేకయే యున్నది. 'నేను స్వచ్ఛ చిదాకాశరూపుడను' అనునిట్టి ప్రత్యాక్షానుభవము లేని మూఢుని జ్ఞానులు శవమనియే చెప్పుదురు. 'నేను అద్వితీయ చిదాత్మను, శరీరేంద్రియాదులు నాకు లేవు' అనునిట్టి జ్ఞానము కలవానిని జన్మ మరణాద్యాపదలెవ్వియు ఛేదింపజాలవు. తృణాగ్రమందలి జలబిందువు

వలె జీవితము క్షణికమైనది గావున అట్టి పరమార్థజ్ఞానముకొఱకై ముముక్షువు శీఘ్రముగ సద్గురువు నాశ్రయించవలెను. సద్గురువులును, ఉత్తములగు మహాత్ములును ముల్లోకములందును బహు అరుదు, దేవతలలో యమ, చంద్ర, సూర్య, రుద్ర, వరుణ, వాయు, బ్రహ్మ విష్ణు, శుక్ర, అగ్నులును; ప్రజాపతులలో దక్ష, కశ్యపాదులును; దేవర్షులలో నారదాదులును; దేవ పుత్రులలో సనకాదులును; దానవులలో హిరణ్యాక్ష, బలి, ప్రహ్లాద, శంబర, మయ, వృత్ర, అంధక, నముచి, కేశపుత్ర, మురాదులును; రాక్షసులలో విభీషణ, ప్రహస్త, ఇంద్రజిదాదులును; సర్పములలో శేష, తక్షక, కర్కోటక, మహాపద్మాదులును జ్ఞానులై యున్నారు. ఇంకను ఆయా లోకము లందు జ్ఞానులగు మహాత్ములు కొందరుగలరు.

ఆత్మ పదమున విశ్రాంతి నొందు జ్ఞానిజనులు లోభమోహాది రహితులై, ఉత్తమ ఆచరణశీలురై, ప్రియకోమలభాషులై, తమ సాంగత్యముచే జనుల కానందమును గొల్పువారై, సంపత్తి విపత్తులందును, సుఖదుఃఖాదులందునుసములై, చిత్తమను మహా సముద్రమును నిరోధింపగలవారైయుందురు. సంసారమార్గమున శ్రమగొని యున్నవారట్టి మహనీయుల నాశ్రయింపవలెను. ఈ భయంకర సంసారసముద్రము సత్సంగమను నావ లేకున్న దాటనశక్యము. పైన దెల్పిన యుత్తమ గుణములందు ఏ యొకటియైనను మనుజుని యందున్నచో అతని తక్కిన దోషములను బాటింపక అతని నాశ్రయింపవలెను. సత్సంగ, సచ్ఛాస్త్రాదులచే మొదట బుద్ధిని వృద్ధిచేయవలయును. దుష్ట సాంగత్యముచే సాధువున్ను అసాధుత్వము నొందును. కావున దోషములను త్యజించి సత్సాంగత్యమే చేయవలెను. అత్తఱి అప్రయత్నముగనే ఆ సత్పురుషుల గుణరేణువులాతని స్పృశించును.

ఓ రామచంద్రా ! మనకు వలెనే క్రిమి కీటకాదులకు గూడ సుఖదుఃఖానుభవముండును. రాగద్వేష, భయ, ఆహార, మైథున, సుఖ, దుఃఖ, జనన, మరణాదులందు మనుజులకును, వానికిని ఏ భేదమున్నులేదు. కాని వాస్తవముగ ఈ జగత్తుగాని, నీవు నేననునవిగాని,

సత్యములుకావు. ఆత్మతత్త్వజ్ఞానములేనంత వఱకు ఈ దృశ్య జగత్తు సత్యముగను, జ్ఞానానంతరము మిథ్యగను భాసించును. స్వప్నతుల్యమును, అసత్యమును నగు ఈ జగత్తునందు సత్యత్వకల్పన అజ్ఞులే కావించిరి. జ్ఞానముచే అట్టిభ్రాంతి నశించి, జగత్తుయొక్కఅసత్యత్వము గోచరించును. వాస్తవముగ చిద్రూప బ్రహ్మమే (ఆత్మయే) సర్వత్ర వ్యాపించియున్నది.

ఓ రామచంద్రా ! జీవుడు చిన్మాత్రుడే. అతడెన్నటికిని నశింపడు. కావున 'నేను నశించుచున్నాను' అను శోకము వ్యర్థము. ఇకనిపుడు జీవన్ముక్తుడగు వాడు యావజ్జీవితము ఎట్టి గుణములు, లక్షణములు గలిగియుండునో వినుము - జీవన్ముక్తుడు ఉత్తమ ఆచరణయుక్తుడై, శోక, భయాదిరహితుడై, దుఃఖములను సుఖములుగ నెంచుచు, సర్వత్ర సమబుద్ధిగలిగి నిర్భీకుడై సదా ఆత్మానందయుతుడై వెలయుచుండును. తత్త్వజ్ఞులు వాసన, ద్వైత, అభిమానవర్జితులై యుందురు గావున తమ యౌన్నత్యమును, అంతరికభావములను గుప్తముగ నుంచుదురు. కాని అహంకారులు, దంభాదియుతులునగు అజ్ఞానులు వానిని ప్రసిద్ధము నర్చుచు తమ్ములోకము పూజించుగాకయని తలంచుచుందురు. ఇదియే జ్ఞాని, అజ్ఞానులకు గల భేదము. మఱిప మంత్ర, ఔషధాదులబలముచే ఆకాశగమనాది సిద్ధులు అజ్ఞానులకు గూడ కలుగును. కాని మిథ్యా వస్తువులగు వానియందు జ్ఞాని ఆసక్తిగలిగి యుండడు. తత్త్వజ్ఞానిని ఈ ముల్లోకములందలి యేవస్తువు గూడ లోభింప జేయజాలదు. జగత్తు యావత్తు తృణప్రాయమ్మై యుండు ధీరుడగు జ్ఞానికి ఆత్మకంటె నన్యముగ నిక గ్రహింప దగిన వస్తువేది యుండును? ఈ జగత్తు ఇంద్రజాలమువలె భ్రమమాత్రమని నిశ్చయించి వివేకియగువాడు దిన దినము కోర్కెలను త్యజించి వేయుచుండును. తన దేహమునకు సంప్రాప్తించినను, శీత, ఆతపాది దుఃఖములను జ్ఞాని అన్యదేహము నకు సంప్రాప్తమైనవానిగ దలంచి అనాదరముతో జూచును. యథాప్రాప్తము లగు లోక సామాన్య వ్యవహారముల నాచరించుచు నాతడు చరాచరా భూతములకు ఉపరిగనుండును. ప్రజ్ఞయను మేడపైనెక్కి దుఃఖరహితు డైనను అజ్ఞానులను జూచి దుఃఖించుచుండును. మఱియు

పర్వతముపై నున్నవాడు క్రింది జనులనువలె సర్వులను జూచుచుండును. భ్రమయను సముద్రమున కామ క్రోధాది తరంగములచే చిరకాలము విక్షిప్తుడై తుదకు జ్ఞానముచే నావలి తీరమును బొంది యాతడు పరమ విశ్రాంతి నొందును. మఱియు తన పూర్వ కాలిక సాంసారిక గతులను స్మరించి నవ్వుకొనుచుండును. జీవన్ముక్తులగు జ్ఞానులలో కొందఱు పర్వత గుహలందు వసింతురు; కొందఱు గృహస్థాశ్రమమున నుందురు. కొందఱు భిక్షాటన మొనర్చుచు యాత్ర సల్పుదురు. కొందఱేకాంతమున తపమొనర్తురు; కొందఱు మౌనముగ నుందురు; అట్లే మఱి కొందఱు పండితులుగ నుందురు, కొందఱు అజ్ఞులవలెను, పిచ్చివారివలెను పైకినుందురు. కొందఱు సన్న్యాసమును గ్రహింతురు. ఈ రీతిగవారు వివిధ తెఱగులనుందురు. పురుషుడు శరీరముకాదు, చిత్తాదులుకాదు; చైతన్యమాత్రమే, ఆ చైతన్యమెన్నటికిని నశించునదికాదు. అట్టి చైతన్య మగు ఆత్మనెఱింగిన జ్ఞానిఎచటనున్నను అతని స్వరూపము నశింపదు. ఏలయన, అతడు శాంత, నాశరహిత శివపదమగు ఆత్మయే అయియున్నాడు.

ఓ రామచంద్రా ! ఆత్మజ్ఞానవిచారణమందు గొప్ప ప్రయత్నమును గావింపవలెను. మరల మరల అభ్యాసము చేయకున్న, ఆ స్థానము తెలిసినను తెలియనిదే యగును. అవిద్య శమించినను జీవన్ముక్తియొక్క స్థిరప్రతిష్ఠ అభ్యాసము లేకున్న కలుగదు. ఆత్మజ్ఞాన ప్రాప్త్యర్థము, సంసారరోగశమనార్థము, సర్వోత్తమమగు ఈ యోగవాసిష్ఠ శాస్త్రమును ప్రతిదినము కొలది కాలమైన విచారణ చేయవలెను. మృత్యువు జీవితమును గ్రహించి వేయకమునుపే, సచ్ఛాస్త్ర విచారణ గావించి వివేకము నొందవలయును. ఓ సభ్యులారా ! మానమోహాదులను త్యజించివేసి, సర్వాపదలను సమూలముగ ఛేదించివేయునట్టి ఆత్మ జ్ఞానము నొంది సుఖింపుడు. దేహాదులందు ఆత్మబుద్ధిని వదలి అపరిచ్ఛిన్న బ్రహ్మాత్మభావమును పొందుడు. మరణమును ఆపదకు ఇపుడే చికిత్సచేయకున్న,మరణించిన పిదప ఔషధములేని ప్రదేశమున కేగి మనుజుడిక నేమి చేయగలడు: కాబట్టి మరణము సమీపింపకమునుపే సర్వోపదేశ సారమగు వైరాగ్య మవలంబింపుడు. సమస్త పదార్థము

లందును వైరాగ్యము జనింపకున్న పదార్థములగూర్చిన వాసన శమింపదు. వాసనాక్షయము తప్ప ఆత్మనుద్ధరించుటకు వేఱొకయుపాయ మెద్ది యునులేదు. ఈ పదార్థములు సత్యములైనచో వానియందు వాసన గలిగి యుండుట యుక్తమే. కాని యథార్థములు కావు. శశశృంగములవలె మిథ్యయై యున్నవి. కాబట్టి అవిచారణచే రమణీయముగ భాసించు ఈ దృశ్య పదార్థముల యెడల వాసనలను, విచారణచేతను అయా పదార్థములందలి మిథ్యాత్వబుద్ధిచేతను నశింపచేయవలెను.

స్వప్నమెట్లు మిథ్యయో, అట్లే ఈ జాగ్రత్ప్రపంచమున్ను మిథ్యయై యున్నది. కావున జాగ్రత్స్వప్నములకు భేదములేదు. ఈ జగత్తు చిదాకాశముయొక్క స్వప్నమే యగుచు, ఆకాశమునందు నీలత్వమువలె అజ్ఞానముచేనందు కల్పింపబడిన దగును. సంపూర్ణ ఇచ్ఛారహితుడును, శాంతచిత్తుడును, బాహ్యాభ్యంతర రూపాది విషయ వర్జితుడును నగు మనుజునియొక్క స్వాభావిక సుఖస్వరూప భావమే చిదాకాశము. జగత్పదార్థములయొక్క నామరూపములను వర్జించి జగత్తు అ వాస్తవము, అని యెఱింగి శిలవలె నిశ్చలముగ ఆత్మయందు స్థితిగలిగి యుండవలెను. పృథ్వ్యాది అసత్పదార్థముల యొక్క చింతనలచే జీవితము వ్యర్థముగ గడచిపోవునే గాని ప్రయోజనము లేదు. యథార్థముగ ఉత్పన్నమేకానివియు, అసద్రూపములు నగు జగత్పదార్థములను సత్యములుగ నెఱింగి వ్యవహరించువాడు మూఢుడే యగును.

శ్రీ రామచంద్రుడు - మునీంద్రా! అవిద్య నశింపని కారణముచే ఈ జగత్తు ఎవనికి దృశ్యరూపముగ స్ఫురించుచుండునో, అయ్యది అతనికి ఎంతకాలము ఏ రూపమున నుండునో వచింపవేడెద.

శ్రీ వసిష్ఠుడు - ఓ రామచంద్రా ! అవిద్యాజనితమగు ఈ పృథ్వ్యాది జగత్తు అజ్ఞానుల దృష్టియందే కలదు. బ్రహ్మమునందువలె ఈ దృశ్య జగత్తు నందును అంతము దొఱకదు. ఇవ్విషయమున నొక ఆఖ్యానమును వచించెద వినుము -

## అవిద్యోపాఖ్యానము

చిదాకాశమున నొకచోట ఈ జగత్తును బోలినదే యగు నొక త్రైలోకము గలదు. అట భూతలమున 'తతమిత' యను నగరమొండు కలదు. దానిని విపశ్చిత్తు అనునొక గొప్ప ధార్మికుడగు రాజు పాలించుచుండెను. అతడు విద్యావంతుడును, మహాగుణ సంపన్నుడును అగ్నిదేవుని భక్తుడునై యుండెను. అతనికి ప్రజ్ఞాశీలురగు నలుగురు మంత్రులుగలరు. అతడు శత్రువులచే జయింపబడక నిష్కంటకముగ రాజ్యమును బాలించుచుండెను.

ఇట్లుండ ఒకనాడా రాజువద్దకు తూర్పు దిక్కునుండి యొక దూతవచ్చి యిట్లు చెప్పెను - 'దేవా ! తూర్పుదిక్కునందలి నాయకుడు ఆ ప్రదేశము నంతటిని జయించుటకు ప్రవృత్తుడుకాగా, శత్రువులాతని నెదిర్చి చంపి వేసిరి. పిమ్మట పశ్చిమ దిక్కునందలి నాయకుడు పూర్వ, దక్షిణ దిశలను జయించుటకుద్యుక్తుడు కాగా, మార్గమధ్యముననే శత్రువులాతనిని వధించి వైచిరి. ఆ దూత యిట్లుపలుకు చుండ నింతలో మఱియొక దూత శీఘ్రముగ నేతెంచి 'ఉత్తరదిశయందలి సేనాధ్యక్షుడు శత్రువులచే పీడింపబడి సేనా సమేతముగ నిటకేతెంచుచున్నాడ'ని రాజునకు దెలిపెను. అది విని యా రాజు యుద్ధమునకు శీఘ్రముగ సన్నాహమొనర్పుడని సమీపస్థులగు జనులకు చెప్పుచుండ నింతలో రాజాజ్ఞను బొందిన ఉత్తర దిశయందలి సేనాధ్యక్షుడు ఛిన్నాంగుడైలోనికి ఏ తెంచి పూర్వ దక్షిణ, పశ్చిమ, దిశయందలి సేనాపతులు మరణించిరనియు, గొప్ప శత్రుసేన నగర సమీపమునకు వచ్చినదనియు ఎట్లు ఉచితమో అట్లు చేయుడనియు వచించుచుండ నింతలో మఱియొకడు వచ్చి శస్త్రాస్త్ర సమన్వితమగు గొప్ప శత్రుసేన నగరమువద్ద కేతెంచెనని రాజునకు విన్నవించి పోయెను. తదుపరి మంత్రు లందరును ఆ రాజు కడకు వచ్చి శత్రువు సామదాన భేదములకు వశుడు కాడనియు, దండమే యుచితమనియు, కావున యుద్ధముచే నెదిరించుటయే మంచిదనియు చెప్ప, రాజు 'మీరు పోయి రణసన్నాహముల నొనర్పుడని' వారలను పంపివైచి, స్నానమొనర్చి, అగ్ని గృహమున బ్రవేశించి, అయ్యగ్ని

దేవుని బూజించి, విజయము సందిగ్ధముగానున్నదనితలంచి, విజయదాత యగు అగ్ని దేవునకు తన శిరస్సును, ఆహుతిచేయ నిశ్చయించి ఆ యగ్ని దేవుని గూర్చి 'ఓ అగ్నిదేవా ! నీవు నా యెడల ప్రసన్నుడవు అగుచో, ఈ నా కార్యముచే ఈ అగ్నికుండము నుండి మహాబల సంపన్నములగు నాలుగు శరీరములు త్పన్నములగుగాక ! ఆ నాలుగు శరీరములచే నేను నలుదిశలందలి శత్రువులను నిర్విఘ్నముగా జయించగలుగుదును గాక! నీ యొక్క స్మృతి నా యందు సదా గలిగి యుండుటకై నీ దర్శనమును గూడ నాకు కలుగ జేయుము' అని పలికి ఖడ్గముచే తన శిరస్సును శీఘ్రముగ ఛేదించి అగ్నియందు హోమము చేయదొడగ నింతలో శరీర సహితముగ నాతడు అగ్నియందు పడిపోయెను. అగ్ని దేవుడాతని శరీరమును హవిస్సువలె భస్మమొనర్చివేయ, ఆ యగ్నికుండమునుండి మహాబల సంపన్నములును, శస్త్రాస్త్రసహితములును, సమానాకారము గలవియునగు నాలుగు దేహములతో రాజు బయలువెడలెను.

అయ్యవసరమున నగరమునకు నాలుగువైపుల శత్రుసైన్యము వచ్చిచేర, వారితో గొప్ప యుద్ధము ప్రారంభమయ్యెను. ఇంతలో రాజు బయలుదేఱుటను సూచించుఢంకా శబ్దములు దిక్కులు పిక్కటిల్లునట్లు మ్రోగెను. అత్తఱి యా రాజు తన నాలుగు దేహములతో నలువైపుల బయలుదేఱి, నగరము వెలుపలకుబోయి సర్వత్ర వ్యాపించియున్న గొప్ప శత్రు సైన్యమును జూచి, మంత్రస్మరణ పూర్వకముగ వాయవ్య, పర్జన్యాస్త్రములను వదలగా, ఆ భయంకర అస్త్రముల ప్రభావముచే శత్రువులు ఛిన్నాభిన్నులై పారిపోయిరి. అట్లు పరుగిడుచున్న శత్రు సైన్యమును వెన్నంటుచు ఆ నలుగురు విపశ్చిత్ రాజులున్ను సముద్ర పర్యంతము అతిదూరమేగి దిగ్విజయము నొందిరి. అట్లు శత్రుసేన క్షీణించిన వెనుక ఆ యస్త్రములు తమ్ము కృతకృత్యులుగ నెఱింగి ఆకాశమున శమించిపోయెను. తదుపరి ఆ నలుగురు విపశ్చిత్తులును, వారి మంత్ర్యాదులును విశాలములై, గంభీరములై యున్నట్టి యా సముద్రములను జూచిరి. సముద్రతటములను బొందిన వెనుక మంత్ర్యాదులు ఆ విపశ్చిత్తునకు వన, వృక్ష, సముద్ర, పవన, వనచర,

పర్వత, నదీ, పక్షి, మేఘ, గ్రామ, తటాక, హంస, కమల, బక, కాక, వియోగిపథిక, చాతకాదులను జూపి, వానిని గూర్చి వర్ణించి చెప్పిరి.

పిమ్మట ఆ నలుగురు విపశ్చిత్ రాజులు సముద్రతటములపై గూరుచుండి రాజ్యమర్యాదను స్థాపించిరి. ఆ తరువాత సూర్యభగవానుడస్తమింప వారు నిజదైనిక కార్యములను బూర్తిచేసికొని, పరుండి యిట్లు చింతనజేసిరి – 'ఆహా ! అగ్నిదేవుని యనుగ్రహముచే మనము పరిశ్రమలేకయే యింత దూరమేతెంచితిమి. 'ఈ విశాల దృశ్యమెంత పరిమితి గలిగియున్నదో మనమెఱుంగవలయును.' అని తలంచి ఆ నలుగురు విపశ్చిత్తులును నాలుగు సముద్రతటములపై యాసీనులై ఏక కాలమున అగ్ని దేవుని ఆహ్వానింప, అతడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా, అంతనా విపశ్చిత్తులిట్లు ప్రార్థించిరి – 'దేవా ! ఈ దృశ్యము యొక్క పరిమితిని, (ఈ దేహముతో జూడగలిగినంత వఱకు ఈ దేహముతోను, తదుపరి మంత్రసంస్కృత దేహముతోను, తదుపరి సూక్ష్మ దేహము తోను) మేము చూడగలుగులాగున వరమొసంగడు.' అది అని అగ్నిదేవుడు 'అట్లే యగుగాక' అని చెప్పి యదృశ్యుడయ్యెను. తదుపరి ఆ రాత్రి గడచిన వెనుక ప్రాతఃకాలమున నీతి శాస్త్రానుసారము రాజ్య వ్యవస్థను గావించి, దుఃఖించుచున్న పరివారమును వీడి, దిగంతములను జూచి తిరిగి వచ్చెమదని వారికిజెప్పి, ఆ విపశ్చిత్తులు భూతలముపైవలె సముద్రముపై నడచిపోయిరి. సముద్రమునుండి ద్వీపమును, ద్వీపమునుండి సముద్రమును జేరుచు, శీఘ్రముగ వారు గమనమును సాగించుచుండిరి. త్రోవలో మకరాదులచే గ్రసింపబడినను, అగ్నిదేవుని వర ప్రసాదముచే తిరిగి బయటకువచ్చి పురోగమనము చేయుచుండిరి. ఒకే మనుజుడు స్వప్నమునందనేక రూపములతో వ్యవహరించినట్లు ఆ విపశ్చిత్తున్ను నాలుగు రూపములతో భిన్న భిన్న ప్రదేశములందు భిన్న భిన్నముగ వ్యవహరించుచు నుండెను. మఱియు ఆ విపశ్చిత్తులు ఆపదలందు పరస్పరము ఒకరికొకరు సహాయమొనర్చుకొనుచును నుండిరి. ఓ రామచంద్రా ! వారు పారంగతులగు ఆత్మజ్ఞానులుకాదు. జ్ఞాన, అజ్ఞానముల రెంటిమధ్యనున్నవారు. అగ్నిదేవుని కృపచే ధారణామాత్రమును బొందిన యోగులు. వారియందు అవిద్య ఇంకను

గలదు. పరమ (ఆత్మ) బోధను బొందిన వానియందిక అవిద్య యుండనేరదు. ఆ విపశ్చిత్తులు తమ నిశ్చయము సాధించుటకొఱకై అనేక జన్మలెత్తుచు, అనేకద్వీప, పర్వత, సముద్ర, వనాదులందు సంచరించుచు అనేక కష్టసుఖములనుభవించుచు, స్థూలశరీరము నశింప సూక్ష్మ శరీరముతో గూడ తమ లక్ష్యమును సాధింప యత్నించుచునుండిరి.

ఇట్లుండ, ఒకపుడు 'పశ్చిమ' విపశ్చిత్తు సప్తసముద్ర సహిత సప్తద్వీపము లను దాటి సౌభాగ్యవశమున స్వర్ణమయ పృథివిపై జనార్దనభగవానుని దర్శించి ఆతనినుండి ఉత్తమ బ్రహ్మజ్ఞానమునొంది, మహాత్ముల సహవాసముగలవాడై, దృశ్యముయొక్క యథార్థస్వరూపము నెఱింగి అచ్చోటనే అయిదు వత్సరములు సమాధియందుండి పిదప దేహమును వీడి విదేహముక్తి నొందెను. 'పూర్వ' విపశ్చిత్తు ఒకపుడు పూర్ణచంద్ర బింబ సమీపమున తన శరీరమును శుద్ధ చంద్రరూపముగ భావించుచు, శరీరము నశింప చంద్రలోకమున స్థితిగల్గి యుండెను. మఱియు చంద్రమండల గత మృగమందు అధిక స్నేహాభ్యాసముచే తుదకు మృగరూపమును ధరించి పర్వతముపై వసించుచుండెను. 'ఉత్తర దక్షిణ' విపశ్చిత్తులు అనేక బ్రహ్మాండములను, సృష్టులను దాటి చనుచు, అవిద్య రూప దృశ్యముయొక్క అంతముగానక నేటికిని అట్లే తిరుగాడుచుండిరి. ఏలయన, ఈ అవిద్యకు (దృశ్యమునకు) అంతములేదు. వారిరువురును ఇపుడు ఏయే బ్రహ్మాండములందు సంచరించుచున్నారో ప్రయత్నముచే విచారించినను ఇపుడు దృష్టి గోచరమగుటలేదు. పూర్వ విపశ్చిత్తుమాత్ర మిపుడీ బ్రహ్మాండముననే మృగరూపమున నున్నాడు. త్రిగర్తదేశపు రాజు నీకు కానుకగా నిచ్చిన క్రీడామృగమే ఆతడు.

వసిష్ఠుని యా వాక్యముల వినగనే శ్రీ రామచంద్రుడు ఆశ్చర్యయుతుడై, అద్దానిని తన క్రీడామృగ స్థానము నుండి సభలోనికి గొని తెచ్చుటకై అనేక బాలురకాజ్ఞయొసంగ, వారట్లే దానిని తీసికొనివచ్చిరి. సభలోనికి గొనిరాబడిన ఆ యందమగు లేడిని జూచి సభ్యులెల్లరు విస్మితులైరి. అంతట శ్రీ రామచంద్రుని మృగరూప ధారియగు ఈ విపశ్చిత్తునకు పూర్వశరీరప్రాప్తిచే ఆత్మజ్ఞానముద్వారా దుఃఖాంతము ఏ.

యుపాయముచే కలుగదలదని వసిష్ఠుని ప్రశ్నింప ఆతని యిష్టదేవత యగు అగ్నిదేవునియందు ప్రవేశించుటచే నాతడు తన నిర్మల పూర్వరూపమును బొందగలడనియు, అదియంతయు తానిపుడు ప్రత్యక్షముగ జూపెదననియు, వసిష్ఠుడు బదులు చెప్పి, విధి పూర్వకముగ ఆచమనాదుల గావించి, ఇంధన రహితజ్వాలాయను అగ్నిదేవుని ధ్యానింప, వెంటనే యా సభామధ్యమున జ్వాలామయమగు అగ్ని ప్రకటమయ్యెను. అపుడు వసిష్ఠుడు నిజ దృష్టిపాతములచే ఆ మృగమును పాప రహితమొనర్చుచు 'ఓ అగ్నిదేవా ! నీయెడల గల పూర్వకాలపుభక్తిని స్మరించి, ఈ మృగముపై కరుణగలిగియిద్దానిని విపశ్చిత్తునిగ జేయుము' అని అగ్నిభగవానుని గూర్చి వచింప, ఇంతలో అమ్మృగము పరుగెత్తుకొనివచ్చి ఆ యగ్నియందు ప్రవేశించెను. వెంటనే ఆ యగ్నినుండి దేదీప్యమానము ప్రకాశించుయొక మనుజుడు ఆవిర్భవించెను. తదుపరి యా జ్వాలా సమూహమట లుప్తమైపోయెను. ఆ పురుషుని ప్రకాశ స్వరూపమును వీక్షించి సభాసదులలో పెక్కురు 'ఈతడు భాసుడను బేరుచే ప్రసిద్ధికెక్కును' అని వచించుటచే నాతడు 'భాసుడని' పిలువబడెను. తదుపరి ఆ స్థానముననే భాసుడొక ముహూర్తకాలము ధ్యానస్థుడై తన పూర్వ వృత్తాంతమంతయు స్మరించి పిమ్మట లేచి వసిష్ఠ,విశ్వామిత్రాదులకు నమస్కరించి కూరుచుండెను. అంతట దశరథుడు 'దిగంత దర్శనరూప అవిద్యకు వశీభూతుడై ఈతడనేక క్లేశాదుల ననుభవించుట ఈతని వ్యర్థచేష్టయే అని తలంచు చున్నాన' ని పలుక, అత్తఱి విశ్వామిత్రుడిట్లు వచించెను - 'ఓ రాజా ! మీరు చెప్పినది సత్యమే. ఆత్మజ్ఞానరహితులగు మనుజులలో కొందఱు విచిత్ర వాసనాయుక్తులై దిగంత దర్శనమున కుపక్రమింతురు.

వటధానులను క్షత్రియులకులమున జన్మించిన ముప్పురు రాజ పుత్రులున్ను ఇట్లే ఈ దృశ్యముయొక్క అంతమును కనుగొనుటకై యత్నించుచు అనేక జన్మలెత్తుచు ఈ దృశ్యమండలమున పదునేడు లక్షల సంవత్సరములనుండి తిరుగాడుచు ఇప్పటికిని ఈ భూమండలమున వర్తించుచునే యున్నారు. కాని దృశ్యము యొక్క అంతమును వారు పొందజాలరైరి. ఏలయన, స్వప్నతుల్యమగు ఈ జగత్తు అజ్ఞానమువలన

అనంతమై భాసించును. జ్ఞానముచే అయ్యది నశింప, శుద్ధబ్రహ్మము మాత్రమే శేషించును.' అని యిట్లు పలికి విశ్వామిత్రుడు భాసుని దృశ్య సంచారానుభవములను దెలుపుమని యాతని (భాసుని) నడుగ, తానెత్తిన హంస, మృగ, వృక్ష, విద్యాధర, శృగాలాది వివిధ జన్మలను తాను గాంచిన విచిత్రములను, అనుభవించిన సుఖదుఃఖములను వర్ణించి చెప్పుచు, ఒకానొక బ్రహ్మాండమున తాను గాంచిన యొక విచిత్రవృత్తాంతము నిట్లు తెలిపెను -

## (అవిద్యోపాఖ్యానాంతర్గత ) శవోపాఖ్యానము

ఒకానొక బ్రహాండమున నేను సంచరించుచు ఒకపుడు దిక్కుల బరికింప గొప్ప పర్వతాకారమగు ఛాయ భూమిపై కదులుచుండెను. ఇదియేమి అని ఆశ్చర్యముగ విచారించుచుండ నింతలో అనేక పర్వతాకృతిగల ఒక విశాల పురుషాకారము ఆకాశమునుండి క్రిందకు పడుచుండుటను వీక్షించితిని. తోడనే మహావేగముతో, భయంకర శబ్దముతో ఆకాశప్రదేశము నుండి సూర్యుడు క్రిందకుపడెను. అపుడు నేను భయపడి సమీపమున నున్న అగ్ని యందు ప్రవేశించితిని. అనేక జన్మలందు నాచే పూజితుడైన ఆ యగ్నిభగవానుడంత శీతలాకృతి ధరించి, 'భయపడవలదు, మా లోకమునకు రమ్ము.' అని నాతో జెప్పి నిజవాహనమగు శుకముపై నన్నెక్కించుకొని క్రిందబడిన ఆ మహాశవమునకొకచోట కాల్చుటద్వారా ఛిద్రమొనర్చి అందుండి యాకాశమార్గమున కెగసెను. ఆ యాకాశమునుండి నేనా మహాశవము నవలోకించితిని. అది పడుటచే పృథివి కంపించెను. పర్వతాదులు చూర్ణమై పాతాళదేశము జొచ్చెను. ప్రాణికోటి హాహాకార మొనర్పసాగెను. ఆ శవముయొక్క శిర, పాదాది కొన్ని అవయవములు భూమికి అవలనే యుండెను. ఇంతలో అన్ని దిక్కులనుండి సిద్ధ, సాధ్య, గంధర్వ, ఋషి, మున్యాదులేతెంచి భక్తితో కాళరాత్రియగు భగవతిని స్తుతింప, అంతపేత్ర, మాతృగణాది సహితయై దేవి ప్రత్యక్షముకాగా, 'ఓ దేవీ! ఈ మృత శరీరమును నీకు ఉపాహారముగ నొసంగితిమి. కావున పరివార సహితముగ దీని ననుభవింపుము' అని యా దేవతలందఱును యాదేవిని

గూర్చి పలుక, తోడనే యా భగవతి ప్రాణవాయువుద్వారా ఆ మృతశరీరమందలి రక్తము తనయందాకర్షించుకొని, ఆ రక్తపానముచే తృప్తినొంది ఆకాశమున నృత్యము చేయదొడగెను. తదుపరి పిశాచ కుంభాండ, ప్రేతాదులు ఆ శవమునుజుట్టి అద్దాని కటి, ఉదర, పృష్ఠాది భాగములను భక్షించి నాట్యమొనర్పసాగిరి. పృథివికి అవలనున్న శిర, పాదాద్యవయవములు కాలక్రమమున స్వయముగ క్షీణించి పోయెను. అత్తఱి పృథివి రక్తము తోడను, అస్థులు మున్నగువానితోడను ఆవృతమై దుర్గంధపూర్ణమై యొప్పెను. పృథివీ, పర్వత, సముద్రాదుల యొక్క యా వినాశస్థితి నవలోకించి (ఆ శవముయొక్క కటిమున్నగు అవయవములకంటె నెత్తుగానున్న) లోకాలోక పర్వత శిఖరముపైనున్న దేవగణము మిగుల దుఃఖించెను. పిమ్మట శేషించిన రక్తము దేవతలయొక్క సంకల్పముచే ఒకే ప్రవాహముద్వారా ఒకానొక సముద్రమునందు జేర్చబడెను. ఆ సముద్రమునే దేవతలు తమ సంకల్పముచే మదిరార్ణవముగ నొనర్చిరి. భూతగణము ఆకాశమున నృత్యము సలిపి ఆ సాగరమున మద్యము ద్రావి మరల యాకాశమున నృత్యము చేసెను. ఆ భూతగణముచే భుజింపబడి శేషించినట్టి మేదస్సు (క్రొవ్వు) భూతలముపై వ్యాప్తమై యుండుట బట్టి పృథివి 'మేదినీ' యనబడెను. ఈ ప్రకారము క్రమముగ ఆ శవము నశించిన వెనుక, సూర్యుడు స్వస్థానమునకేగ, ప్రజాపతి మరల నూతనముగ ప్రజలను సృజింప, సృష్టి తిరిగి యథా ప్రకారము వర్తిల్లజొచ్చెను.

అత్తఱి శుకవాహనముపైనున్న నేను 'ఈ శవమేమి? ఈ జరిగినంతయు నేమి' యని అగ్నిదేవుని యడుగ అతడీ ప్రకారము చెప్పనారంభించెను -

పూర్వము అసురజాతికి జెందిన యొకడు దర్పముచే ఒకానొక మునీశ్వరుని యాశ్రమమును మర్దించివేయగా, అమ్మునీశ్వరుడు ''నీవు మహా అధమమగు దోమవైపోవుగాక'' యని శపింప, తత్శాపాగ్నిచే నాతడు వెంటనే భస్మమై దోమయై పుట్టెను. దాని ఆయువు రెండు దినములు మాత్రమే. ఆ పిమ్మట అది లేడిచే త్రొక్కబడి మరణించెను. లేడి ముఖము జూచి మరణించుటచే నది తిరిగి లేడియై పుట్టెను. ఆ లేడి యొక

బోయవాని ధనుస్సుచే చంపబడెను. బోయవానిని జూచి మరణించుటచే తిరిగి యది బోయవాడై పుట్టి అరణ్యమున విహరించుచు ఒకానొక ముని యాతనికి హింస త్యజింపు మనియు, అహింసావ్రతము నవలంబింపు మనియు బోధించెను. దుఃఖరాహిత్యమున కుపాయ మేమి యని వ్యాధుడడుగ, హింసామార్గమును వీడి, శమ దమాది మునుల యాచార ముల నాశ్రయింపుమని యమ్మునివరుడు వచింప నాతడట్లేయొనర్చి క్రమముగ శాస్త్రజన్యవివేకము నొందెను. ఒకనాడా వ్యాధుడు ''ఓ మునీశ్వరా ! అంతః కరణమున నున్న స్వప్న పదార్థములు (స్వప్నమున) బాహ్యమున నున్నట్లేల కానుపించును?'' అని యా మునిని ప్రశ్నింప అతడిట్లు ప్రత్యుత్తరించెను -

ఓ సాధూ! పూర్వము నాకును స్వప్నమును గూర్చి 'ఇది యెటనుండి వచ్చుచున్నది' అను సంశయము పొడమి, దానిని గాంచు నిమిత్తము పరకాయ ప్రవేశాది ధారణ నభ్యసించి, పద్మాసనస్థుడనై, నాయొక్క చిత్తసహిత ప్రాణ వాయువు ఎదుటనున్న ఒకానొకని ముఖాగ్రమున నున్న ప్రాణమున నియోజించి ఆ ప్రాణము ద్వారా అతని హృదయమున సూక్ష్మరూపమున ప్రవేశించి, అతని శరీరస్థ నాడీమండ లాదులను, తత్క్రియలను గాంచి అనంతరము హృదయమందలి తేజో ధాతువునందు ప్రవేశించి అట అతని స్వప్న ప్రపంచము నంతటిని గాంచి పిదప యిట్లు నిశ్చయించితిని - 'ఈ స్వప్న ప్రపంచ మంతయు, చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమే. చిత్స్వరూపము, నిజ చిదాకాశ రూపత్వమును త్యజింపకయే తన స్వరూపమును ఘటపటాది ఏ యే రూపమున భావించుచున్నదో ఆయా రూపమున వర్తించు చున్నది. ఈ చిత్స్వరూపము యొక్క ఒకానొక స్ఫురణ స్వప్నమనియు, ఒకానొక స్ఫురణ జాగ్రత్తనియు చెప్పబడు చున్నది. వాస్తవముగ జాగ్రత్స్వప్న ములు భిన్నముకావు. రెండును చిద్రూప ఆత్మయొక్కస్ఫురణ మాత్రములే. జీవుడు అంతర్ముఖుడగు నపుడు జాగ్రజ్జగద్రూపమున గాంచును. ఇదియే స్వప్న జాగ్రత్తులకుగల భేదము. ఇట్లు జాగ్రత్స్వప్నముల తత్త్వమును గూర్చి చింతించి, ఆ పిమ్మట సుషుప్తి తురీయములను గూర్చియు విచారించితిని. (మాయా శబలిత)

ఆత్మయొక్క సంకల్పరహిత మగు గాఢనిద్రాకార పరిమాణమమే సుషుప్తి యనియు, ఈ జగత్తు ఉత్పన్నమే కాలేదు. బ్రహ్మమే యీ జగద్రూప మున వర్తించుచున్నది' అను బోధ గలిగి యుండుటయే, అనగా దృశ్యరహితమగు ఆత్మాకార స్థితియే తురీయ మనియు నేను నిశ్చయించితిని.

అనంతరము నేనాతని హృదయస్థ తేజమును వీడి ఆతని చిదాభాస సంవిత్తునందుబ్రవేశింప, ఇరువురి వాసనల యొక్క ప్రతిభాసముచే భూమండల, దిగాది సమస్త ప్రపంచము ద్విగుణీకృతముగ భాసించెను. పిమ్మట ఇరువురి సంవిత్తులను నేను మేళవింప జగత్తున్ను ఏకరూపమున గన్పట్టెను. అట ఆతని చిత్తవృత్తి ననుసరించి శబ్దాదివిషయములను గ్రహించుచు ఆ దినమునం దాతని జాగ్రద్రూప వ్యవహారమును నేననుభవించితి. తదుపరి యాతడు భోజనాదుల గావించి శ్రాంతుడై నిద్రింప, నేనున్ను ఆతని హృదయ ప్రదేశమున బ్రవేశించి ఆతనితో గూడ కొద్దిసేపు సుషుప్తి ననుభవించి పిమ్మట ఆతని స్వప్నమును గాంచితిని. అట మహా భయంకరమైన ప్రళయము సంభవింప, ఆ ప్రళయ సముద్రమున నేను కొట్టుకొని పోవుచు అనేక దుఃఖముల ననుభవించి పిమ్మట పూర్వపు నా సమాధిమయ స్వరూపమును స్మరించి 'నేను ఇతరుని హృదయమున గాంచుచున్న స్వప్నమిది కావున ఇది భ్రమ మాత్రమై, మిథ్యయై యున్నది' అను సత్యము నెఱింగి స్వస్థచిత్తుడనై ఇంద్రాదులు, ముల్లోకములు కూడ కొట్టుకొని పోవుచున్న యా భీకర ప్రళయ సముద్ర దృశ్యము నవలోకించితిని. పిమ్మట ఆ జలమంతయు నెచటికో ప్రవహింప దొడగ నేనందు కొట్టుకొనిపోవుచు దైవవశమున ఒకానొక తీరమును బొంది యట విశ్రమించితిని. ఇంతలో ఆ జలమంతయు నెచటికో పోయెను. అయ్యవసరమున నేను తీరస్థ పర్వత శిఖరమున నున్న ఒకానొక మునియొక్క ఆశ్రమమున శ్రాంతుడనై పరుండి, కొంతసేపు గాఢనిద్ర ననుభవించి, పిమ్మట స్వప్నమున ప్రళయమును వీక్షించి, మేలుకొని తిరిగి ఆ తీరస్థ పర్వత శిఖరమును బొందితిని.మరునాడు ఆకాశ, పర్వత, నదీ, పృథ్వ్యాది సహితమగు ప్రపంచము నట జూచి, పూర్వానుభూత విషయముల నొకింత విస్మరించి,

అసమ్ముఖ పదార్థములతోడ వ్యవహరింప జొచ్చితిని, అట నేనొక గ్రామమున ఒక గృహమున బంధువులతో గూడ వసించు బ్రాహ్మణుడనై పూర్వకాలిక వివేకబుద్ధిని పూర్తిగ విస్మరించితిని. ఇట్లుచట నాజీవితమున నూరు వత్సరములు గడువగా, అనంతర మొకపు డొక ఆత్మజ్ఞుడగు తాపసి అతిథిగ మాయింటికి రాగా, అతనిని సత్కరించితిని. భోజనానంతరము రాత్రి పరుండునపు డాతడు ఆత్మజ్ఞానమును గూర్చి నాకు బోధించుచు, 'ఈ జగద్రూపముగ స్ఫురించునది వాస్తవముగ నిర్వికార చిద్రూపబ్రహ్మమే' అని వచింప నేను క్రమముగ బోధ రూపమును బొంది పూర్వకాలమున ప్రాణి శరీరమున ప్రవేశించుట మొదలైన వృత్తాంతయు నంతయు స్మరించి ఆ ప్రాణియొక్క అంతఃకరణమును వీడి ఆతని ప్రాణవాయువుద్వారా బయటకురాగా, ఒకానొక పర్వత గుహయందలి ముని ఆశ్రమము, అట పద్మాసనస్థమగు నా శరీరము, అద్దాని సేవాదుల గావించు విద్యార్థులు ఉండియుండుట జూచితిని. అప్పటికి నేను సమాధియందు ప్రవేశించి ఒక ముహూర్తమాత్ర కాలమే వారికి గడిచినది. ఎవని హృదయమున నేను ప్రవేశించితినో అతడు సుఖముగ నట నిదురించుచుండెను.

అంతట నేను కౌతుకముతో ఆతని హృదయమున మరల బ్రవేశింప అచటి స్వప్నరూపమగు జగత్తు ప్రళయముచే విపరీత దశను బొందుచుండెను. కాని ఓ సాధూ ! వాస్తవముగ ప్రాతిభాసికమగు ఆ స్వప్న జగత్తుగాని, వ్యావహారికమగు ఈ జాగ్రజ్జగత్తుగాని, జ్ఞానియొక్క దృష్టియందు శూన్యరూపమై, కేవలము చిదాకాశము మాత్రమే యట భాసించుచున్నదగును. అజ్ఞానమే బంధము. బ్రహ్మజ్ఞానముచే ఆ బంధము శమించును. ఆత్మజ్ఞానరూపమగు పాండిత్యము సంపాదించ నంత వరకు ఈ మాయ భయకారిణియై యొప్పును. ఎద్దానిని బొందుటచే జీవుడు మరల సంసార చక్రమందు పడడో అదియే పాండిత్యము. కాబట్టి ఆత్మజ్ఞానమను పాండిత్యమును సంపాదించుట కొరకై శ్రవణ మననాది రూప ప్రయత్నము గావింపుము. అట్లు కాకున్న మరి దేనిచేతను గూడ నీ (సంసార) భయము తొలగనేరదు. ఆత్మజ్ఞాని ఏగతి (మోక్ష సుఖము) నొందునో, అట ఇంద్రాదుల ఐశ్వర్యమున్ను శిథిలతృణమువలె

భాసించును. ఆత్మజ్ఞానమను పాండిత్యమునకు మించిన ఐశ్వర్యముగాని, సుఖముగాని పాతాళ, భూతల, స్వర్గములందెచటను నేను గాంచుట లేదు. అవిద్యారూపమగు ఈ దృశ్యము బోధద్వారా ఆత్మజ్ఞానికి రజ్జు సర్పమువలె శమించినదై అధిష్ఠానమగు బ్రహ్మముగనే శేషించుచున్నది. బ్రహ్మమునందు వాస్తవముగ సృష్టియే యెపుడు సత్యముకాదో, అపుడిక ఆ సృష్టియొక్క వృద్ధి క్షయాది ధర్మములుగాని. కర్మములుగాని తద్బోధకములగు పదవాక్యాదులుగాని లేనివేయగును. స్వప్నమనుజుని యొక్క కారణముగాని, కర్మగాని యెట్లు కాల్పనికమ్మై నవో, అట్లే జాగ్రత్తున్న ఈ స్వప్నమందలి మనుజుని యొక్క కారణము గాని, కర్మగాని కాల్పనికమేగాని వాస్తవముకావు. ఆత్మజ్ఞానముచే సమస్త జగత్తు ఒకే చిన్మాత్ర చిదాకాశముగ విలసిల్లును. ఆత్మజ్ఞానశూన్యుడగు అజ్ఞానికి ఆ ఒకే చిన్మాత్ర ఆత్మ అనేక జగద్రూప మున వర్తించును. ఓ సాధూ! ఆత్మరూపుడనగు నాయొక్క సాక్షి చైతన్యమునందు ఈ త్రైలోక్యరూప జగత్తు స్ఫురించుచున్నది. వాస్తవముగ బాహ్య ప్రదేశమున ఏమియు లేదు. ఏలయన బాహ్య ప్రదేశముయొక్క అభావము ప్రసిద్ధమైయున్నది.

ఓ సాధూ! పంచకర్మేంద్రియ, జ్ఞానేంద్రియ. పంచప్రాణ, అంతకరణ చతుష్టయముల సంఘాతరూపమగు సూక్ష్మశరీరసంయుక్తు డగు చిదాభాస రూపుడైన జీవుడు నాడులు, శ్లేష్మ, పిత్త, వాతములలోనే దేని ఒకదానిచే గాని, అన్నిటిచే గాని పూర్ణమైయుండునపుడు, తదనురూప మగు స్వప్నములను హృదయతేజమున సూక్ష్మరూపమున నున్న వాడై వీక్షించుచుండును. మఱియు జీవుడెపుడు 'పురీతతి' యను నాడి యందు ప్రవేశించునో అపుడు ప్రాణసంచారమునకు ఛిద్రములేనివాడై, తత్సంచార నిరోధముచే హృదయతేజమున సుషుప్తి ననుభవించును. తిరిగి పరిపాకముచే బోధితుడై స్వప్నమును జూచును. కుపితవాత పిత్తాదులతోను, సంక్షుబ్ధ అన్న రసములతోను గూడిన జీవుడు ఆకాశాదుల భ్రమణము, పదార్థముల జ్వలనము, విపరీతవ్యవహార ములు మున్నగు వానిని స్వప్నమున గాంచును.

ఓ సాధూ! నేనా ప్రాణియొక్క హృదయమున ప్రళయకాల దృశ్యమును గాంచి పిదప ఆతనితో గూడ సుషుప్తికొంత తడవనుభవించి

మరల యందుండి స్వప్న ప్రపంచమున ప్రవేశింప, అట పూర్వకాల పరిచితమగు నా గ్రామము, గృహము, బంధ్వాదులు, క్షేత్రారామములు గాంచి పూర్వవాసనలచే వాని యందభిమానయుతుడనై ఆ నా బంధ్వాదులతో గూడ నట సుఖముగనుంటిని. ఆ సమయమున నా బుద్ధిప్రౌఢ ఆత్మజ్ఞాన యుక్తమైలేదు కావుననే బంధ్వాదుల వాసనచే హతమై పోయినది. ఇప్పుడో నా బుద్ధిని ఏ వాసనా సమూహము నశింపజేయగలదు? 'ఇది యంతయు చిదాకాశమాత్రమే' అను జ్ఞానము కలవాడు ద్వైతవాసనచే గొట్టబడడు; శుద్ధ చిద్రూపముగనే యుండును. నిర్మలమగు ఆత్మయొక్క స్మృతి నశింపనివానిని ద్వైతమను పిశాచమొకింతైనను బాధింపజాలదు. శ్రవణ మననాద్యభ్యాసముల చేతను, సాధుసంగ, సచ్ఛాస్త్రాధ్యయనాదులచేతను ఆత్మబోధ పూర్ణముగ నుదయించిన మహాత్ములకాయాత్మజ్ఞానము మరల యెన్నటికిని మఱువబడదు. నిరంతర బ్రహ్మానుసంధానముచే పూర్ణమైయే యుండును. ఓ వ్యాధుడా! నీ బుద్ధియు సత్సాంగత్యాది రహితమై యున్నది గావున అప్పుడే శాంతినొందదు. సాధన, అభ్యాసాదులద్వారా మున్ముందు శమించును.

ఓ వ్యాధుడా! ఆ ప్రాణియొక్క హృదయమున నేనారీతి కుటుంబినై, పూర్వజ్ఞాన విస్మృతిగల్గి, ఆత్మజ్ఞాన రహితుడనై యుండు చుండ క్రమముగ పదునాఱు వత్సరములు నాకు గడిచిపోయెను. అటు పిమ్మట ఒకనాడు మా గృహమున కొక గొప్ప తపస్వియేతెంచ, నేనాతని సత్కరించి యాతిథ్య మొసంగితిని. అనంతరము నేనాతనిని దుర్భిక్షాదు లందనేక జీవులొకేతూరి దుఃఖమును పొందుటకు కారణమేమి అనియడుగ అతడిట్లు వచించెను - మనము ఏ విరాట్పురుషుని అవయవరూపులమైయున్నామో, ఆ విరాట్పురుషుని శరీరధాతువుల, వికారముచేతను, విషమ స్పందనాదుల వలనను, కలుగు వికారాదులు, అతని అవయవ రూపులగు జనసమూహము నకు సమానముగనే యుండును. మఱియు కాకతాళీయ న్యాయముచే, అశుభ కర్మ యుక్తులగు కొందఱు ప్రాణులకు దుఃఖాదులొకేసారి సంభవించుచు నుండును. కలిసి శుభాశుభ కర్మల జేయువారికి తత్తత్ఫలితములగు సుఖదుఃఖములున్ను కలిసియే సంప్రాప్తమగుచుండును. కాని,

వాస్తవముగ అనాదియు, నాశరహితమును, శివ స్వరూపమునగు బ్రహ్మమే ఈ సమస్తమ్మునై యున్నది - ఈ ప్రకారమగు బోధచే ఆ మునిద్వారా నేను బోధితుడనై, ఆత్మజ్ఞానినైతిని. అటు పిమ్మట నేనా మునిని వదలలేదు. నా ప్రార్థనచే నాతడు మా గృహముననే యుండెను. ఓ వ్యాధుడా ! ఆ దయాళువగు ముని ఇపుడు నీ చెంతనే యున్నాడు, చూడుము. ముని యిట్లు వచింపనంత ఆ వ్యాధుడు ఆశ్చర్యయుతుడై, స్వప్నమనుజుడు జాగ్రత్తు నందెట్లే తెంచెనను సంశయము గలవాడై ఆ విషయమును గూర్చి ప్రశ్నింప (మాయాశబలిత చిదాకాశమున సంభవము కాని దెద్దియునులేదను భావముతో) అమ్మునివర్యుడిట్లు పలికెను -

నీ సమీపముననున్న యీ మునివలన నేనాత్మజ్ఞానమునొంది పూర్వపు నా ముని స్వభావమును స్మరించి యిట్లు చింతించితిని '-' అహా ! ఇంతకాలము నేనీ భ్రమాత్మకమగు దృశ్యముచే మోసగింపబడితిని. ఈ శరీరాదులు, దృశ్యమునేనుగాను శుద్ధ చిన్మాత్రుడనే నేను.

పిమ్మట నేనా మునితో ఆ నా ఆశ్రమమందున్న నా శరీరమును ఎవని హృదయమున స్వప్న ప్రపంచమును జూచుటకు నేను ఉద్యుక్తుడనైతినో అతనిని జూచుటకై నే నిపుడు వెడలుచున్నాను' అని చెప్పి, ఆతడు నవ్వుచు 'నీ యొక్కయు, ఆ ప్రాణి యొక్కయు దేహము లిపుడెచట! అవి అగ్నిచే దహింపబడి అతి దూరమేగినవి. అయినను నీవు స్వయముగ పోయి చూడుము. ఆ విషయమును బాగుగ తెలిసికొనగలవు ! ఆ వాక్యముల విని నేను నా పూర్వ శరీరమును జూచి వచ్చు వచ్చునంతవఱకు మీరిచటచే యుండుడ'ని ఆ మునికి జెప్పి ఆ నా దేహమును వీడి నిజజీవుని ఆ ప్రాణియొక్క ప్రాణ వాయువునందు నియోజించి ఆ వాయురూప రథమునెక్కి అనంతాకాశమున పరిభ్రమించితిని. కాని చిరకాలము సంచరించి ప్రపంచమునంతయు శోధించినప్పటికిని ఆ ప్రాణియొక్క ముఖబిలమును పొందమి, ఖిన్నుడనై తిరిగి స్వగృహమును కేతెంచి అమ్మునీంద్రుని యా విషయమై యడుగ అతడిట్లు వచించెను - మిత్రమా ! యోగనేత్రముతో జూచినచో యీ విషయమునంతయు కరతలామలకముగ గాంచగలవు. నీవు వ్యష్టి జీవుడవుకావు హిరణ్యగర్భుడవు. అట్టి నీవు వ్యష్టి రూపముచే స్వప్నము

జూడ గోర్కె కలిగి మనోరాజ్యము ద్వారా ఒకానొక ఆశ్రమమున తపస్వియై, ఆ వ్యష్టిభావము పరిపుష్టము కాగా ఒకా నొకని ప్రాణి హృదయమున ప్రవేశించి స్వప్నదిదృక్షువైయుండ, ఇంతలో గొప్ప దావాగ్ని ప్రజ్వలింప, నీ యాశ్రయము, నీ యొక్కయు, ఆ ప్రాణి యొక్కయు దేహములు అందు భస్మీభూతము లయ్యెను. నాశ ఉత్పత్తులందు, సంకల్పించు మనుజుని మనఃస్పందము కారణమై యున్నట్లు, బ్రహ్మదేవుని సంకల్ప నగరమే ఈ త్రైలోక్యము గావున ఈ ముల్లోకముల సంకల్పించు ఆ బ్రహ్మదేవుని మనఃస్పందమే ప్రపంచమందలి దావాగ్ని దుర్భిక్షాదుల క్షోభ, శాంతులకు కారణమగును. మాయాశబలిత చిదాకాశమున అనేక జగత్తులు ఒక దానియందింకొకటి వర్తించుచు నున్నవి. ఇట్లా జగత్తుల కల్పనా పరంపర అనంతమై నెగడుచున్నది.

ఆ ప్రాణి యొక్కయు, నీ యొక్కయు దేహములు నశించిపోయి నందున నీవు వానిని పొందజాలవైతివి. మఱియు ఇపుడు నీకు స్వప్నమే జాగ్రద్భావమును బొందియున్నది. నీవు మాకు స్వప్న పురుషుడవు. మే మందఱము నీకు స్వప్న పురుషులము. కాని అవస్థాత్రయమందీ చిదాకాశము నిజచిత్స్వరూపాత్మయందు సదా ఏకమైయే వెలయు చున్నది' ముని యొక్క యా వాక్యముల విని నేనాశ్చర్యమును బొందితిని. మా సంభాషణా మధ్యమున నాతడు 'వ్యాధమహా గురూ' అని నన్ను సంబోధింప, ఆ వ్యాధగురుత్వమేమి యని నేనడుగ నాతడిట్లు వచించెను - 'మునీ! నీవు వ్యాధ (బోయవాని) గురువగు వఱకు నేనిచటనే యుండెదను. నీవు నాకు సత్కారాదుల గావించి వదిలి పెట్టవు. కొన్ని వత్సరములకు కరువు వచ్చి నీ బంధువు లందరు మరణింతురు. రాజుల పరస్పర యుద్ధముచే ఈ గ్రామమందలి జనులందరు పారిపోవుదురు. అపుడు మన మిరువురము ధైర్యము గలిగి, నిస్పృహులమై, ఉత్తమ ఆచరణయుతులమై, ఏకాంతమున నొక వృక్షము క్రింద వసింతుము. కాలక్రమమున మనము నివసించుచోట అతి రమణీయమైన ఉద్యానవన మేర్పడును. అవ్వనమున తపంబొనర్చుచు మనకు చాలకాలము గడచిన వెనుక ఒకపుడు మృగమును వెన్నంటుచు వ్యాధుడొకడు అచటికి రాగా, ఆతనికి నీవు పవిత్ర కథల ద్వారా ఉపదేశింప, ఆతడు విరక్తుడై అచటనే

తపము సలిపి, పిమ్మట ఆత్మజ్ఞానేచ్ఛచే స్వప్నమును గూర్చి నిన్నడుగ. తత్ప్రసంగమున నీ వాతనికి ఆత్మజ్ఞానమును లెస్సగ బోధింప, అపుడాతడు యోగ్యుడగును. కావుననే నిన్ను 'వ్యాధగురూ' అని పిలిచితిని.' - ఓ వ్యాధుడా ! ఈ ప్రకారముగ ఆ ముని వచింప, నేను విస్మితుడనై అమ్మునితో గూడ ఈ దృశ్య సమూహమును గూర్చి విచారించి ఆశ్చర్యమును బొందితిని. అనంతరము మే మిరువురమును పరస్పరము స్నేహముతో కూడుకొని ఆ వనమందే వసించుచుంటిమి.

పిమ్మట నేను దృశ్యమండలమును గూర్చి విచారించి, చిదాకాశమే అవ్విధమున స్ఫురించుచున్నదనియు, వాస్తవముగ ఈ పృథివీ, పర్వత, ఆకాశాదులు లేవనియు, అది యంతయు చిదాకాశము యొక్క స్ఫురణ మాత్రమే యనియు నిర్ణయించి దృశ్యమున సంతాపరహితుడనై, వీతరాగుడనై, అహంకార వర్జితుడనై, సంశయరహితుడనై, నిర్వాణ (శాంత) రూపుడనై యుంటిని. ఓ వ్యాధుడా ! నీవున్ను ఇట్లే దృశ్యమును మిథ్యగ నెఱింగి నిజ (ఆత్మ) స్వరూపమున శాంతి నొందుము - ఓ విపశ్చిద్రాజా ! మునియొక్క యీ వాక్యముల విని వ్యాధుడు సంశయగ్రస్తుడై, ముని వచించిన బోధ హృదయమున ఆరూఢముకామి, 'ఈ దృశ్యమెంతవఱకున్నది? అను విషయమును తపస్సుచే విశాలదేహము నొంది కనుగొందును. అవిద్యా రూపమగు ఈ దృశ్యముయొక్క అంతమున నేను సుఖముగ నుందును' అని నిర్ణయించి, అభ్యాసాభావముచే జ్ఞానము ప్రాప్తినొందక, అనేక వేల సంవత్సరములు మహా తపమొనరించుచు, ఒకపుడా మునిని 'నాకాత్మ విశ్రాంతి యెపుడు కలుగును' అని యడుగ ఆతడిట్లుపలికెను - 'నీకు నేను గావించిన జ్ఞానోపదేశము నీ హృదయమున ఎక్కడో దాగియున్నదే గాని ప్రజ్వలితము కాలేదు. అభ్యాసము లేని కారణమున ఆత్మ జ్ఞానమున నీకు విశ్రాంతి కలుగలేదు. చిరకాలాభ్యాసము ద్వారా నీవట్టి విశ్రాంతిని బొందెదవు. ఇకనిపుడు నీ భవిష్యద్వృత్తాంతమును వచించెద వినుము -

ఈ ప్రకారముగ నీవు నూఱు యుగములవరకు ఘోరతపము చేయ అపుడు దేవతా సహితుడై బ్రహ్మదేవుడు నీ వద్దకేతెంచ, నీ వాతని నిట్లు ప్రార్థించుదువు. 'దేవా ! అవిద్యారూపమగు ఈ దృశ్యమెంతవఱకు

గలదు? ఈ దృశ్యము అవతల బ్రహ్మమెంత దూరముననున్నది. ఆ సంసారశూన్యమగు అవిద్యారహిత బ్రహ్మమును నేను చూడగోరుచున్నాను. కావున అందులకై నాకీ వరములిండు - నా మృత్యువు నేను తలచినపుడు అగుగాక! నా శరీరము రోగరహితమై ఆకాశమున గరుడవేగము గలది అయి, ప్రతి క్షణము ప్రతి అంగమున ఒక యోజనము వృద్ధి యగుగాక! దానిచే కాలక్రమమున నేను ముల్లోకములను దాటి దృశ్యముయొక్క అంతమును బొందుదును' అని యడుగ, బ్రహ్మదేవుడు 'అట్లే యగుగాక' అని చెప్పి యంతర్ధానమగును. పిమ్మట నీవు ప్రకాశమాన దేహము గలవాడవై, నమస్కరించి ఆకాశమున నెగురుదువు. నీ శరీరము అతి విశాలమగుచుండును. ఆ విశాలకాయముతో నీవు దీర్ఘకాలము అనేక సృష్టులను జూచుచు, దృశ్యము యొక్క అంతమును బొందజాలక తుదకు వైరాగ్యము నొంది మోక్షకారణములగు సచ్ఛాస్త్రాభ్యాస సాధు సంగమములు ఆ యపారదేహముతో సాధింప శక్యముగా నందున తుదకు దానిని త్యజించి వేసెదవు. అది క్రిందపడుటచే భూతలము పైనున్న పర్వతాదులు చూర్ణమగును. శుష్కశరీరయగు భగవతి నిజ మాతృమండల సహితముగ ఆ శవమును భక్షింప, అపుడు భూమి దోషరహితమగును. అవశ్యముగ జరుగనున్న భావికాల సుఖ, దుఃఖ సందర్భములను ఎవరును నివారింపజాలరు. దానిని వారు వారు అనుభవించవలసినదే. ఆ నీ దీర్ఘదేహము పడిపోయిన పిమ్మట నీ జీవుడు అవ్యక్తాకాశమున స్వాంతస్థవాసనానుసారము తాను భూమండలమునకు రాజైనట్లును. 'సింధురాజ'ను పేరు గల్గియున్నట్లును, నూఱు వత్సరములు రాజ్యమేలినట్లును, సీమాంతమున నున్న విదూరథరాజను శత్రువుతో యుద్ధము సంభవింప అతనిని సంగ్రామమున వధించివేసినట్లును భావించును. తదుపరి సింధురాజగు నీ వొకపుడు మంత్రిని 'ఈ విధూరథరాజును జయించుట కష్టసాధ్యమేల ఆయెనో వచింపుమ'ని యడుగ ఆతడిట్లు చెప్పెను - ఆ విదూరథ రాజునకు లీలయను భార్య గలదు. ఆమె తపస్సుచే జగద్ధాత్రియగు సరస్వతీదేవిని వశమొనర్చుకొనెను. ఆ దేవియొక్క యనుగ్రహముచే నాతడు పరాక్రమశీలుడయ్యె

మఱియు మీరున్ను సరస్వతీ దేవి భక్తులైనను, పూర్వజన్మల అశుభవాసనా భ్యాసముచే మోక్షముకొఱకు గాక, శత్రునాశార్థమే అమెను ప్రార్థించిరి. విదూరథుడు మోక్షముకొఱకు దేవిని ప్రార్థించెను. కావున మీకు సంగ్రామమునజయము, అతనికి అపజయము తటస్థించినవి. ఏ చిద్రూపము సదా సర్వుల హృదయమున వసించుచున్నదో దానినే సరస్వతీదేవి యందురు. ఏయే భావము తోడ నెవరాదేవిని ప్రార్థించుదురో, అయా భావము నాతనికి అ చిద్రూపదేవి శీఘ్రముగ ప్రసాదించును. ఓ రాజా ! మీరు తామసజాతియందుత్పన్నమైన వారై పూర్వ మనేక జన్మలను గడిపిరి. వానినన్నిటిని నే నెఱుగుదును, మీరెఱుగరు. అందు ముఖ్యముగ ఒక జన్మమున మహా శరీరధారియై ఆకాశమున చాలకాలము వ్యర్థముగ గడపితిరి. అది విని సింధురాజు 'అయితే ఈ నాపూర్వ జన్మపు అధమ జాతిని పవిత్ర మొనర్చుట కేదేని యుపాయమున్నచో వచింపుమ'ని యడుగ మంత్రి యిట్లుచెప్పెను. 'ఈ ముల్లోకము లందును స్థిరచిత్తునిచేతను, ప్రయత్నవంతుని చేతను పొందరాని పురుషార్థ మెద్దియునులేదు. నిన్నచేయబడిన దుష్క్రియ, నేటిసత్క్రియచే శోభించునట్లు, పూర్వపు అధమజాతిని ఇప్పటి ఉత్తమ క్రియలచే జయించి పవిత్రవంతము చేయుడు.' మంత్రియొుక్క యా వాక్యములను విని సింధురాజు రాజ్యమును ద్యజించి, అతి దూర వనమునకేగి, సాధుజన మధ్యమున వసించుచు, వారి సాంగత్యముచే క్రమముగ వివేకమునొంది, నిరంతర ఆత్మానాత్మ విచారణగల్గి, తద్వారా ముక్తుడగును.

ఓ వ్యాధుడా ! ఇట్లు నీ భవిష్యద్వృత్తాంతమును దెలిపితిని. ఇక నీ యిచ్ఛవచ్చినట్లొనర్పుము - అని మునీంద్రుడు వచింప వ్యాధుడు విస్మయ చిత్తుడాయెను. పిదప కొంత కాలము యిరువురును శాస్త్రవిచార పూర్వకముగ నట తపంబొనర్చుచుండిరి. అనంతరము వ్యాధుడు ముని యాజ్ఞగైకొని తపము సలుపుటకేగెను. ఆ మునియు కొంతకాలమునకు దేహమును వీడి నిర్వాణప్రాప్తి నొంది పరమాత్మ పదమున నైక్యము బడసెను. వ్యాధుడున్నూ అనేక యుగరూప దీర్ఘకాలము తపస్సుచేసి బ్రహ్మదేవునివలన 'దీర్ఘకాయ' వరమును బొంది బహుకాలము

ఆకాశమున సంచరించి అవిద్యా (భ్రమ) రూప దృశ్యముయొక్క అంతముగానక తుదకు వైరాగ్యమొంది, తన విశాలదేహమును త్యజింప, అది మహా శవ రూపమున భూమిపైబడగా, భగవతియగు చండికా దేవి పరివార సహితముగ దానిని భక్షించెను. వ్యాధుని యా ఆకాశస్థ జీవుడు సింధురాజయ్యెను.

'ఓ విపశ్చిద్రాజా ! ఇకనిపుడు శవదోషరహితమై, స్థిరత్వమొందిన భూమండలమునకేగి అభీష్టదిశకు జనుము. ఇంద్రుడు స్వర్గమున నూఱవ యజ్ఞము జరుపనున్నాడు. అతనిచే నేనాహూతుడైతిని గావున అచ్చటికేగు చున్నాను' అని పలికి అగ్ని దేవుడంతర్ధానమయ్యెను. పిమ్మట నే నింకను అనేక చిత్రవిచిత్రమైన జగత్తులను, వృత్తాంతములను జూచుచు, అవిద్యయొక్క అంతముగానమి, ఖిన్నుడనై, అనంతర మొకానొక ఏకాంతస్థలమున మోక్షసిద్ధికై తప మొనర్పనుద్యుక్తుడనుకాగా, అపుడింద్రుడు 'ఓ రాజా ! నీకును, నాకును ఇపుడు మృగ (లేడి) జన్మములు సంభవింప నున్నవి' అని పలుక, 'నేనిపుడు సంసారముచే ఖిన్నుడనైతిని, ముక్తుడనగుటకై వరమొసంగుమ'ని యాతనినేనడుగ, 'నిరాకార, శుద్ధ చిత్స్వరూపమగు ఆత్మయే నేను' అనుజ్ఞానముచే మోక్షము కలుగునను విషయమును నీవు అగ్నివలన నెఱిగితివి గావున మఱియొక వరము కోరుకొమ్మని యింద్రుడు వచింప, మృగరూపము ధరించిన పిదప ఏమగునో తెలుపు మని నేను కోరగా, అపుడింద్రుడు 'మృగరూపమును ధరించిన పిమ్మట మహా పవిత్రమగు దశరథుని సభకు వెడలగా, అట (వసిష్ఠమునీంద్రుని యనుగ్రహముచే) పురషశరీరమొంది, నీ పూర్వ వృత్తామునంతయు స్మరించి, ఆత్మజ్ఞాన ప్రాప్తిచే చిరకాలపు అవిద్యనువీడి నిర్వాణము (మోక్షము) నొందెదవు.' ఇంద్రుడిట్లు పలికిన మీదట నేను వెంటనే లేడినై, అప్పటి నుండి పర్వతముపై తృణాదులను భక్షించుచు నుండ సమీపముననున్న రాజు అచటకి వేటకై ఏతెంచి నన్ను గొనిపోయి మూడు దినములు తన యింటి వద్దనుంచుకొని పిదప నీకు (రామచంద్రునకు) క్రీడార్థముగ నన్నొసంగెను. ఈ ప్రకారముగ అనేక శాఖావిస్తారములతో గూడిన ఈ అవిద్య అనంతమై యున్నది. ఆత్మ జ్ఞానముచే తప్ప మఱి ఏ యుపాయము చేతను అయ్యది శమింపదు.

. వాల్మీకి - ఓ భరద్వాజా ! ఈ ప్రకారము విపశ్చిత్తు చెప్పుచుండు నపుడు సాయంసమయం కాగా సభ విరమింపబడెను. దశరథుడు విపశ్చిత్తునకు గృహధనాది రాజ్యానురూపైశ్వర్యము నొసంగెను. పిమ్మట సర్వులు వారి వారి స్థానములకేగి స్నాన సంధ్యాదుల గావించుకొని, భుజించి యా రాత్రి గడపి మరల ప్రాతఃకాలమున సభా స్థలమునకు విచ్చేసిరి. అపుడు వసిష్ఠ మునీంద్రుడిట్లు బోధింపదొడగెను - ఓ రాజా ! అసత్యమును సత్యమువలె నున్నదియునగు ఈ అవిద్య యొక్క అంతమును ఇంత ప్రయత్నము చేసినను విపశ్చిత్తు కనుగొనజాలడయ్యె. ఈ అవిద్య తెలియనపుడు (ఆత్మజ్ఞాన ప్రాప్తికి పూర్వము) అనంతముగ భాసించును. తెలిసిన పిదప (ఆత్మజ్ఞాన ప్రాప్త్యనంతరము) మృగతృష్ణానది వలె సర్వథా లేనిదేయగును. ఇక, ఈ యుత్తమ కథలచే ఆత్మ తత్త్వమెఱిగి అవిద్యశమించుటచే మీవలెనే ఈ విపశ్చిత్తున్ను జీవన్ముక్తుడగును. ఈ అవిద్య అత్యంత నికృష్టమై, అశుభమై యున్నది. జీవుడు దేని దేనిని సంకల్పించునో దాని దానిని దేహమున్నను, లేకున్నను తప్పక అనుభవించును. జీవుడు ఏ భావముతోగూడి ఒక దేహమును త్యజించునో, ఆ భావముతో గూడియే అన్యదేహమును గాంచును. పుణ్యకారి యగు శుభ చిత్తము పుణ్యలోకములను గాంచి చిరకాలము వాని ననుభవించును. పాపకారియగు అశుభచిత్తము భయంకరమైన నరకాది దుఃఖముల ననుభవించును. ఈ దేహాది సమస్తమున్ను సంకల్పము యొక్క భ్రాంతిచేతనే భాసించుచున్నది. మఱియు చిరకాలానుభూత వాసనచే జీవుడు బహుకాలము సంసారమున ఆవాగమన మొనర్చుచున్నాడు.

ఓ రామచంద్రా! జీవుడు తనను తానే యుద్ధరించు కొనవలెను. ఆత్మజ్ఞానార్థము దృఢ ప్రయత్న మొనర్చుటచే తనకు తాను బంధువున్ను, ఒనర్చనిచో తనకు తాను శత్రువున్ను నగును. జ్ఞానముద్వారా తనను తాను రక్షించుకొననిచో, ఇక తన ఆత్మ రక్షణమున మఱి ఏ యుపాయమున్ను లేదు. ఎంతవఱకు నీకు యువావస్థయుండునో అంతవఱకు శుద్ధ బుద్ధియను నౌకద్వారా సంసార సముద్రమును దాటివేయుము. (యువావస్థగల) ఇపుడే ఆత్మజ్ఞానమను శ్రేయము

నొనర్పుము. ఏలయనగా, వృద్ధుడవైనచో నిక ఏమి చేయగలవు? అపుడు నీ శరీరావయవములే నీకు భారభూతములుగ నుండును. బాల్యవార్ధక్యావస్థలు జ్ఞానసాధకములు కానందుచే పశు, పక్షి, మరణసదృశములు. కేవలము యౌవనావస్థయే వివేకయుక్త మగుచో జీవుని జీవనమై యున్నది. వివేకము లేకున్న జీవుడు పశ్వాదులకన్న నధమమే యగును. మెఱుపువలె చంచల మైనట్టి ఈ సంసారమున, శాస్త్ర, సత్సాంగత్యాదుల ద్వారా మనుజుడు అజ్ఞానమను బురదలో నుండి తన ఆత్మను బయటకు తీయవలెను. ఈ దృశ్యముయొక్క స్వరూపమును తెలియని వానికి అది దుఃఖ ప్రదమున్ను, అది వాస్తవముగ బ్రహ్మమే అని యెఱుగు వానికి అది దుఃఖ ప్రదముగాకయు నుండును, స్వప్న పదార్థములు ప్రత్యక్షముగా అనుభూతమైనను, స్వప్నమని తెలియు నపుడు ఎట్లు అసత్తగునో, అట్లే స్పష్టముగ అనుభూతమైనను జాగ్రత్పదార్థములు ఆత్మజ్ఞానముచే అసత్తుగ భాసించును. బాహ్య విషయ ప్రదేశములందు సంచరించు ఇంద్రియములను జయించి, జ్ఞానము ద్వారా అవిద్యను నిర్మూలించి ముక్తుడవై, జననమరణ రహితుడవు కమ్ము.

ఓ రామచంద్రా ! ఇంద్రియములను జయింపకున్న అజ్ఞానము శమింపదు. అట్టి ఇంద్రియ జయమున కుపాయము చెప్పెద వినుము. ఇంద్రియములను సైనికులకు చిత్తము నాయకుడు. దానిని జయించి నచో ఇంద్రియములు జయింపబడును. చిత్తవృత్తిని బ్రహ్మమున నైక్యపఱచి హృదయమున నిజ ఆత్మయందు స్థితుడైయుండువాని మనస్సు స్వయముగనే శమించును. మఱియు బాహ్య విషయాకారమగు చిత్త వృత్తిని నిరోధించుటచే చిత్తమెట్లు శమించునో, అట్లు తప, తీర్థ, విద్యా యజ్ఞాదిక్రియా సమూహములచే శమించదు. ఏయే విషయముల గూర్చిన స్మరణ చిత్తమందగునో, వాని వానిని అధిష్ఠాన బ్రహ్మమున లయమొనర్చి, విషయ సంస్కారనాశముద్వారా విషయ విస్మృతియను ఉపాయము ద్వారా భోగహేతువులగు ఆ విషముల జయము స్వయముగనే సంభవించును. నిజ అభ్యాసమను యత్నముచే చిత్తవృత్తి విషయముల నుండి ఒకింతైనను నిరోధింపబడినచో నిక స్వారాజ్య (మోక్ష)

పదవి ప్రాపించినట్లే యెంచుము. పదార్థము లందలి ఇచ్ఛను త్యజించి, శమ, సంతోషముల నార్జించువాడు జితేంద్రియుడు. చిత్తమెపుడు విషయములవైపునకు పరుగిడుటను వీడునో, అపుడు వివేకము వైపునకు పరుగిడును. వివేకియగుటచే మనుజుడు జితేంద్రియుడగును. జితేంద్రియుడగుచో నిక వాసనా తరంగవేగముచే సంసారమున కొట్టుకొని పోడు. సత్యము (ఆత్మ) యొక్క అవలోకనముచే సంసారభ్రమ నశించును. (మృగతృష్ణయొక్క యథార్థజ్ఞానముచే ధావన, పతనాది దుఃఖము నశించునట్లు). ఓ రామచంద్రా ! మనస్సుయొక్క అంకుర రూపమగు సంసారమునందలి రాజ్యాదులందేమి సుఖము గలదు? తత్త్వజ్ఞానమున విశ్రాంతి నొందినచో ఇంద్రుని సుఖమున్ను తృణమువలె భాసించును. సర్వోత్తమ ఆనందరూపమగు మోక్షము (ఇంద్రియ, వివేకాది) యత్న సమూహముచే తప్ప సిద్ధింపదు. మహాభ్యాసమను వృక్షముయొక్క ఫలమే పరమాత్మ పదమని యెఱుంగుము. అన్ని శాస్త్రములకంటె నుత్తమమగు ఈ యోగవాసిష్ఠ శాస్త్రముయొక్క విచారణచే మనుజుడు ఈ జగత్తు మాయ యని యెఱింగి, వివేకముద్వారా ముక్తి పదము నొందగల్గును. పరబ్రహ్మము ఆద్యంతరహితమై, వాక్కునకు విషయము కానిదై శిలాగర్భమువలె (జ్ఞాన) ఘనీ భూతమై వెలయుచున్నది. ఇవ్విషయమున నొక ఆఖ్యానమును వచించెద, వినుము -

## శిలోపాఖ్యానము

అనేకవేల కోట్ల యోజనముల విస్తీర్ణముగలదై (అనంతమై), నిర్మలమై, నాశరహితమైనట్టి ఒకానొక శిలగలదు. దానియందనేక రేఖలు కలవు. ఆ శిల సర్వత్రవ్యాప్తమై, ఎవరిచేతను భేదింప శక్యముగానిదై యున్నది. దానికంటె వేఱుగ ఏ పదార్థమున్ను లేదు. ఓ రామచంద్రా ! సర్వవ్యాప్తమగు పరమాత్మ మహాసత్తయే ఆ శిల. ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివీ, పర్వత, ప్రాణి సమూహాదులేదాని యందలి రేఖలు. నేనున్ను ఆ శిలయందలి ఒక రేఖనే. ఆకాశాదులును, మనమందర మును, ఆ శిలయొక్క అవయవరూపులమే. కావున మనమందరము

అభిన్న (పరమాత్మ) రూపులమే. భ్రమచే భిన్నరూపులుగ తలంచు చున్నాము. ఆ పరమాత్మ కంటె అన్యముగ ఏదియును లేదు. ఈ నానా రూపముగ దృశ్యమానమగు విశాల జగత్తు వాస్తవముగ పరమాత్మసత్త కంటె వేఱుకాదు. పరబ్రహ్మరూపమగు ఆ మహాశిలయే తనయందు సృష్టి, జగత్తు, పదునాలుగు లోకములు, ఇత్యాది దృశ్యరూప కల్పనను స్వీకరించినది.

ఓ రామచంద్రా ! ఈ పదార్థములన్నియు చిద్రూపములనుట యందు నిత్యదృష్టమగు స్వప్నమే దృష్టాంతము. కాబట్టి దానిని విచారింపుము. ఈ జగత్తునందు చిన్మాత్రము కంటె వేఱుగ సారమేమి గలదు?

ఓ రాఘవా ! అజ్ఞానుల బుద్ధి విషయములనుండి చలింపనట్లు జ్ఞాని యొక్క బుద్ధి చిదాకాశము (ఆత్మ)నుండి చలింపదు. అట్టి చిదాకాశరూప ఆత్మయందే నిశ్చలముగనుండును. అట్టివాడే జీవన్ముక్తుడనబడును. అతడు సదా ఆత్మయందే సంతుష్టి నొందుచు ఆత్మయందే రమించుచునుండును. మఱియు పరమాత్మయందు విశ్రాంతి నొందిన అట్టి జీవన్ముక్తుల చిత్తము అటనుండి మరలి తిరిగి దృశ్యమునందు ప్రవేశింపదు. వ్యవహారమొనర్చు చున్నప్పటికిని జీవన్ముక్తు లకు పదార్థములందు రాగముండదు. ఏ జ్ఞానవిషయమున అజ్ఞానుల నిదురించు చుందురో (నిర్లక్ష్యముచేయుదురో) అట్టి జ్ఞానవిషయమున జ్ఞానులు సదా మేలుకొని యుందురు. ఏ దృశ్యవిషయమున అజ్ఞానులు మేలుకొనియుందురో, అద్దాని యెడల జ్ఞానుల నిదురించుచుందురు (దృష్టిలేకయుందురు). సమస్త జగత్తును మ్రింగివైచి (తనయందు లయమొనర్చుకొని) తృప్తి పర్యంతము ఆత్మానందామృతమును గ్రోలి, పరమపూర్ణత్వమునొంది, కామక్రోధాది రహితుడై, సంసార సముద్ర మును దాటి, చిదాకాశమను శయ్యపై ఆత్మజ్ఞాని సుఖముగ విశ్రమించును. ఆత్మజ్ఞాని యీ జగత్తును చిదాకాశరూపమగు నిజస్వరూపమున ఏ మూలనో స్వప్నమువలె గాంచుచు ఆత్మయందు సుఖముగ విశ్రమించును. జీవన్ముక్తుడగువాడు యథాప్రాప్తమగు

పవిత్రకర్మయను మిత్రునితో క్రీడించుచుండును. ఆ శుభకర్మరూప మిత్రునకు స్నాన, దాన, తప, ధ్యానాదులను అనేక పుత్రులును, 'ముదిత' (నిత్యసంతోషత్వము) సమత్వము, మైత్రియను భార్యలును, కరుణయను సఖియు, ధైర్య ధర్మోపేత బుద్ధియను ద్వారపాలికయు, సత్యత్వమను ధనాధ్యక్షురాలును గలరు. ఇట్టి పరివారసహితుడును, నిజ మిత్రుడును (లేక మంత్రియు) నగు స్వకర్మతో గూడ వ్యవహరించుచు జీవన్ముక్తుడు హాని లాభములందు కోప ప్రసన్నత్వములులేక సమముగ నుండును. వ్యవహరించుచున్నను చిత్రలిఖిత యోధునివలె జీవన్ముక్తు డగు ముని సదా నిర్వాణ మనస్కుడై, స్వస్వరూపమున నిశ్చలముగ స్థితినొందియుండును. ఈ యుత్తమ గుణములన్నియు ఆత్మజ్ఞులగు జీవన్ముక్తులకు స్వభావమేగాని అన్యుల ప్రయత్నముచే వారు గుణయుక్తులై యుండుటలేదు.

ఓ రామచంద్రా ! జాగ్రత్తునందు స్వప్న నగరమెట్లు భాసించునో, అట్లే బ్రహ్మము నెఱింగిన మీదట ఈ జగత్తున్ను (మిథ్యగా) భాసించును. అట్టిచో వివేకి యగు వానికి ఈ స్వప్నమువంటి జగత్తునందు విశ్వాస మెట్లుండును? దృశ్యము భ్రాంతి మాత్రమని, అత్యంత అసంభవమని యెఱింగి ఆత్మబోధ గలిగియుండుటయే పరమపదము. మఱియు సమ్యక్ - జ్ఞానము కలిగి చిన్మాత్ర పరాయణులై యుండుటయే (సమ్యగ్బోధైక ఘనత్వమే) ధ్యానము. ఆత్మజ్ఞానముచే దప్ప ఈ జగద్భ్రాంతి తప, తీర్థవ్రతాదులచే నెన్నటికిని శమింపదు. ఏలయనగా, తప, తీర్థాదులచే స్వర్గలోకాదులు ప్రాప్తించునే గాని ముక్తికాదు. ఆత్మజ్ఞానపూర్ణమగు మోక్షోపాయరూపమైన ఈ (యోగవాసిష్ఠ) శాస్త్రము యొక్క అర్థమును ఉత్తమ శుద్ధబుద్ధిచే విచారించుటచేతనే ఈ సంసార భ్రాంతి శమించును గాని మఱి ఏ యుపాయముచేత గాదు. అనర్థదాయకమగు అవిచారణచే ఆయువును భస్మీభూతమొనర్చుకుము, జ్ఞానసార మగు బోధచే దృశ్యమును ఆత్మరూపముగ నొనర్పుము. ఆయువు యొక్క ఒక్కొక్క క్షణము సర్వరత్నములచేతను గూడ లభింపజాలదు. కావున అట్టి అమూల్య ఆయువును వ్యర్థముగ గడుపుట మహాప్రమాదమై యున్నది.

ఓ రామచంద్రా ! (పరమాత్మయొుక్క మాయాశక్తివలన) ఒక్కొక్క అణువునందును గూడ అసంఖ్య బ్రహ్మాండములు గలవు. వాని నన్నింటిని ఎవరు లెక్కింపగలరు. ఇవ్విషయమున పూర్వము బ్రహ్మదేవుడు నాకు వచించిన ఆఖ్యానమును చెప్పెద వినుము -

## బ్రహ్మాండాఖ్యానము

పూర్వమొకపుడు నేను బ్రహ్మదేవుని 'ఈ జగజ్జాల మెంతగలదు? ఎచట భాసించుచున్నది' అని యడుగ నాతడిట్లు వచించెను - ఓ మునీ ! బ్రహ్మమే ఈ సమస్త జగద్రూపమున భాసించుచున్నది. అజ్ఞానుల కీ జగత్తు జగద్రూపముగను, జ్ఞానులకు అనంత బ్రహ్మ సత్తారూపముగను గోచరించును. ఈ ముల్లోకములందలి ప్రతి పరమాణువునందును అతి విశాలములగు అ సంఖ్య బ్రహ్మాండములు గలవు. ఆ బ్రహ్మాండములను జీవ, పృథ్వ్యాది సమూహములచే బూర్ణములై యున్నవి. ప్రతి జీవుడును నిజ హృదయమున ఆత్మయను అద్దమున ప్రతిబింబమువంటి ముల్లోకములను అనుభవించుచున్నాడు. ఈ రీతిగ ఆత్మతత్త్వముయొుక్క జ్ఞానము లేనపుడు (అజ్ఞానమువలన) ఈ అవిద్య అనంత దృశ్యరూపమై యు, ఆత్మ జ్ఞానముచే బాధితమగునపుడు కేవల నిర్మల బ్రహ్మరూపమై యు విలసిల్లుచున్నది.

ఓ రామచంద్రా! బ్రహ్మమయమగు ఈ జగత్తునందు వాస్తవముగ ఆకారవంతమగు పదార్థమెద్దియును లేదు. అంతయు నిరాకార, శాంత బ్రహ్మమే అయియున్నది. ఏది ఆద్యంతములందు లేదో, అదియంతయు భ్రమరూపమే యగును. చైతన్య బ్రహ్మమే స్వప్నమందువలె ఈ సమస్త పదార్థ రూపమున ప్రతిభాసించుచున్నది. కావుననే తత్త్వజ్ఞులు జ్ఞానోత్పత్తి ద్వారా ఈ వాసనారూప సాకారజగత్తును బాధితమొనర్చి, ఆకాశ, పర్వతాది ఈ సమస్తమును నిరాకార బోధరూపముగనే యెఱుగు చున్నారు. సమస్త జగత్తును సత్తారూప చిన్మయ బ్రహ్మముగనే నీవెఱుగుము కాని అన్యముగ కాదు. ఇవ్విషయమున పూర్వము వచించినట్టి ఐందవోపాఖ్యానమును, (జగత్తు చిన్మాత్రమను) దృష్టిచే తెలిపెద వినుము

## ఐందవోపాఖ్యానము

ఒకానొక జగత్తునందు వేదాధ్యయనపరుడును, పుణ్యకర్మా నుష్ఠానయుతుడునగు ఐందవుడను బ్రాహ్మణుడుండెను. అతనికి పదిమంది సజ్జనులగు పుత్రులు కలరు. కాలక్రమమున వారి తండ్రి మరణింప, తల్లియు అతని ననుసరింప, వారికి దహనాది సంస్కారముల గావించి, మాతాపితృ వియోగ దుఃఖియుతులై ఆ పదిమంది సుతులును, వ్యవహారముల నన్నిటిని వీడి సమాధిశీలించుట కొఱకు అరణ్యమున కేగిరి. అట ఒకానొక ఏకాంత స్థలమున వారందరును పద్మాసనస్థులై, ఉత్తమ సిద్ధిదాయకమును, బ్రహ్మదేవ పదవి నొసంగునదియునగు ధారణను గూర్చి యోచించి, మేము బ్రహ్మాండరూపులము, బ్రహ్మదేవులము అగుగాక! యను దృఢ నిశ్చయము గలవారై అట్టి ధారణయందు పదునెనిమిది మాసములుండ, అంతట వారి స్థూలదేహములు హింసజీవులచే భక్షింపబడి నశించెను. కాని వారు అట్టి బ్రహ్మదేవపద చింతనాయుక్తులైయే చాల కాలముండగా, ధ్యాన పరిపాకముచే వారందరును వేఱు వేఱుగా బ్రహ్మాండ శరీరులైరి. ఈ ప్రకారముగ నిరాకార, నిర్మల చైతన్యమే వారి ఇచ్ఛారూపమై తిరిగి బ్రహ్మాండ రూపమాయెను. కావున ఆ బ్రహ్మాండములన్నియు చిన్మయములగుటచే భూమి పర్వతాదులన్నిటిని చిన్మాత్రముగనే నీ వెఱుంగుము. ఐందవ జగత్తులందువలెనే ఈ జగత్తునందును చిన్మాత్రమునకు భిన్నముగ ఒకింతైనను లేదు.

ఓ రామచంద్రా ! ఏ యే రీతి ఈ ప్రంపచమును చిద్రూపదృష్టిచే వీక్షించుదురో, ఆయా రీతి శీఘ్రముగ ఈ సంసార దుఃఖమున్ను విలయమగుచుండును. మఱియు ఏ యే రీతి ఈ ప్రపంచమును చిద్రూపదృష్టిచే వీక్షింపకుందురో, ఆ యా రీతి ఈ సంసార దుఃఖమున్ను మహాఘనీభూతమగు చుండును. మహాపాపముచే మూఢుడై ఎవడు చిద్రూప (ఆత్మ) దృష్టిచే జగత్తును వీక్షింపకుండునో అతనికి ఈ సంసారము దృఢపడి ఎన్నటికిని శమింపకయే యుండును,

శ్రీరామచంద్రుడు - ఓ మునీంద్రా ! నా యీ సంశయమును తాము నివారింపవేడెద -

## తాపసోపాఖ్యానము

ఒకపుడు నేను పాతశాలయందు పండితుల సభయందుండగా నచ్చటి కొక మహా తేజస్సంపన్నుడైన తపస్వియగు బ్రాహ్మణుడేతెంచ, మేమందరమాతనికి నమస్కరించితిమి. పిమ్మట నేనాతనిని 'ఎచటినుండి యేతెంచితిరి' అని యడుగు అతడిట్లు చెప్పదొడగెను - మహాశయా ! నేను ఏ కార్యము కొఱకు వచ్చినది తెలిపెద వినుడు - విదేహదేశమున నొక బ్రాహ్మణ కులమున నేను జన్మించితిని. నా దంతములు కుంద పుష్పమువలె తెల్లగ నుండుటచే కుందదంతుడని ప్రసిద్ధి కెక్కితిని. విద్యోపార్జనానంతరము వైరాగ్యము జనింప, సంసారశ్రమ నివారణార్థము మహా ప్రయత్నయుతుడనై మునుల స్థానములందు సంచరించుచు, క్రమముగా శ్రీ పర్వతమునకు వచ్చి అటదీర్ఘకాలము కోమల తపంబొనర్చుచుంటిని. ఒకపుడట నొక యరణ్యమున ఒక వృక్షశాఖ యందు, కాళ్ళు త్రాటిచే కొమ్మకు కట్టబడి శిరస్సు క్రిందకు వ్రేలాడుచు నున్నట్టి తాపసునిగాంచి, అతని స్పర్శమూలకమున నాతడు జీవించియున్నట్లెఱింగి, అతనికి సేవచేయుచు క్రమముగ నాతని విశ్వాసమును చూరగొని 'ఏల యిట్టి దారుణ తపంబొనరించు చుంటిరి' అని యాతనినడుగ, అతడిట్లు వచించెను. -

నేను మథురయందు జన్మించితిని. బాల్యయౌవనముల మధ్య శాస్త్రముల పదపదార్థ జ్ఞానముతో గూడుకొనిన వాడనై, ఒకపుడు 'రాజు సమస్త సుఖములకు స్థానభూతుడని విని సప్తద్వీపపతియగు ఈ విశాల పృథివికి రాజు ఎట్లగుదునను తలంపుగలవాడనై, ఈ ప్రదేశమునకు వచ్చి తపస్సునాచరించుచు ఇప్పటికి పండ్రెండు వత్సరములు గడచినవి. నీవు నీయభీష్ట స్థలమునకు పొమ్ము. మనోరథ సిద్ధివఱకు నేనిట్లే తపోనిరతుడనై యుందును అని పలుక, 'అంతదనుక నేనిట మీ సేవచేయుచు నుందున'ని నేను చెప్పి యచ్చోటనే శీతోష్ణాదులను సహించుచునే నాతని చెంత నుండ, ఒకపుడొక ప్రకాశమానుడగు పురుషుడు సూర్య

బింబమునుండి వినిర్గతుడై యచ్చోటికివచ్చి 'ఓ తపస్వీ ! ఇక నీ తపమును విరమించి యభీష్టవరమును గ్రహింపుము. 'నీవు రాజై ఈ పృథివిని ఏడు వేల సంవత్సములు పాలింతువు' అని చెప్పి తిరిగి సూర్యునియందు ప్రవేశించి యంతర్ధాన మొంద, అభీష్టమీడేరుటచే తపస్సును విరమింపుడని నేనాతనితో జెప్ప, ఆతడు సమ్మతింప అపుడాతని కాళ్ళకు కట్టబడి యున్న త్రాటిని విప్పితిని. పిమ్మట ఆతడు స్నానముచేసి, అఘమర్షణ మంత్రమును జపించిన పిదప మేమిరువురమును ఫలముల భుజించి, అచ్చటనే మూడు రోజులు విశ్రమించి పిదప మథురయందలి అతని స్వగృహమునకు పయనమైతిమి. అట్లిరువురమును పోవుచు, గ్రామ వనములను దాటుచు చనుచుండ నొకచోట ఆ తపస్వి ప్రకృత మార్గమును వీడి అన్యవనమున బ్రవేశించుచు 'మునులచే శోభితమగు ఈ గౌరీ ఆశ్రమమునకు బోవుదము రమ్ము, అట నావలెనే రాజపదవీ ప్రాప్తికై తపము సలుపుచున్న నా తక్కిన యేడుగురు సోదరులు కలరు. నేనున్ను పూర్వమిచట వారితోగూడ ఆఱు నెలలు వసించితిని' అని యాతడు పలుక, పిమ్మట మేమా యాశ్రమమునకు బోవ, అయ్యది శూన్యమై చూపట్టెను. ఒకచోట మాత్రమొక వృక్షము క్రింద ఒక వృద్ధ తపస్వి సమాధియందు స్థితుడైయుండెను. చాలాసేపచట వేచి యుండినను, ఆతడు సమాధినుండి లేవనందున, నా చంచల స్వభావముచే నేను 'ఓ మునీ ! ఇక సమాధినుండి మేలుకొనుము' అని బిగ్గరగా పలుక, ఆతడు సమాధి విరతుడై 'మీరెవరు? గౌర్యాశ్రమమెచట? నన్నిచటికి ఎవరుచేర్చిరి? ఇపుడేకాలము జరుగుచున్నది' అని మమ్ముల నడుగ 'తామే యోగబలముచే వీక్షించి తెలిసికొనుడు, మేమెఱుంగము' అని మేము నుడువ, ఆతడొక ముహూర్తమాత్రకాలము ధ్యానమందుండి, పిమ్మట మాతో నిట్లనెను –

సఘన పుష్పాది యుక్తమగు ఈ రమ్య కదంబ వృక్షము ఇవ్వనమున నా నివాస స్థానము. పూర్వ మీ వృక్షముపై గౌరీదేవి పది సంవత్సరములు నివాసముండెను. అత్తఱి యీ వనమంతయు మిగుల శోభావంతముగ వెలసెను. దేవి స్పర్శచే యీ వృక్షము పవిత్రమై శైథిల్యము నొందక యున్నది. గౌరీదేవి వెడలిపోయిన పిదప ఈ వృక్షమునుతప్ప తక్కిన ఈ

వనమునంతయు సమీపస్థ జనులు కొట్టివేయగా, ఇది శూన్యమైపోయెను. నేను మాలవదేశరాజును. వైరాగ్యముచే రాజ్యమును వదలి మునుల స్థానములందు సంచరించుచు, ఇట ధ్యాన పరాయణుడనైతి. పిమ్మట కొంతకాలమునకు తక్కిన సోదరులతో గూడ నీవీ యాశ్రయమునకు తపము సలుప నేతెంచితివి. తదుపరి కొంతకాలమైన వెనుక నీవు శ్రీ పర్వతమునకు జనితివి. నీ రెండవ సోదరుడు కార్తికేయస్వామి నిలయమునకు, మూడవ వాడు కాశీకి, నాల్గవవాడు హిమాలయమునకు తపసుకైపోయిరి. తక్కిన నలుగురు ఇచ్చటనే ఉగ్రతపమాచరించిరి. నీవు తపస్సుచేయుచుండగనే నీ తక్కిన సోదరులు వరములపొంది నిజగృహమునకు తిరిగి వచ్చిరి. తదుపరి మీరిరువురును ఇట కేతెంచితిరి. ఇక మీరు మీ మీ గృహములకు జనుడు. అంత నేనా తాపసిని 'ఒకే తూరి ఏడుగురును ఒకటేయగు ఈ పృథివికి రాజెట్లగుదురు?' అని యడుగ అతడిట్లు వచించెను -

ఇంతమాత్రమే అసమంజసముకాదు. ఇంకను అసమంజసమైన దానిని వినుము. ఈ ఎనిమిదిమంది సోదరులకును ఎనిమిదిమంది ఉత్తమ భార్యలుకలరు. వారు తమ భర్తలు తపమునకై వెడలిన పిదప, మిగుల దుఃఖము నొంది శత చాంద్రాయణ వ్రతమును సలుప, దానిచే పార్వతీదేవి సంతుష్టయై పూజాసమయమున వారి యంతఃపురములందు అదృశ్య రూపమున వెలసి వరములను కోరుకొమ్మనగా, చిరంటికయను భార్య 'దేవీ! శివుని యెడల నీకెట్టి ప్రేమ గలదో, అట్టి ప్రేమ నా భర్తయెడల నాకుండుగాక! మఱియు నా భర్త మృత్యురహితుడగు గాక !' అని ప్రార్థింప దేవి 'సృష్ట్యారంభమునుండి గల నియతి ననుసరించి తపోదానాదులచే మృత్యురహిత పదవి లభింపదు. కావున మఱియొక వరము కోరుకొమ్మన, అట్లైన నా మృతపతియొక్క జీవుడు నా యంతఃపురమునుండి క్షణకాలమైనను బయటకు పోకుండుగాక ! అను వరము ననుగ్రహింపుమని ఆమె కోరగా దేవి అట్లేయని యంతర్ధాన మొందెను. అనంతరము వారి పతులు వరములబొంది యిండ్లకు తిరిగి వత్తురు.

ఇంకొక ఆశ్చర్య వృత్తాంతమును వినుము. ఆ సోదరులందరును తపస్సు చేయుచున్న సమయమున పుత్రవియోగముచే నతి దుఃఖితులై వారి తల్లిదండ్రులు, కోడండ్రతో గూడ తీర్థయాత్రకుజని, కలాప గ్రామమను తీర్థమున వ్రతము సలిపి, పిదప ముని గ్రామమార్గమున బోవుచు, త్రోవలో నొక కపిల వర్ణ మనుజునిగాంచి, ఎవరో అనుకొని నమస్కరింపక అనాదరించి చనుచుండ, ఆ తపస్వి కృద్ధుడై 'దుర్వాసుడనగు నన్ను అనాదరించి బోవుచున్న మీయొక్క కుమారులు, కోడండ్రు పొందిన వరములు విపరీత ఫలముల నొసంగుగాక!' అని శపించెను. వారు తిరిగి యాతనిని సన్మానించు లోపలనే అతడంతర్ధానమై పోయెను. పిమ్మట వారు అతి దుఃఖితులై స్వగృహమున కేతెంచిరి. ఈ ప్రకారముగ, చిదాకాశమున సంకల్పముచే కల్పింపబడిన ఈ సంసార మున అనేక విచిత్ర అసమంజస వార్తలు సంభవించుచుండును.

అటుపిమ్మట, కొంతకాలమునకు ఆ యెనిమిదిమంది సోదరులు మరణింప, వారి బంధువులు దహనాది క్రియలను సలుపుదురు. అత్తఱి వారి వర, శాపములు క్రమముగ విష్ణు, శంకరరూపముల దాల్చి యటకేతెంచి, 'మేమెక్కువ, మేమెక్కువ' అని స్పర్థించుకొని తుదకు వరములు చెప్పిన చొప్పున యిరువురు బ్రహ్మదేవుని కడకేగి, సందర్భము నాతనికి తెలియజేయ 'మీలో లోనసారముగల వారెవరో వారు జయింతురు' అని బ్రహ్మదేవుడనగా, అంతట వారొకరి యందొకరు ప్రవేశించి చూడ. వరములే అంతఃసారము గలవి యని శాపములు గ్రహించి తమ యపజయము నొప్పుకొని యటనుండి వెడలిపోయెను. అపుడు సూర్యదత్తసప్త ద్వీపాధిపత్యరూప వరములను, గౌరీదత్త గృహ బాహ్యస్థాననిరోధరూప వరములను గూర్చి పలుకుచు బ్రహ్మదేవుడు, మీరిరువురకు విరోధముగ సంభవించునది యేదియును లేదు. ఏల యనగా, ఆ యెనిమిదిమంది సోదరులును మరణానంతరము చిరకాలము నుండి వారి వారి గృహములందే సప్తద్వీపవతి యగు పృథివికి రాజై, వెలయుచున్నారు. చిత్పరమాణువు నందు స్వప్నమునందు వలె అనేక బ్రహ్మాండములు వర్తించుచుండ నిక గృహాకాశమున పృథివి

వర్తించుట యందేమి యాశ్చర్యము ! అని చెప్పగా వరములు బ్రహ్మదేవునకు ప్రణమిల్లి వెడలిపోవును.

అత్తఱి ఆ సోదరులు వారి వారి గృహాకాశములందు పృథివీపతులై వెలయుచు, పరస్పరము అజ్ఞాతులై, అన్యోన్య భూమండలగాములై, పరస్పరహిత తత్పరులై, భిన్న భిన్న కార్యాచరణమగ్నులై యుందురు. ఓ మునీ! ఈ జగత్తు విశాల రూపమున గన్పట్టినను, జలమందావర్తము వలె, ఇట నానా రూపత్వమేమియును లేదు. ఇదియంతయు శాంతమగు చిదాకాశమే స్వప్నమందువలె భ్రాంతిచే నిట్లు వివిధ రూపముల ప్రతిభాసించుచున్నదగును. విప్రులారా! ఇక మీరు మీ మీ గృహములకు బోయి అభిమత కార్యముల నొనర్పుడు. ఏలయనగా, సమాధి లేనందున నేను దుఃఖితుడనై యున్నాను. కావున తిరిగి యిపుడు సమాధియందు ప్రవేశించుచున్నాను' అని చెప్పి, ఆ కదంప తాపసి నేత్రములను మూసికొని ధ్యానస్థు డయ్యెను. మేము మరల మరల ప్రార్థించినను, బాహ్యావృత్తి లేనందున సమాధాన మొసంగకుండెను. అంతట మేమటనుండి వెడలి స్వగృహములకు బోతిమి. కొంత కాలమునకు ఆ యెనిమిదిమంది సోదరులు మరణింప, నేను నా యా మిత్రుని వియోగముచే నతి దుఃఖితుడనై, తద్దుఃఖ నాశార్థము ఆత్మజ్ఞానమును గూర్చి ప్రశ్నించుటకై ఆ కదంబ వృద్ధతాపసి వద్దకుబోవ, అట మూడు నెలలైన వెనుక అతడు సమాధినుండి లేచి నా ప్రశ్నను పురస్కరించుకొని యిట్లు నుడివెను - అభ్యాసము లేనందున పరమార్థోపదేశము నీకు అంటుటలేదు. కావున నేను చెప్పినట్లు చేయుము. అయోధ్యానగరము నందలి దశరథ రాజకుమారుడగు శ్రీరామచంద్రుని వద్దకు నీవు పొమ్ము. మునిశ్రేష్ఠుడు శ్రీరాముని కొఱకై సభా మధ్యమున మోక్షోపాయము నుపదేశించును. అద్దాని శ్రవణముచే పరమపావనమగు బ్రహ్మ (పరమాత్మ) పదమున నావలెనే చిరకాలము విశ్రాంతి నొందగలవు.' ఇట్లు వచించి యా తపస్వి సమాధినిష్ఠుడు కాగా, అతని యాజ్ఞానుసారము నే నిచటికి ఏ తెంచితిని' అని ఆ కుందదంతుడు నాతో చెప్పెను. ఓ మునీంద్రా ! అప్పటినుండియు నాతడు నావద్దనే సదా యుండుచున్నాడు, ఆ కుందదంతుడిదిగో,

ఇపుడిచటనే యున్నాడు. తాముపదేశించిన మోక్షోపాయము నీతడిపుడు వినియున్నాడు. దానిని విని యీతడు సంశయరహితుడాయెనా, కాలేదా యని యడుగ వేడెద.

అంతట వసిష్ఠ మునీంద్రుడు కుందదంతు నుద్దేశించి 'ఓ బ్రాహ్మణుడా! నా వాక్యములను వినిన నీవు నేను వచించిన మోక్షప్రదమగు జ్ఞేయబ్రహ్మము నెఱింగితివా' అని ప్రశ్నింప, 'మహాత్మా! తమ యనుగ్రహమువలన నా సంశయము లన్నియు నివారింపబడినవి. జ్ఞేయవస్తువగు బ్రహ్మమును నే నిపుడు పూర్ణముగ నెఱింగితిని. మఱియు పరమాత్మ పదమున విశ్రాంతిని బొందితిని' అని యాతడు ప్రత్యుత్త రించెను. అటుపిమ్మట వసిష్ఠ మునీంద్రుడు శ్రీరామచంద్రున కిట్లుపదేశింపదొడగెను.

ఓ రామచంద్రా! భ్రమచే బ్రహ్మమే జగద్రూపమున భాసించుచున్నది. కావున వాస్తవముగ సమస్తము నిర్వికారమగు బ్రహ్మమే అయి యున్నది. జ్ఞానముయొక్క దృశ్య విషయరూప ప్రాప్తియే బంధము. తద్దృశ్య విషయశాన్తి రూపమగు కేలవజ్ఞాన స్వరూప స్థితియే మోక్షము. (శమదమాదిసాధనారూప) దృఢ అభ్యాసజనితమగు సమ్యక్ ఆత్మజ్ఞానముచే విషయ జ్ఞానరూప భ్రాంతి నివృత్తమై నిరాకార, శాంత ఆత్మరూపమగు ముక్తి ప్రవృత్తమగుచున్నది. కారణముయొక్క అభావముచే ఈ జగత్తు సృష్ట్యాదియందే యుత్పన్నము కాకయున్నది. కావున ఇక దృశ్య జగత్తెచట? అంతయు శాంతమగు పరమాత్మయే అయియున్నది. సృష్టి కేవలము భ్రమ మాత్రమే. సత్యమగు ఆత్మస్వరూపము యొక్క జ్ఞానముచే భ్రమరూపమగు ఈ జగత్తునందలి స్థూలత్వబుద్ధి నశించును. అత్తఱి భోగములయెడ ఆసక్తి క్షీణమగును. దానిచే అనేక జన్మలందు బాగుగ దృఢపడి యున్నట్టియు, జన్మరూప బంధన ప్రదమును, అతిభయంకరమునునగు వాసన క్షయించును. ఓ రామచంద్రా! ఈ జగత్తు కేవలము సంకల్ప మాత్రమే అని నిశ్చితమైనపుడిక అది దుఃఖహేతువెట్లగును? జగత్తుయొక్క సంకల్ప రూపత్వమును ఎఱింగిన పిదప, ఇక ఆ జగత్తుయొక్క నాశాదులచే

దుఃఖము కలుగనేరదు. కాబట్టి అద్దాని తత్త్వమును విచారించుము. ఈ జగత్తు అజ్ఞానికి సాకారముగను, జ్ఞానికి నామ రూప రహితమగు పరబ్రహ్మముగను అనుభూతమగును. అజ్ఞానముచే బ్రహ్మమే జగద్రూపముగ భాసించును. జ్ఞానముచే కేవలము నిర్వాణ బ్రహ్మస్వరూపమే శేషించును.

అంతట, వసిష్ఠమునీంద్రుని యా బోధచే శ్రీరామచంద్రుడు ప్రబుద్ధుడై స్వానుభవము నిట్లు తెలిపెను - ఆహా! ఇంతవఱకు మహాకాశమందలి ఈ బ్రహ్మాండము యొక్క ఏకదేశమున ఆత్మతత్త్వమెఱుంగక దీర్ఘకాలము మనము పరిభ్రమించుచున్నాము. ఆత్మతత్త్వమెఱింగిన పిదప ఈ జగద్భ్రాంతి ఏ కాలమునను లేదని తెలియబడును. ఈ సమస్తము కేవలము విజ్ఞాన ఘనమైన చిదాకాశమాత్రమే అయియున్నది. ఆహా! ఆశ్చర్యము. ఈ పరమ చిదాకాశమే అజ్ఞాన మాత్రముచే జగత్తుగ భాసించుచున్నది. వాస్తవముగ దృశ్యముగాని, ద్రష్టగాని, చిదాభాసుడు (జీవుడు) గాని జాగ్రదాదులు గాని, అవిద్యగాని లేవు. స్వప్న మనోరథాదులందు వలె చిత్స్వరూపమగు పరమాత్మయే పదార్థ రూపముగ భాసించుచున్నాడు. ఈ భ్రాంతియు మిథ్యయే. (అసద్రూపమే) కావున, 'ఈ భ్రాంతియెట నుండి వచ్చినది' అను విచారణ యుక్తము కాదు. ఓ మునీంద్రా! జ్ఞానప్రాప్త్యనంతరము నేనిపుడు అన్యరూపుడను కాలేదు. పూర్వము నాయందు ఎఱుంగబడక యున్న ఆత్మరూప బ్రహ్మమే యిపుడు యెఱుగబడినదై నిజస్వభావమగు ఆత్మరూపమున స్థితినొంది యున్నది. నా అజ్ఞానమిపుడు నశించినది. సంశయము లుడిగినవి. అనంత ఆత్మ (బ్రహ్మ) రూపమున నేనిపుడు సుస్థిరుడనై యున్నాను. వాసనారహితులును, తృష్ణా శూన్యులును, శమించిన ఇచ్ఛగల వారునగు సత్పురుషులకు ఇచ్ఛగింపకున్నను నిర్వాణ (ఆత్మ) స్వరూపత్వము స్వయముగ ప్రాప్తించుచున్నది. సమాధి, వ్యుత్థానకాలముల రెంటియందును సమాన బోధయుక్తుడై యుండు మనుజునకు సంసార విక్షేపము అశాంతిని కలుగజేయ జాలదు. తృష్ణారహితమై, స్వచ్ఛమై, శీతలమై (శాంతమై), నిర్వాణ రూపమైనట్టి బోధ (ఆత్మ) సత్తకొఱకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడ నిరంతరము

వాంఛించుచుందురు. తృష్ణారాహిత్యముచే ఆత్మజ్ఞానము వృద్ధియగును, ఆత్మ జ్ఞానముచే తృష్ణ నిర్మూలమగును. ఈ ఆత్మజ్ఞాన, తృష్ణారాహిత్య ములు రెండును కుడ్య, ప్రకాశములవలె 'పరస్పర మొకదానిచే నొకటి ప్రకటితమగుచుండును. ప్రయత్నముచే అనేకమందిలో ఎవడో మహాధైర్య యుతుడగు ఒకానొకడు మాత్రమే సింహము బోనును విరుగగొట్టునట్లు, వాసనాజాలమును ఛేదించివేయును.

శ్రీరామచంద్రుని అనుభవసిద్ధములగు ఆ వాక్యములను విని వసిష్ఠ మునీంద్రుడు సంతసించి, ఆతడు వచించినది యథార్థమే యనియు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులు, తాను (వసిష్ఠుడు) మున్నగు జీవన్ముక్తుడు సదాచిద్ఘనమగు నిర్వాణ (ఆత్మ) పదముననే స్థితినొంది యున్నవారై, సమాధి యందును వ్యవహార మందును గూడ సమానరూపమున (ఆత్మయందు) వర్తించుచుందురని తెలిపి, శిష్యుడగు శ్రీరామచంద్రుని పరీక్షార్థము 'సత్యము' గా కానుపించు ఈ జగత్తు మిథ్య యెట్లగునని, ఇత్యాది ప్రశ్నల నొనర్ప, 'కారణ అభావముచే ఈ జగత్తు ఏ కాలమందును ఉత్పన్నము కాకయే యున్నది; పరమాత్మయే యట్లు జగద్రూపమున వివర్తితమై భాసించుచున్నది - అని యివ్విధముగ నాతడు సమాధాన మొసంగి, తనకు (జగదాది) సమస్తము చిదాకాశమయ ముగ అనుభూతమగుచున్నదనియు, అట్టి బ్రహ్మరూపులగు గురువర్యులైన తమకు (వసిష్ఠునకు) నమస్కారమనియు తెలిపి రెండు ఘడియలసేపు మౌనముగనున్నవాడై నిశ్చలముగ సమాధియందుండెను. ఆ పిమ్మట లీలార్థ మాతడు వసిష్ఠ మునీంద్రుని యిట్లు ప్రశించెను - మునీంద్రా! స్వానుభవ మాత్రమును, అవాచ్యమును, వికల్ప రహితమునునగు పరబ్రహ్మము, వికల్పపూర్ణములగు శబ్దాదులచే పొందబడదు గదా! అట్టిచో గురు, శాస్త్రాదులు బ్రహ్మ (ఆత్మ) జ్ఞానప్రాప్తికి కారణములగునో, కాదో తెలుపవేడెద - అది విని వసిష్ఠ మునీంద్రు లిట్లు ప్రత్యుత్తరించెను - ఓ రామచంద్రా! నీవు తెలిపినది సత్యమే. బ్రహ్మ జ్ఞానమునకు గురు శాస్త్రాదులు (సాక్షాత్తుగ) కారణము కాదు. అయినను అవి యెట్లు కారణత్వమును బొందినవో వినుము -

## కాష్ఠవైవధికోపాఖ్యానము

వైవధికులు (కావిడి మోయువారు) అగు నీచజాతి శూద్రులు కొందఱొక చోట వసించుచుండిరి. దారిద్ర్యబాధచే క్రుంగుచున్న వారొకపుడు తమ జీవికా నిర్వహణోపాయమునకై యోచించి, తుదకు కట్టెలు కొట్టి, వాని నమ్ముకొని జీవించుటకై నిశ్చయించిరి. తదనుసారము వారు పగలంతయు పరిశ్రమచేసి అరణ్యమున కట్టెలు కొట్టి తెచ్చి వానిని అమ్మి లభించిన ద్రవ్యముతో పొట్టపోసికొనుచుండిరి. వారు పోవుచుండిన యరణ్యమున అనేక విధములైన రత్నములు, సువర్ణము, చందనాది ఉత్తమ కాష్ఠములు కూడ నుండెను. కాష్ఠ వాహకులగు వారిలో కొందరికి సౌభాగ్య వశమున రత్నములు, కొందఱికి సువర్ణము, ఈ ప్రకారముగ లభించుచుండ, వానిచే వారు దారిద్ర్య రహితులును, ధన్యాఢ్యులునైరి. ఇట్లుండ నొకసారి వారికి అచట దైవయోగముచే చింతామణియే లభింప, దానిచే వారికి సమస్తైశ్వర్యములు, వాంఛితములు సంప్రాప్తము కాగా, సుఖముగ వసింప దొడగిరి. కట్టెల కొఱకు ప్రయత్నించు నప్పటికిని సౌభాగ్యవశమున వారికి చింతామణి దొఱికెను. అట్లే ఓ రామచంద్రా! పరమార్థమందిచ్ఛలేక గురు శాస్త్రాదికమందు భోగార్థము (భోగములు నాకు ప్రాప్తించుగాక! యను కోరికచే) జనులు ప్రవృత్తులైనను. అభ్యాసముద్వారా వారికి క్రమముగ చింతామణి రూపమగు పరమాత్మ పదము లభించుచున్నది. స్వభావముగనే పరోపకారము కొఱకు శాస్త్రములందు, అన్యకారములందు ప్రవృత్తుడగు వాడే సాధువనబడును. అతని స్వాభావిక చేష్టలే అతని సాధుత్వమునకు ప్రమాణము. ఓ రామచంద్రా ! శాస్త్రాభ్యాసముచే చిత్తము శుద్ధమగును. అత్తఱి భోగములయెడల ఇచ్ఛారాహిత్యము జనించును. తద్ద్వారా జీవుడు బ్రహ్మపదమును శీఘ్రముగ గాంచును. ఈ ప్రకారము గురు శాస్త్రాదులు బ్రహ్మజ్ఞానమునకు సాక్షాత్తుగ కారణములు కాకున్నను, కారణత్వమును బొందినవి. శాస్త్రాభ్యాసముచే అవిద్య యొక్క సాత్త్వికభాగము వృద్ధియగును. ఆ సాత్త్విక భాగముచే తామస భాగము నశించును. చేతి మురికి మట్టిచే కడిగివేయబడునట్లు శాస్త్ర జనిత వివేకముచే క్రమముగ అవిద్య కడిగివేయబడగా ఉపాధిరహిత జ్ఞేయమగు ఆత్మయొక్క జ్ఞానము

కలుగుచున్నది. కుతర్క, వివాదముల కొఱకు గాక జ్ఞానము కొఱకగు శాస్త్రాభ్యాసమే నిజమైన శాస్త్రాభ్యాసము. ఏ జ్ఞానమందు ఆత్మదర్శనముచే సర్వత్ర సమత్వము జనించునో అదియే నిజమైన జ్ఞానము. ఏ సమత్వమందు జాగ్రత్తునందే సుషుప్తి (నిర్వికల్ప ఆత్మస్వరూపమందు స్థితి) సంభవించునో, అదియే నిజమైన సమత్వము.

ఓ రామచంద్రా ! మనుజుడు బాల్యావస్థయందే ఈ జగతుయొక్క యథార్థ స్థితి (జగత్తు భ్రాంతి మాత్రమను సత్యము) నెఱింగి, ఆత్మజ్ఞుడై సమత్వము నవలంబించియే ప్రపంచమున విహరింపవలెను. సమత్వముచే సర్వజీవుల హితమొనర్చుచు యథాప్రాప్తములగు వ్యవహారముల నాచరించుచునుండి మనుజులకీ జగత్తునందలి సంపదయంతయు దాసి యగును. సమత్వముచే జనించు ఉత్తమ సుఖము రాజ్యాదులచే గూడ లభింపజాలదు. ఆత్మజ్ఞానజనిత సమత్వము నవలంబించియే శిబి, అంగ, సాల్వ, జనకాది రాజులున్ను, ధర్మవ్యాధాదులున్ను లోకమున వ్యవహరించిన వారై పరమశాంతిని బొందిరి.

ఓ రామచంద్రా ! ఆత్మజ్ఞానము బొందిన జీవన్ముక్తులకు కర్మములను త్యజించుటచే గాని, గ్రహించుటచేగాని ప్రయోజనము లేదు. అయినను, యథాప్రాప్తములగు కార్యములను లోకసంగ్రహార్థము జీవన్ముక్తులు నిష్కామ బుద్ధితో అచరించుచునే యుందురు. కొందఱు రాజులై వెలయుచు రాజ్యమును పాలించుచుందురు; కొందఱు ఏకాంతమున ధ్యానపరాయణులై యుందురు; కొందఱు తీర్థయాత్రాపరులై, కాశ్యాది పుణ్యక్షేత్రముల సేవించుచు నుందురు, మఱి కొందఱు పైకి పిచ్చివారివలె నుందురు; ఓ రామచంద్రా ! సంసారమును తరించుటకు వనవాసముగాని, కష్టదాయకమగు తపస్సుగాని, కర్మ గ్రహణము గాని, కర్మ త్యాగముగాని కారణములు కావు. తన శుద్ధ సచ్చిత్స్వభావమందలి స్థితియే సంసారోత్తరణమునకు కారణము. ఎవని మనస్సు విషయము లందాసక్తముగాక యున్నదో, అతడు సంసారమును దాటినట్లే యెంచుము. ఆత్మదర్శన మాత్రముచే నిర్మలత్వమును బొందిన చిత్తము నిర్వికార బ్రహ్మరూపమేయగు చున్నది. ఓ రామచంద్రా ! నీ విపుడు పొందదగిన జ్ఞానసారమైన పరమార్థ

వస్తువు (బ్రహ్మము)ను బొందితివి. కాబట్టి నీ కిక బోధింపదగిన జ్ఞానోపదేశ మేమియును లేదు.

శ్రీ వాల్మీకి - వసిష్ఠ మునీంద్రుడిట్లు వచించి మౌనమును వహించెను. అత్తఱి శ్రీరామచంద్రుడు బ్రహ్మపద ప్రాప్తిచే సమస్త ఏషణారహితుడాయెను. సభికులెల్లరు ధ్యానమగ్నులై బ్రహ్మానందము నాస్వాదించుచు నిశ్శబ్దముగ నుండిరి. అపుడు సిద్ధులు, మొదలగువారు సాధువాదము (స్తుతి)ను గావించిరి. దుందుభుల మ్రోగించి, పుష్పవృష్టి గురిపించిరి. వసిష్ఠమునీంద్రు డుపదేశించిన అట్టి దివ్యబోధను తామిది వఱకెపుడును కని విని యుండలేదని వచించిరి. ఆ పిమ్మట అచటనున్న వారందరు వినమ్రులై వసిష్ఠమునీంద్రుని పుష్పాదులతో పూజించిరి. అనంతరము దశరథుడు చేత అర్ఘ్యపాత్ర నిడుకొని, అమ్మునీంద్రుని బూజించుచు నిట్లనెను - మహాత్మా! తమ యుపదేశముచే ఆత్మవస్తుబోధ వలన మా యంతఃకరణమున పరమ పూర్ణత్వముదయించినది. మునీంద్రా! నాతో సహా నాయొక్క రాజ్యాదిసమస్తమును తమకర్పణ చేయుచున్నాను. ఇక మమ్ముల తమ యిచ్ఛానుసార మాజ్ఞాపింపుడు. ఆ వాక్యముల విని వసిష్ఠమునీంద్రుడు - ఓ రాజా ! బ్రాహ్మణులమగు మేము నమస్కారమాత్రముచే సంతుష్టులము. రాజ్యపాలన క్షత్రియు లగు మీకే శోభించును' అని చెప్ప, ఆ పిమ్మట శ్రీరామచంద్రుడు పరమ భక్తితో గురుచరణములను మరల మరల ప్రణమిల్లెను. తదుపరి శత్రుఘ్న లక్ష్మణాదులున్ను గురువునకు నమస్కరించిరి. ఆ తరువాత వసిష్ఠమునీంద్రుడు విశ్వామిత్ర, వామదేవాది ఋషులను, మునులను సంబోధించి తానింతవఱకు చెప్పిన దానియందేదైన అసంగతమైనది, దోషయుక్తమైనది యున్నచో దయచేసి తెలుపుడని యడుగగా, సభ్యులందరును 'తమ బోధయందు దోషయుక్తమైనది యెన్నటికిని సంభవింపజాలదు. మా అజ్ఞానమంతయు తమ దివ్యబోధచే క్షాలితమైనది అట్టి మహాగురు స్వరూపులగు తమకు నమస్కారము' అని ముక్తకంఠముతో బలికి అమ్మునీంద్రునకు పుష్పాంజలుల సమర్పించిరి. సిద్ధులు వసిష్ఠ, దశరథ, శ్రీరామచంద్ర విశ్వామిత్రాదులను స్తుతించి పుష్పవర్షము కురిపించిరి. సభ్యులున్ను ఆ సిద్ధాదులను బూజించిరి.

అనంతరము వసిష్ఠమునీంద్రుడు శ్రీరాముని నుద్దేశించి 'ఇపుడు నీ స్థితి నీకెట్లనుభూతమగుచున్నది? ఈ జగదాభాస యెట్లు గోచరించు చున్నది' అని ప్రశ్నింప అతడిట్లు ప్రత్యుత్తరించెను - 'మునీంద్రా ! తమ యనుగ్రహముచే నేను ఆత్మయందు స్థితిగలవాడనై పరమ నైర్మల్యమును బొందితిని. నా భ్రాంతి యంతయు నశించినది. దేహమాత్ర శరీరుడనై అపుడు యుంటిని. ఇపుడో బ్రహ్మాండ శరీరుడనై యున్నందున ఈ జాగ్రత్తునందే సుషుప్తునివలె తృప్తుడనై, శాంతుడనై వెలయుచున్నాను. ఈ జగత్తును నిర్మల చిదాకాశ మాత్రముగనే వీక్షించుచున్నాను. ఇక నేను విషయ ( భోగ) ఆశలచే బంధింపబడజాలను. పరమాత్మ స్వరూపుడనగు నాకు నా ననుస్కారము. మునీంద్రా! ఈ దేహమున్నంతవఱకు నిర్మల దృష్టితో లోకమర్యాదను పాలించెదను. ఇక తమ యిచ్ఛానుసారము నన్నాజ్ఞాపింపుడు' అది విని అమ్మునీంద్రుడిట్లనియె - 'ఓ రామచంద్రా ! నీవు మహాపవిత్రమగు బ్రహ్మపదమును బొందితివి కావున చాల సంతోషము. ఆత్మజ్ఞుడవై నీవు భూత, వర్తమాన, భవిష్యత్ రఘుకుల సంతతిని పవిత్ర వంతము జేసితివి. ఇక నీ విపుడు విశ్వామిత్ర మునీంద్రుని యభీష్టమును నెరవేర్చి, ఆ పిదప తండ్రితో సహా రాజ్యపాలన మొనర్చుచు సుఖముగ నుండుము.'

ఈ ప్రకారముగ వారిరువురును అధ్యాత్మ విచారణా తత్పరులై యుండ నింతలో మధ్యాహ్నము కాగా, తత్కాల సూచకములగు శంఖారావములు మ్రోగింపబడ, అపుడు వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునితో నిట్లనెను - 'ఓ రాఘువా! వినదగినది యంతయు నీవు వింటివి. జ్ఞేయవస్తువు ( బ్రహ్మము) ను గూడ నీవు పూర్ణముగ నెఱింగితివి. ఇక తెలిసికొనదగినది అన్యము నీకేమియును లేదు. నేనుపదేశించిన దానిని, నీవు శాస్త్రములవలన ఎఱింగిన దానిని, స్వయముగ అనుభవమొనర్చుకొనిన దానిని ఏకార్థ పరత్వరూపమగు ఏకవాక్యముగా (ఏకార్థ బోధకముగా) నొనరింపుము' - తదుపరి వసిష్ఠమునీంద్రుని యుపదేశానుసారము దశరథుడు శ్రీరామచంద్రునితో సహాముని, బ్రాహ్మణ, నృపాలుర, సిద్ధాదులను అనేక రీతుల దానమానాదులచే సత్కరించెను. పిమ్మట సభ్యులెల్లరు లేచి వారి వారి నివాసములకేగి దైనిక

క్రియల నాచరించుకొని, ఆ రాత్రి గడపి మరునా డుదయమున తిరిగి సభాస్థలమునకు విచ్చేసిరి. శ్రీరామచంద్రునకును ఆ తక్కిన వారికిని ఆ రాత్రి పరమార్థ చింతనమున శీఘ్రముగ గడచిపోయెను. సభాస్థలమునకు విచ్చేసిన పిమ్మట శ్రీరామచంద్రుడు, 'ఇంకేమైన నేను వినదగినది యున్నచో తెలుపుడని' వసిష్ఠుని యడుగ, 'పొందదగిన ఆత్మవస్తువును పొందితివి గావున నీవు కృతకృత్యుడవైతివి' అనియు కావున ఇంక వినదగినది యేదియును లేదనియు, తానే తన యనుభవమిపు డెట్లున్నదియు తెలుపవ లెననియు వసిష్ఠుడు కోరగా, అంతట శ్రీ రామచంద్రుడు తన పరిపూర్ణత్వమును, జ్ఞేయ (ఆత్మ) అనుభవమును ఆత్మ విశ్రాంతిని గూర్చి తెలిపెను.

అనంతరము వసిష్ఠమునీంద్రుడు మరల శ్రీరామచంద్రునకిట్లు పరమార్థో పదేశమును గావించెను - ఓ రామచంద్రా ! ఈ జగత్తు స్వప్నతుల్యము, కారణము లేక ఏది భాసించునో అది లేనిదేయగును. బ్రహ్మమొకటియే సత్యమైనది. ఇవ్విషయమున పూర్వము కుశద్వీప మందలి ఇలయను పట్టణమును బాలించు ప్రజ్ఞప్తియను రాజు నన్నడిగియుండెను. ఏదో యొక కారణవశమున నేనా రాజువద్దకు పోగా అతడు నన్ను పూజించి, సభామధ్యమున 'ఈ సృష్టికి కారణమేమి, ఈ ప్రాణులెవరు? బుద్ధ్యాదులేమి? ఈ లోకములకు కర్త యెవరు?' - ఇత్యాది యనేక ప్రశ్నలను నన్నడుగ, 'ఈ జగత్తు బ్రహ్మముయొక్క స్వప్న, సంకల్ప నగరమువంటిదే యగుచో అవిద్యచే చిదాకాశమున కల్పింపబడినది యనియు, ఆత్మజ్ఞానముచే జీవుడు వాసనారహితుడు కాగా అతని మోహము, అజ్ఞానము శమింప, పరమార్థ సత్యము గోచరించుననియు, అపుడు దృశ్యములేనిదై ఈ జగత్తు బ్రహ్మమాత్రము గనే శేషించుననియు, ఇట్టి మదుపదిష్ట అధ్యాత్మమార్గమున జనుచో, నీవు సర్వ దుఃఖరహితుడవై జీవన్ముక్తుడవు కాగలవనియు' - ఈ ప్రకారముగ నేను సమాధానమొసంగి, అతనిచే పూజితుడనై అచ్చోటు వీడి స్వర్గమునకు బోయితిని.

ఓ రామచంద్రా ! నీవున్ను అట్టి ఉత్తమ జ్ఞానదృష్టి నవలంబించి, శాంత మనస్కుడవై, చిదాకాశరూపుడవు కమ్ము. పూర్వమొకానొక

రామావతారమున నేను గురువును నీవు శిష్యుడవునునై యుండ ఒకానొక వనమున నీవు ఇప్పటి వలెనే జగద్విషయమును గూర్చియు, చిత్ప్రతిభను గూర్చి నన్ను బ్రశ్నింప నేను సమాధానమొసంగి యుంటిని. ఈ దృశ్యమేమి' యని నీ వడిగినపుడు, చిదాకాశమే యట్లు స్ఫురించుచున్న దనియు, చిదాకాశరూప పరమాత్మకంటె అన్యముగ ఏదియును లేదనియు, అట్లెఱింగినచో ఈ దృశ్యము పరమ శాంతిరూపమై వెలయుననియు, ఎఱుగనిచో దుఃఖప్రదమై యొప్పుననియు, జగత్తు వాస్తవముగ చిద్రూప పరమాత్మయే యనియు నేనపుడు బోధింప, నీకపుడు జ్ఞానము కలుగలేదు. ఇపుడు మరల దశరథ పుత్రుడవై జనించి ఆ విషయమునే నన్నడిగితివి. నేనుపదేశించిన యీ ఆత్మజ్ఞానముచే నీవు అజ్ఞానమును దూరీకృతము చేసి యథాప్రాప్తములగు వ్యవహారముల నాచరించుచు నిరతిశయానంద రూపమగు ఆత్మయందు సుస్థితుడవై యుండుము. మఱియు అట్టి నిర్మల బ్రహ్మ (ఆత్మ) మందు వెలయుచు, దృశ్యపదార్థ దృష్టిరహితుడవై, నిర్వాణరూప బ్రహ్మానంద మున మగ్నుడవై, తృష్ణావివర్జితుడవై సమదృష్టితో రాజ్యపాలన యొనర్పుము.

వసిష్ఠమునీంద్రుడిట్లు బోధింపనంతట దేవదుందుభులు మ్రోగెను. ఆకాశమునుండి పుష్పవృష్టి కురిసెను. ఆ దివ్య కుసుమములగైకొని సభ్యులెల్లరు వసిష్ఠమునీంద్రుని చరణ సరోజముల బూజించిరి. పిమ్మట దశరథ, శ్రీరామచంద్ర, లక్ష్మణ, శత్రుఘ్న, విశ్వామిత్ర, నారదాదులు - మునీంద్రుని యట్టి అపూర్వబోధచే తమ జన్మ పావనమైనదనియు, తాము కృతకృత్యులమైతిమనియు, అట్టి యుత్తమ దివ్యబోధను తామిదివరెన్నడును వినియుండలేదనియు, తత్ప్రబోధ ఫలితముగ ఆత్మ స్వరూపమున వారికి స్థితి చేకూరినదనియు - ఈ ప్రకారముగ ఒక్కొక్కరు లేచి మునీంద్రుని యెడల తమ కృతజ్ఞతను వెలిబుచ్చుచుండ నంతట వసిష్ఠ మునీంద్రుడు అధ్యాత్మ కథాంతమున తత్సాఫల్యతకొఱకును మంగళ సూచకముగను ద్విజులను బూజింప దశరథున కాజ్ఞయొసంగ, ఆ నృపాలుడు దూతలద్వారా పదివేల ఉత్తమ బ్రాహ్మణులను వివిధ దేశములనుండి యాహ్వానించి వారినందఱిని ఉచిత

రీతి భోజన, దాన, సన్మానాదులద్వారా సత్కరించెను. మఱియు నగర నివాసులను, మంత్రులను, భృత్యాదులను, దీనులను, కృపణులను, భోజనాదులచే సంతృప్తిపఱచి యా రాజు మహోత్సమును జరిపెను. అపుడా రాజగృహమున, నగరమందలి ప్రతి గృహమున, గాన నృత్యాదులు సలుపబడెను. బ్రాహ్మణులు వేదపాఠమును గావించిరి. అక్షయ బ్రహ్మపదమును బొందిన యా దశరథ మహారాజు జ్ఞానభానూదయ సంజనిత మహదానందముచే ఈ ప్రకారముగ ఏడు రాత్రులు మహోత్సవమును జరిపెను.

వాల్మీకి – ఓ భరద్వాజా ! ఈ ప్రకారముగ రామాదులు జ్ఞేయము (ఆత్మ) నెఱింగి దుఃఖరాహిత్యమును బొందిరి. నీవున్ను అట్టి యుత్తమదృష్టి నవలంబించి, శాంత చిత్తుడవై, జీవన్ముక్తుడవై సుఖముగ నుండుము. ప్రత్యక్షముగ ఆత్మానుభవమును గలిగింపజేయు ఈ పవిత్ర మోక్షోపాయ గ్రంథమును వినినచో సామాన్యుడైనను ఆత్మజ్ఞానమును బొందును; ఇక నీ వంటి విచారణాపరుల విషయమై వేఱుగ చెప్పవలెనా? మహా అనుభవ ప్రదమగు ఈ మోక్షపాయము నెఱుంగువారు తత్త్వజ్ఞులై భవబంధవిముక్తిని బడసి మరల యీ సంసారమున జనింపకుందురు. పూర్వము నాచే రచింపబడిన యీ మోక్షోపాయ సంహితను విచారించి బ్రహ్మదేవుడు మునుల సమాజమున సత్య వ్యక్తలగు వసిష్ఠ, వాల్మీకుల వాక్కు అసత్యమెన్నటికిని కానేరదు' అని పలికెను. ఓ భరద్వాజా ! నీకు బోధించిన యీ బ్రహ్మతత్త్వ ప్రతిపాదకముగు మోక్షోపాయ నిర్మల శాస్త్రమును బాగుగ విచారించి, తద్రీతి యనుష్ఠించి జీవన్ముక్తుడవై, నిరతిశయ బ్రహ్మానందరూప ముక్తిని బడయుము.

ఈ ప్రకారముగ వాల్మీకి మహర్షి తాను భరద్వాజున కుపదేశించిన దానిని అరిష్టనేమి రాజునకు వచింప, ఆ రాజు దానినంతయు వినిన పిదప 'మహాత్మా! తమరు యనుగ్రహించిన ఆత్మదృష్టిచే నేను సంసార సాగరమును దాటితిని' అని ఆ ఋషీశ్వరునకు దెలిపెను. పిదప ఆ రాజు దేవదూతతో నిట్లనెను – ఓ దేవదూతా ! నీకు నమస్కారము. ఇక నీవు ఇంద్రలోకమునకు బొమ్ము. ఋషీశ్వరుడు వచించిన దివ్య బోధను విచారించుచు నేనిచటనే సుఖముగ నుండెదను. అట్టి జ్ఞానసారమును నే

నిదివఱకెన్నడును వినియుండలేదు. దానిని విని నేను మిగుల తృప్తిని, ఆనందమును బడసితిని.

దేవదూత - ఓ అప్సరసా ! పిమ్మట నేను వాల్మీకి మునినుండి యాజ్ఞ గైకొని యిచటకు వచ్చితిని. ఇక నిపుడింద్ర లోకమునకు బోయెదను.

అప్సరస - ఓ దేవదూతా ! నీవు వచించిన శాస్త్రవా యొక్క అర్థజ్ఞానముచే నేను పరమశాంతిని బొందితిని. కృతార్థనైతిని; దుఃఖరాహిత్యమును వడసితిని. ఇక నింద్రుని కడకేగుము. నీకు శుభమగు గాక !

అగ్ని వేశ్యుడు:- ఓ కారుణ్యా ! అనంతర మాయప్సరస దేవదూతోక్తమగు బ్రహ్మైక్య రూపార్థమును చింతనజేయుచు గంధమాదన సమీపమున హిమాలయ శిఖరముపై నుండెను. పుత్రకా! ఇట్లు వసిష్ఠోపదేశమును నీవు వింటివి. దీనిని విచారించి యిక నీ యభీష్టము చొప్పున వర్తింపుము.

కారుణ్యుడు:- తండ్రీ ! తత్త్వజ్ఞానముచే నిపుడీ సంసారస్థితి మృగతృష్ణవలె మిథ్యారూపమున గోచరించుచున్నది. నాకిక కార్యముల జేయుటచే గాని, చేయుకుండుటచేగాని ప్రయోజనములేదు. అయినను శ్రీరామచంద్రునివలె యథాప్రాప్త వ్యవహారముల నాచరించుచునుండెద. కర్మల జేయుకుండుటయందే పట్టుదల యేల!

అగస్తి - ఓ సుతీక్ష్ణా! జ్ఞానముచే కృతార్థుడైన కారుణ్యుడా ప్రకారముగ యథోచిత వ్యవహారముల నాచరించుచు నుండెను. కావున జ్ఞాన, కర్మల విషయమై ఇక సంశయము గలిగియుండరాదు.

సుతీక్ష్ణుడు (గురువునకు నమస్కరించి) - మహాత్మా ! నా అజ్ఞానము నశించినది. సర్వోత్తమ (ఆత్మ) జ్ఞానము కలిగినది. 'ఈ జగత్తంతయు పరమాత్మయే. పరమాత్మకంటె భిన్నముగ అణుమాత్రమైనను ఏదియు లేదు.' ఇట్లు నిశ్చయించి యథాప్రాప్తములగు కార్యముల నాచరించెదను. తమ యనుగ్రహముచే నేను కృతార్థుడనైతి. తమకు సాష్టాంగ నమస్కార మాచరించుచున్నాను. గురువు ఒనర్చు

ఉపకారమును శిష్యుడు ఏ కర్మచేతను తీర్చజాలడు. శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను తనను గురు చరణములందు సమర్పించు కొనుటచే మాత్రము తీర్చగలడు. తమ కృపచే నేను సంసార సాగరమును దాటితిని. ఇపుడు నిజ సచ్చిత్పూర్ణానందరూపముచే బ్రహ్మాండ సమూహమును పరిపూర్ణ మొనర్చి వెలయుచున్నాను. ఎద్దానియందీ జగత్తంతయు ఉత్పన్నమై, స్థితిగలిగి, లయించుచున్నదో అట్టి పరబ్రహ్మమునకు నమస్కారము.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం శ్రీవసిష్ఠం నతాః స్మః

బ్రహ్మానందరూపుడును, (జ్ఞానోపదేశము ద్వారా) మహాసుఖ మును కలుగ జేయువాడును, కేవలము జ్ఞానస్వరూపుడును, సుఖదుఃఖాది ద్వంద్వాతీతుడును, ఆకాశము వలె నిర్మలుడును, సర్వవ్యాపకుడును, 'తత్త్వమసి' ఇత్యాది వేదవాక్యము లకు లక్ష్యభూతుడును, ఏకరూపుడును, నిత్యుడును, నిర్మలుడును, నిశ్చలుడును, సమస్త బుద్ధులకు సాక్షిభూతుడును, భావాతీతుడును, త్రిగుణరహితుడును నగు శ్రీ వసిష్ఠ మునీంద్రునకు (తద్రూప బ్రహ్మమునకు) మేమందఱమును నమస్కరించు చున్నాము.

హరిః ఓం తత్ సత్

ఓమ్